# తల్లివిన్కి

(లలితాసహస్ర నామాచ్ఛాంధ్ర పద్యవివృతి)

పరమభాగవత

ఆదిభట్ల నారాయణదాసుఁడు

సంపాదకుఁడు

ఆచార్య ఓరుగంటి నీలకంఠశాస్త్రి

ప్రకాశకుఁడు

కట్టా ఈశ్వరరావు

B. Com (Hons) B. L., F. C. A.

ప్రథమ ముద్రణము
ఆనంద మకరసంక్రాంతి
14-1-1975
ప్రతులు 1000


ప్రాప్తిస్థానము
శ్రీ కట్టా ఈశ్వరరావు
Officer. I. L. T. D. Company,
GUNTUR.

వెల : 15 రూపాయలు

ముద్రణము
పి. రామకృష్ణమూర్తి
మేనేజింగు డైరక్టరు
వెల్‌కంప్రెస్, ప్రై వి టి. లిమిటెడ్, బ్రాడీపేట 2వ లైను గుంటూరు-2.

# విషయసూచిక



# భూమిక

దాస భారతీ ప్రచురణలలో నాలవదానిగా ఈ తల్లి విన్కి - లలితా సహస్రనామ వివృతి - ఆవిర్భవించినది. హరికథా రచనలు తరువాత శ్రీ దాసుగారు, అనేక గ్రంథములు అచ్చ తెనుగులోనే, నియమముతో రచించిరి. వారి అచ్చ తెనుగు అభిమానము ఈ క్రింది పద్యమువలన తేట తెల్లమగును.

మొలక లేతదనము, తలిరులనవకము
మొగ్గ సోగదనము, పూవుతావి
తేనె తీయదనము, తెనుగునకేకాని
మోట లాతి నాటుమాటకేది.

నా అనుభవము, కొద్ది పరిశ్రమతో అచ్చ తెనుగు మాటల అర్థము తెలుసుకొనిన వారి రచనలు కడు సులువుగ సుబోధములగును. ఈ లలితా సహస్రనామ వివృతియందు ప్రతినామమును చక్కని అచ్చ తెలుగులో దాసుగారు వివరించిరి. పఠితలకు, మూరు మూలనున్న అచ్చ తెనుగు పదములకు వెంటనే అర్థము చేసికొని అన్వయించుకొనుటకు, 32 పుటల "లఘు టిప్పణి" అకారాది క్రమములో ఇవ్వబడినది. దాని సాహాయ్యమున గ్రంథమంతయు అర్థము చేసికొని ఆనందించుటకు వీలగును.

ఈ గ్రంథము శ్రీ నారాయణదాసుగారు, పరిణత వయస్కులై, బాగుగా జ్ఞాన సముపార్జనచేసిన పిమ్మట సుమారు తమ ఎనుబదవ ఏట మొదలిడి, తమ అవతారమును చాలించు సమయమునకు పూర్తి చేసిరి. అట్టి వయస్సులో వారు వ్రాసిన చిత్తును తమ ప్రియశిష్యులైన పేరి నరసింహమునకు నోటితో చెప్పి శుద్ధప్రతిని వ్రాయించెడివారు. తమ అవసాన కాలము సమీపించుచున్నదని ఎఱిగి తమ శిష్యుని శుద్ధప్రతిని కొన్ని సవ

రింపులతో, త్వరగా పూర్తి చేయుమని ఒత్తిడి చేయుచుండెడివారు. వారికి ఈ గ్రంధము మీద ఎంతమక్కువ యనిన, 1943–44 సంవత్సరములు, యుద్ధ సమయము, ఆరోజులలో తను కష్టార్జితధనము సుమారు వెయ్యి రూప్యములు ఎప్పుడు సిద్ధముగానుంచుకొని, తగిన కాగితము దొరికిన వెంటనే అచ్చువేయు సంకల్పముతో, తత్సంపాదనకై ప్రయత్నములు చేసి చేసి, తుదకు మండలాధికారి సాహాయ్యము వడసియు కంట్రోలు దినములలో కాగితమును సంపాదించలేక విఫలురైరి. ఆపుస్తకము అచ్చుపడక ఆనాటినుండి ఇప్పటివరకు అటులనే యుండిపోయినది.

ఈ విషయమును గుర్తెఱిగినవాడను కాబట్టి, ఈ గ్రంథము బహుళ ప్రజకు ఉపయోగించునో లేదో తెలియదుకాని శ్రీ దాసాభిమతానుసారము, ప్రప్రథమముగా అచ్చు వేయించ వలెనని సంకల్పించి, నాకోరిక ఆచార్య యస్. వి. జోగారావుగారికి విన్నవించుకొంటిని. కాని వారు నన్ను ఆ ఉద్యమమున నిరుత్సాహ పరిచి ప్రప్రథమముగ శ్రీ నారాయణదాస రచన "మేలుబంతి" అను గ్రంథము అచ్చువేసిన, సాహిత్యలోకమునకు ఉపయోగముగ నుండును. తదుపరి ఈ గ్రంథ ముద్రణ చేయవచ్చునని సలహాయిచ్చి, ముందు నాచే, దాసరచనలు మేలుబంతి, కచ్చపీశ్రుతులు, వ్యాసపీఠము - మూడు అచ్చు వేయించిరి.

ఒకనాడు. నేను నామిత్రులు జోగారావుగారు దాస భారతీ ప్రచురణల ప్రణాళిక వేయు సమయములో మాకిద్దరకు చక్కని ఊహారేఖ పొడమి, ఇటువంటి గ్రంథ ముద్రణకు సాయము చేయువ్యక్తి ఎవరా అని ఆలోచించగా వెంటనే మాకు వదాన్య శేఖరులు, సాహితీప్రియంభావుకులు। ఆధ్యాత్మిక విద్యయందుమిక్కిలి ఆసక్తిగలవారు, రసజ్ఞశేఖరులు శ్రీ పోలిశెట్టి సీతారామాంజనేయులుగారు మనస్సులో మెదలిరి. ఆ మరునాడే మేమిద్దరము వారిని దర్శించి మా ఉద్యమమును విన్నవించుకొనగా. అంతయువిని, వెంటనే అచ్చువేయించుటకు తమ ఆమోదము తెలిపి, ఈ పుస్తక ముద్రణకు అగుఖర్చు ఎంతఅగునో తెలుపుమనిరి. తరువాత కొల్దిి

దినములయిన పిమ్మట, ముద్రాపకులవద్ద పుస్తక ముద్రణకగు ఖర్చు జాబితా తీసుకొని శ్రీ సీతారామాంజనేయులగారి దగ్గరకు వెళ్లగా వారు అది చూచి 500 ప్రతులు అచ్చువేయుటకు అంగీకరించి, మమ్మలను కార్యోన్ముఖులను చేసిరి. తరువాత చక్కని లలితా పరమేశ్వరి త్రివర్ణ చిత్రము, శ్రీ చక్రముకూడ నున్న బాగుండునని శ్రీ ఆంజనేయులుగారు సెలవీయగా వానిని గూడ సేకరించి, ఇందులో వేయించితిమి. భక్తులు, సాహితీ వేత్తలు ఈ ముఖచిత్రములు చూచి ఆనందింతురని మాఅభిసంధి. వారి సాహాయ్యమే లేకున్న ఈ పుస్తకము అచ్చు అగుట చాల పరిశ్రమ తోకూడుకొన్నపని. ఇంత త్వరలో మేము ప్రచురించి యుండెడివారము కాము వారి సాహాయ్యమునకు ఆ పరమేశ్వరియే తుష్టురాలై వారికి, వారి కుటుంబమునకు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక అని ప్రార్థించుచున్నాను.

ఇది పారాయణ గ్రంథముగా నుండుటకు, నిత్యపారాయణ కనుకూలముగా, తొలుదొలుత లలితా సహస్రనామములు అచ్చువేయించితిమి తరువాత ప్రతినామము ప్రత్యేకముగా శ్రీ దాసుగారి వివరణతో అచ్చు వేయబడినది

ఏతద్గ్రంథమునకు సంపాదకత్వము వహింపుడని మేము కోరిన వెంటనే, వేదాంత పారీణులు, ఉభయ భాషా ప్రవీణులు బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి మహోదయులు, సంతోషముతో అంగీకరించి గ్రంథమునంతయు ఆమూలాగ్రము చదివి, తమ అమూల్యమైన తొలిపలుకుతో పాఠకలోకమునకందించిరి. తాము విశ్వ విద్యాలయమున పరిశోధకులుగా తమకాలమునంతయు వినియోగించు చున్నపుడు, శ్రీదాసుగారి మీద భక్తివలన, మామీదనున్న అభిమానము పురస్కరించుకొని తమ అమూల్య కాలమును వీని కొరకై వినియోగించి ఈ పుస్తకము ఈ రూపముగా అచ్చు అగుటకు సహాయమునందచేసిరి. వారికి నాకృతజ్ఞతా పూర్వకములైన అభినందనములు,

శ్రీ నీలకంఠశాస్త్రి గారికి తోడుగ, మరి యిద్దరు పండితులు బ్రాహ్మభూషణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, పరమ మాహే శ్వరులు, పండిత పరమేశ్వరులు శ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారు శ్రీ దాసుగారి అచ్చతెనుగు అనువాదమును చదివి ఆనందించి వారి అభి ప్రాయములొసగిరి వారికి గూడ మా అభినందనలు.

ఈ గ్రంథ ముద్రణ విషయములో అనేక సలహాలు ఇచ్చి ముద్రణ చేయురీతిని ప్రణాళికను చేసి, ఈ పుస్తకము చివరి నాలుగు అనుబంధములు రచియించి, దాసభారతిని సుందరముగా ఉజ్జ్వలింపచేసిన మహాకవి, మధుర సరస్వతి, ఆచార్య యస్. వి. జోగారావు గారికి నాన మస్సుమనస్సులు. అంతియేగాక ముద్రణ ప్రదాత అయిన శ్రీ పోలిశెట్టి సీతారామాంజనేయులు గారి వంశావళి పద్యములు మేము కోరినవెంటనే వ్రాసిపెట్టి మాకృతజ్ఞ ను ముద్రణ ప్రదాతలకు వెల్లడి చేసికొనుటకు సదవకాశము కల్పించిరి ఈ కార్యమునకు వారికి మాప్రత్యేక అభినంద నలు సమర్పించు కొనుచున్నాను.

తెలుగు పాఠకులు, కొంచెము ఓపికతో శ్రీ దాసుగారి అనువాద మును చదివి, దాస హృదయమును అర్థము చేసికొని ఆనందించి మా ప్రయత్నమును సార్థక పఱతురు గాక! అచ్చ తెనుగు గ్రంథరాజములలో ఇయ్యది ఎనలేనిదై వెలుగుగాక!.

ఇట్లు
కర్రా ఈశ్వరరావు,
ప్రకాశకుడు.

ముద్రణార్థ ప్రదాతలు

# "మహామాన్య" శ్రీ పోలిశెట్టి సోమసుందర శ్రేష్ఠిగారి వంశ ప్రశంస

ఆచార్య శ్రీ యస్వీ జోగారావు

శ్రీ తారుణ్యవతీ కటాక్షతతి రాసిక్య ప్రమాతల్ మహా
దాతల్ సంతత ధర్మ కార్య సవన స్నాతల్ సదా వాసవీ
దూతల్ భారతదేశ భక్తి సముపేతుల్ శేముషీ ప్రాభవ
ఖ్యాతుల్ శ్రీ మహితార్య వైశ్యకుల దుగ్ధాంభోధి జాతుల్ మహిన్. 1

విక్రమార్కుని రాజ్య చక్రముం ద్రిప్పిన
మతి బృహస్పతి మహామంత్రి భట్టి
దండి భారవి కాళిదాసుల ఘనత గం
పల కెత్తి చూపిన మాఘ సుకవి
సంగీత రత్నాకరాంగణమ్మున వాణి
నావహించిన శార్ఙ్గదేవ బుధుఁడు
తనువు ప్రత్యణువు నాతత దేశ భక్తియై
గండు మీరిన మహాత్ముండు గాంధి
ప్రాణ మొడ్డి యాంధ్రులకు స్వరాష్ట్ర సిద్ధి
నామతించిన పొట్టి శ్రీరామ సుకృతి
ఆర్య వైశ్య వంశమ్మున కాభరణము
లందు శ్రీ. పోలిశెట్టివా రాత్త యశులు. 2

వాత్రేయస గోత్రులు పరి
శుభ్ర చరిత్రులు బహువిధ శుభకార్యయశో

విభ్రాజిత దిగ్గాత్రు ల
దభ్ర. శ్రీ పాత్రు లేత దన్వయ జాతుల్. 3

ఆ వణిగన్వవాయమున నందటి కందఱు నార్ష ధర్మ స
ద్భావను లుత్తమోత్తము లుదారు లుదాత్తులు సాధువర్తన
శ్రీ వృతులైన వా రవతరించిరి నందనమందుఁ గల్గు నా
నా విధ పాదపమ్ములు దనర్చిన కైవడి కల్పకాహ్వలన్. 4

వారల దాన ధర్మ కృతివారము వాలున జాలువారు వాః
పూరము; కాశ్రిపాటి చెలువుల్, తమ స్వస్థల మౌచు సొంపు పెం
పారు చమళ్ల మూడి మడి మాన్యములున్ గుడి గోపురంబులున్
గిరితికిం బతాక లెసఁగింపఁగఁ గ్రాలిరి వారి పూర్వజుల్. 5

అమల తదీయ వంశ కలశాబ్ధి సుధాంశుఁడు భక్త హంసు డు
త్తమ సుమనో శిరంసుఁడు వదాన్య వితాన వతంసుఁ డార్య స
త్తముఁ డల బాపనయ్యకును దత్సతియౌ మహిళామతల్లి సీ
తమకును సోమసుందర బుధైఖధరుం డుదయించె శార్వరిన్. 6

ధన్యుఁ డగణ్య పుణ్యుఁడు వదాన్యవరేణ్యుఁడు కర్మవీరమూ
ర్ధన్యుఁ డనన్యతుల్య ధనధాన్యుఁడు సర్వజన ప్రశస్త సౌ
జన్యుఁడు సోమసుందరుఁడు సత్కుల దీపకుఁ డయ్యెరే! "మహా
మాన్యుఁడు" నా మహా బిరుద మండితుఁడై పొలు పొందె నాధ్యుఁడై. 7

శ్రీశైల సీమలో శివభక్త వసతి ని
ర్మాణ మతని యుదారతకు గుర్తు
పార్వతీపురిఁ బొక్కబడిదేవి గుడి కట్టు
బడి వాని భక్తి కేర్పడిన పడగ
గర్త పురస్థ శంకరమత స్థాపనం
బతని సత్కార్యదక్షతకు సాక్షి

హరిదాసులకు బాసు ఆస్తికులకుఁ దురు
ఘాసు అజ్ఞాడాదిభట్ట దాసు
కలికళాస్థితి కుల్కి కల్కి భారతి దాల్చు
రాగవు తావీజు త్యాగరాజు
నలుబది కోట్ల యెదల నదు లేకమై
క్రాలిన జనశక్తి కంధి గాంధి
పరతత్త్వ చింతన పాలసంద్రమున మం
దరము శ్రీ సోమసుందరము గారు

నల్వురును పుష్య దాత్మగుణాభిరతులె
బహుళ భూత దయామయ భవ్యమతులె
చెడుగు పంచమకారముల్ పడని వారె
పుష్య బహుళ పంచమి కహో! స్ఫూర్తి యిదియొ! 13

ఆ మహితానుభావునకు నాత్మకులాంగన కాదిదేవ నే
వా మధురాంతరంగ కనవద్య చరిత్రకు నాగరత్నమా
నామ మహా పతివ్రతకు నల్గురు పుత్రులు నైకసద్గుణ
స్తోములు నాగరార్యజన సోములు పుట్టిరి వంశవర్ధనుల్. 14

ఆ తేజస్వులఁ బ్రథముఁడు
సీతారామాంజనేయ శిష్టాగ్రణి వి
ఖ్యాత యశుఁడు విదురుఁడు మ
ల్లా తను పెత్తిన పగిది నెలర్పుచు నుండున్. 15

తాతలనాటి సంస్కృతికిఁ దా నొక పెత్తనదారువోలె నా
నా తపముల్ జపమ్ములు ఘనార్చనముల్ వ్రతముల్ ప్రతిష్ఠ లం
తా తనివారునట్టు లవదాత చరిత్రుఁ డతండు దాన ధ
ర్మాతత పుణ్యకార్యము లనంత మొనర్చుచునుండు నిచ్చలున్. 16

నాగరిక పురందరుఁ డేకనాథ గుప్త
ప్రాజ్ఞరత్నము వెంకట బాపనయ్య
సాధువర్తనుఁడు హరిప్రసాదరావు
ముగురు రామధర్మజుల తమ్ములకు నీడు. 17

శృంగేరి పీఠేశు చేత శోభయించిన
దగు శారదా విగ్రహ ప్రతిష్ఠ
ఆ కాట్రపాడ్పురి నాదర్శ పురముగా
రూపొందఁ జేయు నారూఢ నిష్ఠ
నెఱదాత జనకు పేర్నిలబెట్టు నొక మహా
ధర్మ సంస్థా వ్యవస్థాపనమ్ము
గర్తపురిని దండ్రిగారిపేర ఘన క
ళాశాల నెలకొల్పు లగ్గునేత
ప్రత్యహానేక దాన ధర్మాచరణము
నార్తజన రక్ష వేద విద్యావనంబు
సోమ సుందరాత్మజ యశశ్శోభ లివ్వి
వంశ గౌరవ వర్ధనాస్పదులు వారు. 18

అచిర భావి వారాణసి నన్నపూర్ణ
ప్రతిమకుఁ బునః ప్రతిష్ఠ, గోరంట్ల నగర
నన్నపూర్ణకు గుడి కట్టు నట్టి పూన్కి
నమరుత తదాశ్రితులకు పూర్ణాశనములు 19

శ్రీయుతు లీ యుదాత్తులు రసీకృత చిత్తులు చిత్త సంస్థిత
స్వీయ కులాధి దేవతలు వీరల కెల్లర కాదిభట్ల నా
రాయణదాస దివ్య హృదయస్థ లసల్లలితా మహానుకం
పాయతనాయితాంచిత కటాక్ష మహస్సు ప్రసన్న మయ్యెడున్. 20

---



'మహామాన్య' శ్రీ పోలిశెట్టి సోమసుందరం దంపతులు

# తొలిపలుకు

## ఆచార్య శ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రి

భారతదేశము అధ్యాత్మ విద్యకుఁ బుట్టినిల్లు. ప్రాచీన భారతీయులు ఐహిక సుఖములకంటెఁ బారలౌకిక సుఖములకుఁ బ్రాధాన్యము నిచ్చినవారు. వారు సామాన్య మానవుల కత్యంత ప్రీతిస్థానములగు నింద్రియసుఖములందు దోషమును గనిరి. ఇంద్రియములను నిగ్రహించి వశులై విషయవివర్జితమగు నధ్యాత్మ సుఖము ఉత్త మోత్తమమని భారతీయ తత్త్వవేత్తల నిర్ణయము. కావున అధ్యాత్మ జ్ఞానము వీరల కుఁ బ్రధానస్థానము నాక్రమించినది. లోకమునఁ గోటానుగోటులగు జన సమూహ మున ఆత్మజిజ్ఞాసువులు అల్పాల్పసంఖ్యగలవారు. అట్టివారల జ్ఞానమునకే ప్రాధాన్య మిచ్చినచో మిగిలిన జనుల పురుషార్థముల గతియేమి కావలయును ? మహర్షులీ విషయమును మఱువలేదు. తమ శాస్త్రములలోఁ బెక్కింటిని జనబాహుళ్యమునకే యుపయోగపడునట్లు చెప్పిరి. అట్లు చెప్పియుఁ దుదిని అధికారిని (యోగ్యతగలవానిని) బట్టి పురుషార్థ మతిశయించుచుండు ననుచుఁ గూడఁ దెల్పుచుండిరి. ఇది భారతీయ శాస్త్రకారుల పక్కిక. కావుననే భారతదేశమున పాకశాస్త్రము మొదలు పరబ్రహ్మ శాస్త్రము వఱకు ననేక విధములగు తత్త్వశాస్త్రములు బహురూపములతో వెలసినవి.

ఇట్లు వెలసిన యీ శాస్త్రములు భారతీయులకుఁ బరమప్రమాణస్థానము నలంకరించిన శ్రుతివిహితమగు ధర్మమునకు విరుద్ధములగు సిద్ధాన్తములను బ్రవ చింపఁగూడదని శాస్త్రకారులయాజ్ఞ. శ్రౌతధర్మవిరుద్ధ సిద్ధాన్తమును బ్రతిపాదించిన యాతఁడెట్టి మనీషియైనను ఎంతటి మహానుభావుఁడైనను ఆ సిద్ధాన్తము అనుపా దేయమనియే వారల చండతరశాసనము.

భారతీయులకిట్టి ప్రధానప్రమాణ పదవి నలంకరించిన శ్రుతి సకల ప్రాణి జాతమునకుఁగూడఁ గల్యాణ సంధాత్రియే యగుచు నట్టి కల్యాణమును ఆయా యధి కారులద్వారా లోకమునకు సమకూర్చుచున్నది. ఈశ్రుతి దాను కర్మ - ఉపాసన - జ్ఞానములనెడి మూడు భాగములతో నొప్పుచున్నది. ఇందుఁ గర్మభాగము మనుష్య మాత్రునకు వలయునట్టి ధర్మ - అర్థ - కామములను వారివారి యోగ్యతకుఁ దగు విధమునఁ బేర్కొనుచు నవ్వానికి సాధకములగు నుపాయములను బోధించును. ఇది

కేవలము బాహ్యసాధన ప్రధానమయి యొప్పుటచే అనంత భేదములతో వెలయు చుండును. కావుననే యొక్కొక్క వేదమున నీకర్మములే విపులమగు భాగముచే బోధింపఁబడుచుండును.

ఇఁక రెండవదియగు నుపాసన భాగముగూడఁ గర్మకాండముచే సాధింపఁబడు ప్రయోజనములనే గాక యవ్వానికంటె విశిష్టములగు ప్రయోజనములను సాధింపఁగల ప్రస్థానము; ఈ యుపాసనమంతయుఁ బ్రధానముగా మనోవ్యాపారాధీనమై యొప్పుచుండుట వలన దీనిని సాధింప యత్నించువారలు కర్మాధికారులకంటెఁ గూడ మానవశక్తి గలవారలు కావలయును. ఏలయన - ఉపాసనస్వరూపమే, విధిచోదితమగు వేదేని యొక దేవత నుద్దేశించి యితరమానసవృత్తులు చొరకుండ తైలధారవలె ఏకాకార చిత్తవృత్తి కరణము. ఇట్లు ఏకాకారముగాఁ జిత్తవృత్తుల నిలుపుటకు సాధకుఁడు అతిచంచలమగు మనస్సును నిగ్రహింపఁ గల్గియుండవలయును. ఇది చిరకాలాభ్యాససాధ్యము. అంతఃకరణమునకుఁగల తైక్ష్ణ్యము కార్యసాధకతా సామర్థ్యము బాహ్యకరణములకు లేదు. కావుననే శిష్టులు అంతరంగ సాధనము ప్రవర్తించుచున్నప్పుడు తద్విరుద్ధముగ బహిరంగసాధనము ప్రవర్తింప వేరదని చెప్పినారు.

ఇతరములగు సామాన్యైహిక ఫలములెట్లున్నను ఉపాసనమునకు ముఖ్యఫలము దేవతాసారూప్యము. ఇట్టి ప్రధానసారూప్యమునకే గౌణసారూప్యము శాస్త్రముచే విధింపబడుచున్నది. ఇట్టి గౌణసారూప్యముతో నభ్యస్తమగు నంతఃకరణము క్రమముగా ఉపాసనా నైశిత్యముతో ముఖ్యసారూప్యమునందును. 'నాదేవో దేవమర్చయేత్' 'నాశివశ్శివమర్చయేత్' అను మడులు ఈభావమునే తెల్పుచున్నవి. తానే దేవత నుపాసించునో యాదేవతాభావము దనయందు సంక్రమింపఁజేసికొని తన్నిమిత్తముగఁ దాద్రూప్యమునంది యనంతరము తద్దేవతోపాసనమును గావింపవలయును. అట్లు గానిచో నాదేవతనుపాసింపఁగూడదని పైస్మృతివాక్యములకర్థము. కావుననే యుపాసకుఁడు సప్రమాణముగ నుపాస్య దేవతాభావమును దనయందుఁ గల్పించుకొని యనన్తరము ఆ దేవతారూపమును ధ్యానశ్లోకోక్తప్రకారము భావించుచు నుపాసనమును గావింప వలయునని శాస్త్రతాత్పర్యము. అట్లే సంప్రదాయముగూడఁ జరగుచున్నది. కావుననే మంత్రాత్మకమగు దేవతారూపములు ఉపాసకుఁడు దనయందుఁ దొలుత న్యాసము కావించుకొని (ఆరోపించుకొని) అనంతరము ఉపాస్యదేవతారూపమును భావించి యుపాసనము గావించును. అపరిశుద్ధమగు నీమానుష దేహమునకు, దేవతారూపధారణమునకుఁదగుయోగ్యత లేకపోవుటచేఁ బాంచభౌతికమగు నీదేహమును

దేవతారూపధారణమునకుఁ దగు యోగ్యతగల్గునట్లు తొలుత బరిశుద్ధముచేయవలయును. అట్లు పరిశుద్ధిచేసిన వెనుక ఈదేహము దేవతారూపధారణాయోగ్యమగును గావున అపుడు దేవతారూప మంత్రన్యాసమును దేహమునందుఁ గావింపవలయును. అప్పుడు పాసకుఁడు దేవతారూపము నందినవాఁడగును గావునఁ దద్దేవతో పాసనమున కర్హుఁ డగును. ఉపాసకుఁడు దనయందు మంత్రన్యాసమును జేసికొనుటకుఁ బూర్వము తాను న్యసించు మంత్రముయొక్క ఋషిచ్ఛందో దైవతాది రూపములను దొలుత గుర్తెఱింగి యనంతరము న్యాసము గావించుకొనవలయును. అట్లుగానిచో ననర్థము గల్గునని —

“యో హవా అవిదితార్షేయ ఛందో దైవత బ్రాహ్మణేన మంత్రేణ యజతే యాజయతి వాఽధ్యాపయతి వా స్థాణుం వర్ఛతి, గర్తేవా పద్యతి, ప్రవామీయతే, పాపీయాన్ భవతి, యాతయామాన్యస్య ఛందాంసి భవన్తి । తస్మా న్మంత్రే మంత్రే ఏతాని విద్యాత్”

అని శ్రుతి పలుకుచున్నది. కావున ఋష్యాది పరిజ్ఞానముతోడనే యుపాసనమును గావింపవలయును.

ఈ యుపాసనము శాస్త్రప్రతిపాదితమగు దేవతానుగ్రహ సంపాదనమునకు సాధనమగుచుఁ దొలుత భేదదృష్టితో నొప్పుచున్నను గ్రమముగా నుపాసకుని యధికారానుగుణముగ దేవతతో నభేదభావము నందింపఁజేయు సామర్థ్యముగలది. కావుననే యుపాసనము భేదాభేదరూపమున వెలయుచుండునని మునులు వాక్రుచ్చిరి. ఇట్టి యుపాసనము శ్రుతియందుఁ గేవల భేదబోధకమగు కర్మకాండమునకును గేవలాభేదబోధకమగు జ్ఞానకాండమునకును మధ్యస్థానము నలంకరించి కర్మజ్ఞానములకు సేతురూపమునఁ బ్రకాశించుచు మార్గత్రయమునను బ్రాధాన్యమును వహించియున్నది. ఇఁకఁ దృతీయభాగముగా శ్రుతియందుఁ బ్రతిపాదింపఁబడిన జ్ఞానకాండము అత్యుత్తమమైనను అధికారివైరళ్యముచేతను, విరళాధికారులుత్తమ చిత్తశుద్ధిగల్గిన వారగుటచే సూత్రప్రాయముగఁదెల్పినను గ్రహించు వారలగుటచేతను వేదాంతములందుఁ గొలఁదిభాగముల చేతనే ప్రతిపాదింపఁబడుచున్నది. జనులలోఁ బెక్కురు పురుషార్థత్రయముననే యాసక్తులగుటచే సామాన్యాధికారముగల్గిన వారలనియే చెప్పవలయును. కావుననే యట్టివారల కుపయోగించు గ్రంథభాగము కర్మకాండ రూపమున విపులముగా నొప్పుచున్నది. అంతకంటె సునిశితప్రజ్ఞులయి పురుషార్థత్రయమునే గాక తురీయపురుషార్థమును గూడ సాధింపయోగ్యతను బడయుటకుఁ దగుయత్నమును గావించువారలకు నుపాసన కాండము ప్రతిపాదింపఁబడినది. ఇఁకఁ బూర్వ

కాండ ద్వయానుష్ఠానముచేఁ జి త్తశుద్ధిగల్గి సాధనచతుష్టయ సంప త్తిచేఁ బరిణత ప్రజ్ఞులగు సు త్తమాధికారులకు నీ యాగమశిఖారూపమగు నుపనిషత్కాండము (జ్ఞానకాండము) అనుగ్రహింపఁబడినది.

ఇట్లు వేదమునందలి కాండత్రయమును గేవల పురుషార్థసిద్ధికై యే యను గ్రహింపఁబడినను గాలక్రమమున శ్రౌతమార్గము నవలంబింపఁ జాలనివారలు తత్ఫలములనందుటకై స్మృతులు తంత్రములు వెలయింపఁబడినవి. మధ్యమాధి కారులగు జనులీ స్మృతితంత్ర గ్రంథముల ననుసరించియే తమ కర్మ - ఉపాసన - జ్ఞానములను దెలిసికొని తరించుటకుఁదగు నవకాశము కల్పింపఁబడినది. జనులకిట్టి యాదరము స్మృతి తంత్రములయందుఁ గల్గుచుండుటచే వైదికమార్గమునం దాస క్తి లేనివారలుకూడఁ దమసిద్ధాన్తములను జనులలో వ్యాపింపఁజేయుటకు స్మృతితంత్ర ముల పేరఁ గొన్ని గ్రంథములను బ్రచురింపఁజేసిరి. కావునఁ బెద్దలు స్మృతి తంత్ర ములను వైదికములనియు నవైదికములనియు విభజించి వైదికమార్గానుయాయులచే వైదికస్మృతులు, వైదికతంత్రములే యనుసరణీయములుగాని పెఱయవిగావని నిర్ణయించిరి. ఇట్టి స్థితిలో వైదిక మార్గరతులు ఏయవి వైదికములో ఏయవి కావో దెలిసికొని త త్తద్గ్రంథ ములను బ్రామాణ్యముతో గ్రహించుట యవసరము.

మఱియు ధర్మప్రవ ర్తకులగు నాచార్యులు ధర్మజిజ్ఞాసువులగు జనుల ఉద్ధ రణము కొఱకు ఇట్టి కర్మ - ఉపాసన - జ్ఞానబోధకములగు స్మృత్యాదులను జన సామాన్యములందు విశేష ప్రాచుర్యమును గను పురాణాదులయందుఁ గూడ వేదేని యొక ప్రసంగమున సమకూర్చుటయుఁ గలదు. ఇట్టి యత్నమువలన నాయాగ్రంథ ములు సామాన్యజనులకుఁ గూడ వారల యోగ్యతనుబట్టి విషయావబోధకములగు చున్నవి. కావుననే సూత సంహితయందు రుద్రాధ్యాయము, మహాభారతమున భగవద్గీత, సనత్సుజాతీయము, విష్ణుసహస్రనామము మున్నగునవియు సమకూర్పఁ బడియెను.

పై న్యాయము ననుసరించియే బ్రహ్మాండ పురాణా న్తర్గతముగ లలితా రహస్యనామములను న త్తమగ్రంథమును బ్రహ్మర్షులు సమకూర్చిరి. ఈ లలితా రహస్యనామముల విశిష్టతను దెలిసికొనుటకు ముందుగా నీ లలితోపాసనమును గూర్చి కొంచెము దెలిసికొనవలసియున్నది.

అష్టవర్ష దేశీయుఁడగు బాలుఁడు వేదవిద్యను గ్రహించుటకుఁదగు చి త్త సంస్కారమునందుటకై వేదసారమగు గాయత్రీవిద్య తొలుత నాతనికుపదేశింపఁ

బడును. ఈ గాయత్రి బ్రహ్మవిద్యయయ్యుఁ బసిబాలునికి నుపదేశింపవలసిన యవసరమున మాతృరూప విద్యాకల్పనముతో నుపదేశింపఁబడును. కావుననే గాయత్రీ రూపకల్పనము ధ్యానమున స్త్రీ భావము నందినది. ఈ గాయత్రియే ప్రకట గుప్త భేదముతో ద్వివిధమగుచున్నది, శాస్త్ర చోదిత విధిని జనకుఁడు తన పుత్రునికి అష్టవర్ష ప్రాయముననే యుపదేశించు నీ గాయత్రి ప్రకటగాయత్రియనియు, శాస్త్ర పర్యాలోకనముచే విజ్ఞాన సంపాదనేచ్ఛతో యథావిధి గురూపసదనాదులఁ గావించి జిజ్ఞాసువు గుర్వనుగ్రహమునంది తన ప్రయత్నముతో నుపదేశమునందు నీ లలితా విద్యను గుప్తగాయత్రి యనియు సంప్రదాయజ్ఞుల వ్యవహారము. కావున నీ లలితా విద్య ప్రకట గాయత్రివలె వయస్సుతో సంబంధింపక చిత్త సంస్కారము జిజ్ఞాసుత్వములతో మాత్రమే సంబంధించియుండును. ఈ విద్య విద్యలలోకెల్ల నుత్తమ మైనదిగాఁ బ్రశంసింపఁబడుటవలన నిద్దానిని "శ్రీవిద్య" యనియుఁ బేర్కొందురు. అట్లే లలితా పరదేవతోపాసనమునఁ బ్రధాన ప్రతీకమునకు "శ్రీచక్ర" మనియు నందురు. దీనిని బట్టియే యీ విద్యయొక్క యతిశయము స్పష్టమగుచున్నది. కావుననే కొన్ని జన్మలనుండి చిత్తశుద్ధి యేర్పడినఁగాని యీ విద్యయందాసక్తి గలుగదనియు, శ్రీ విద్యోపాసనము గావించు జన్మమే ద్విజునకు తుదిజన్మమనియు —

"చరమే జన్మని యథా శ్రీవిద్యోపాసకో భవేత్ ।
నామ సాహస్ర పాఠశ్చ తథా చరమజన్మని॥"

అనుస్మృతి వచనము బోధించుచున్నది.

ఇట్టియుత్తమమగు శ్రీ విద్యోపాసనమునకుఁ బ్రధాన ప్రమాణ గ్రంథము 'గుణనికా' రూపమగు శ్రీ లలితా రహస్యనామములే. ఇయ్యవి లోకమున 'లలితా సహస్రనామ' శబ్దముచేఁ బ్రథితములై యున్నవి. లోకమున 'శత—సహస్ర' శబ్దము లనంతపర్యాయములుగాఁ గూడఁ బ్రసిద్ధినందుటచే 'సహస్ర'శబ్దమునకు సంఖ్యాపరత్వమే చెప్పవలయునను నియమము లేదు.

ఉపాసకుని కామనా విశేషమునుబట్టియు భక్త్యతిశయమును బట్టియు అంబికా శివ విష్ణుగణనాథ సూర్యాయతనములలో నాతని యుపాసనము వరలుచుండును. ఏయేదేవతలైనను నీ పంచాయతనములయందే యంతర్భవించుచుందురు. మహోపాసకులగు మహర్షులు తమతమ యభీష్టదేవతోపాసనానుభవముచేఁ గొన్ని కొన్ని దేవతానామ రహస్యములకు ద్రష్టలై వెలసిరి. వీరలనే యనుకరించుచుఁ గొందఱు భక్తులుగూడఁ దమ యభీష్టదేవతలకు నామసాహస్రములను సంతరించుకొనిరి. ఈ విధముగా నేఁటికాలమున సహస్రనామ గ్రంథముల సంఖ్య సహస్రాధికమే కాఁజొచ్చి

వది. ఏదియెట్లున్నను అవ్వాని ప్రసక్తితో మనకుఁబనిలేదు. ప్రాచీన ఋషి దృష్టము లను మాత్రమే మనము పరిశీలింతము. ఇయ్యవి శివ - విష్ణు - (రామ - కృష్ణ - హయ గ్రీవ) గణపతి - అంబికా - (లక్ష్మీ - సరస్వతీ) సూర్యాదిదేవతా సహస్రనామ రూప ములతోఁ బెక్కులు గలవు. వీని యన్నింటిలోను బ్రకృతమగు 'లలితారహస్యనామ స్తోత్రము' ఉత్తమోత్తమమైనదని చెప్పవలయును. ఈ ప్రశస్తి 'వ్రతానాముత్తమం వ్రతం' అను స్తుతివంటిది మాత్రముగాదు. ఏలయనఁగా మిగిలిన సహస్రనామముల లోని పదములన్నియు తత్తద్దేవతానామ పర్యాయములు, దేవతా సామాన్యరూపబోధక ములు, దేవతా విజయవాచకములు భక్తానుగ్రహ ప్రతిపాదకములే యగుచున్నవి. కాని యీ లలితారహస్యనామము లట్లుగాక 'శ్రీమాతా' యను తొలినామము మొదలు 'శ్రీశివాశివశక్త్యైక్య రూపిణీ—లలితాంబికా" యను తుదినామమువఱకును గంభీర బహు రహస్యార్థ భావములతో వెలయుచు వ్యర్థమగు పదముగాని వర్ణముగాని యెందును గానఁబడక సూత్రశైలితోఁ బ్రకాశించుచున్నవి. ఒక్కొక్కనామము ఒక్కొక్క మహాభాష్యమున కర్హమై యొప్పును. ఈ నామ గాంభీర్యమును బరిశీలించినచో వాస్తవముగా వాగ్దేవతలు జగదధిష్ఠాత్రియగు పరదేవత నెట్లు స్తుతింపవలయునో యట్లే స్తుతించినవని విద్వాంసులకుఁ దోఁచును. ప్రతి పదముగూడ సామాన్య జనావ బోధ్యమగు వాచ్యార్థమునేకాక - లక్ష్య - వ్యంగ్యార్థములను బహుళంగుల బోధించు చుండును. యథార్థమును దెలియఁ జెప్పవలయునన్నచో వేద చతుష్టయమునందును దెలియఁ జెప్పఁబడిన విషయజాతమునంతను సంగ్రహరూపమున సార్థమగు మూట యెనుబదిరెండు శ్లోకములతో వాగ్దేవతలు గానముచేసినవి. అట్టియద్భుతమగు దర్శ నము వాగ్దేవతలకే చెల్లినది. అదిసామాన్యులకు ఎంతమాత్రము అలవిగాదు. కావు ననే ఈ నామసాహస్ర పాఠమును గావించినవాఁడు అజన్మమునే తన తుదిజన్మము గాఁ జేసికొనఁజాలునని అనఁగా ముక్తుఁడగునని "నామసాహస్రపాఠశ్చతథా చరమ జన్మని" అని పూర్వము చెప్పఁబడినది.

ఇందు శ్రీ పరదేవతా ప్రతీకమగు శ్రీ చక్రస్వరూపము తచ్చక్ర విలేఖన క్రమము ననుసరించి సూచింపఁబడినది. ఉపాసనక్రమమునకు అవశ్యోపాదేయమగు యోగమార్గానుసారముగ షట్చక్ర భేదముద్వారా సహస్రారప్రాప్తి కుండలినీప్రసా రము - సుషుమ్నా మార్గగమనోపాయము - మున్నగు రహస్యములు వ్యంగ్యముగఁ గీర్తింపఁబడినవి. అట్లే గర్భోత్పత్తి, గర్భావస్థలు - దానికి వలయు నాహారాది నియమములు సూచింపఁబడినవి. శ్రీ చక్రార్చన క్రమము దెలుపఁబడినది. బహువిధ ఫలసాధకములగు మంత్రములు ఫలసాధన ప్రక్రియగూడఁ గీర్తింపఁబడెను. ఇట్టి

నానావిధ లౌకిక ఫలప్రాపకములగు మంత్ర తంత్రములను బహుభంగులఁ దెల్పి యవ్వాని కనురూపములగు దేవతా స్వరూపమును గూడ సూచించుచుఁ దుదిని పరదేవతయొక్క వాస్తవ రూపమును నిరూపించెను. ఈ నిరూపణమునుబట్టియే శ్రీ లలితాదేవియొక్క నిజరూపము మనకు సుస్పష్టమగును. దేవతా నిజరూపమును మనము గుర్తెఱుంగక తదుపాసనమున నెన్నడును బ్రవర్తింపఁగూడదు. కావున నుపాస్యదేవత యొక్క వాస్తవ రూపమును దొలుత దెలిసికొనవలయును. సామాన్యముగ లోకమున శ్రీదేవీ నిజరూపము స్త్రీరూపమనియుఁ గావున దదుపాసనము 'స్త్రీవిద్య' యనియు నొక ప్రతీతి గలదు. రహస్యనామములయందు శ్రీదేవి జగదుత్పత్తి స్థితిలయ కారణము ఉపనిషద్వేద్యమునగు పరబ్రహ్మముగాఁ జెప్పఁబడియెను. "శ్రుతిసీమంత సిందూరీకృత పాదాబ్జధూళికా, సకలాగమ సందోహశుక్తి సంపుటమౌక్తికా, సర్వోపనిషదుద్ఘుష్టా, సర్వవేదాంతసంవేద్యా, సచ్చిదానందరూపిణీ, చితిః, తత్పదలక్ష్యార్థా, చిదేకరసరూపిణీ, నామరూప వివర్జితా, సృష్టికర్త్రీ బ్రహ్మరూపా, గోప్త్రీ గోవిందరూపిణీ, సంహారిణీ రుద్రరూపా, తత్త్వమయీ, తత్త్వమర్థస్వరూపిణీ, నిర్లేపా నిర్మలా, నిరుపాధి, ర్నిరీశ్వరా, గాయత్రీ, వ్యాహృతిః సంధ్యా, ద్విజబృంద నిషేవితా" మున్నగు నామజాతము శ్రీదేవీ నిజరూపమును వేదవేద్యత్వమును బేర్కొనుచున్నది. దీనినిబట్టి రహస్యనామములందు వినఁబడు "మహాదేవీ, భవానీ, మహాత్రిపురసుందరీ, మహాకామేశనయన కుముదాహ్లాద కౌముదీ, మహాకామేశ మహిషీ మున్నగు స్త్రీ రూపతా ప్రతిపాదక నామములకు బృహదారణ్యక ప్రతిపాదితమైన సృష్టి ప్రతిపాదక వాక్యములనుదిలకించి యవ్వానిని బట్టి యర్థమును దెలుపవలయును. అందు—

"ఆత్మైవాగ్ర ఆసీత్పురుషవిధః సోఽనువీక్ష్య నాన్యదాత్మనోఽపశ్యత్, సోఽహమస్మీత్యగ్రేవ్యాహరత్ - సవైనైవ రేమే, తస్మాదేకాకీ నైవరమతే, స ద్వితీయమైచ్ఛత్, సహైతావానాస, యథా స్త్రీ పుమాంసౌ సంపరిష్వక్తౌ, స ఇమమేవాత్మానం ద్వేధాఽపాతయత్' తతః పతిశ్చపత్నీచా భవతాం తస్మాదిదమర్ధ బృగళమివస్వః" (బృహ. 1-4-1, 3)

దీనినిబట్టి జగత్కారణమగు బ్రహ్మమే స్త్రీ పుంభావముల నందినట్లు తెలియుచున్నది. ఇట్టి ప్రథమస్థితికి మనోహరమగు రూపకల్పనమును గావించి శాస్త్రము దంపతి భావముతో బ్రహ్మరూపమును వర్ణించెను. కావుననే శిష్టులు

"స్త్రీరూపం వాస్మరేద్దేవీం పుంరూపంవా విచింతయేత్ ।
అథవా నిష్కలం ధ్యాయేత్ సచ్చిదానంద రూపిణీమ్"

అని వ్రాక్రుచ్చిరి.

పైని నిరూపించిన విషయమునుబట్టి శ్రీదేవి వాస్తవరూపము స్త్రీ మాత్ర రూపముగాదనియుఁ, దద్విద్య సకలోపనిషదుద్ఘుష్టమగు బ్రహ్మవిద్యయే యనియు, శ్రీ విద్యోపాసనము వైదికమేగాని శుద్ధతాంత్రిక మెంతమాత్రముగాదనియు మనము దెలియవలయును. కావుననే వైదికధర్మప్రవర్తకులగు శ్రీ శంకరభగవత్పాదులవారు తాము నెలకొల్పిన పీఠచతుష్టయమునందును పరదేవతాప్రతీకములగు శ్రీచక్రములను బ్రతిష్ఠించి శ్రీవిద్యను బ్రవర్తింపఁజేసిరి. ఇయ్యదియే యవైదికమగుచో నట్టి కార్యమును వారలొనర్తురా ?

అగ్నిస్వరూపుఁడగు సూర్యుని నుండి ప్రత్యక్షముగా మనము అగ్నిని పొందఁజాలనపుడు, విమర్శదర్పణమును (భూతద్దమును) మధ్యఁజేసి మనమగ్నిని సంపాదించిన విధమున సాక్షాద్వేదమునుండి మనమొక యర్థమును సంపాదింపలేనియపుడు తదనుసారి స్మృతులవలననో తంత్రములవలననో యా యర్థమును సంపాదింపవలయును. అంతమాత్రమున నావిద్య అవైదికమనియుఁ గేవల తాంత్రికమనియుఁ జెప్పఁగూడదు. శ్రీవిద్య వైదికమే.

కర్మాచరణమున వాచికమగు మంత్రోచ్చారణముతోఁ గూడిన దైహికక్రియ యెట్టి ప్రధానస్థానము నాక్రమించునో యట్లే యుపాసనమునందు వాచికమగు మంత్రోచ్చారణముతోఁ గూడిన మానసిక క్రియ యట్టి ప్రధానస్థానము నాక్రమించును. ఇయ్యది జ్ఞానమునకు సన్నిహితమగుటచే దేవతాస్వరూపస్వభావాదికమును అవిరతము శుద్ధచిత్తముతో మననము చేయవలసిన యావశ్యకత యెంతేనియుఁ గలదు. వాఙ్మయమున మననమున కుపయోగించు రచనాపద్ధతులు రెండు మాత్రమే భారతీయులచే నంగీకరింపఁబడినవి. అవ్వి 1 పద్యరచనము, 2 సూత్రరచనము. ఈ రెండింటిలో విషయ విమర్శనము ప్రధానముగాఁగల శాస్త్రములకు సూత్రరూపము, స్తుతిరూపమున నెల్లప్పుడు స్వరూప స్వభావాదుల నవగతము గావించుకొని తద్భావ భావితులగునట్లు స్తుతించుకొనుటకు పద్యరూపము (ఛందోరూపము) గ్రహింపఁబడినవి. కావుననే దేవతాస్తుతులన్నియు ఛందోబద్ధములుగాను, దర్శనాదులు సూత్రరూపములుగాను వెలయుచున్నవి. సామాన్యముగాఁ బ్రాచీనులు ఈ స్తుతుల నన్నింటిని గీర్వాణవాణియందే వెలయించిరి. అద్దానియందు గాంభీర్యమను నొక విశిష్ట ధర్మముండుటచే బహువిధములగు నర్థములను ననేకరీతులఁ దెలుపుటకుఁదగు నవకాశముగలదు. కాని కాలక్రమమున జనసామాన్యమున కాభాష యర్థముగాక స్తుతుల కుద్దేశింపఁబడిన ఫలమును జనులు పొందలేకపోవుటచేఁ బ్రతిదేశమునందున్న

దేశభాషలయందే యా గీర్వాణస్తుతులకుఁ బరివర్తనములు వెలువడఁ జొచ్చినవి. ఈ పరివర్తనములన్నియు వచనవివరణము రూపముననేయున్నవి. లలితా రహస్య నామములకుఁ గూడఁ బెక్కులు వచనరూప వివరణములున్నవి.

## తల్లివిన్కి :

మిగిలిన సామహస్ర స్తుతులెట్లున్నను భారతవర్షమున ఈ లలితారహస్య నామ స్తుతిమాత్రము అర్థగాంభీర్యమున నేమి విషయ ప్రాశస్త్యముననేమి రచనా సౌందర్యముననేమి అత్యుత్తమ స్థానము నందినట్లు పూర్వమే నిరూపించితిమిగదా! ఇయ్యది వాగ్దేవీ గానరూపస్తుతి కావున ఇది "వేదానాం సామవేదోఽస్మి" యను భగవత్స్మృతిచే భగవద్రూపముగానెన్నఁబడు సామశాఖకు సంబంధించిన యామ్నాయ మని సంప్రదాయ ప్రవర్తకాచార్యుల యాశయము. అట్లగుటచే నియ్యది దేశ భాషలందుఁ గూడ గానయోగ్యమగు ఛందోబద్ధమే యగుటలెస్స. కాని యట్టివి మాత్ర మింతకుముందున్నట్లు కానరాదు. ఈ స్తుతికి వైకృతములయందు గాన యోగ్యముగఁ దొలుత నవతరించిన గ్రంథ మియ్యదియే. శ్రీ వాగ్దేవతా వరావతార రూపులు మహాభక్త శేఖరులు గానవిద్యానిధులు హరికథా పితామహులు గీర్వాణా ద్యష్ట భాషాతత్త్వవిదులు సకలశాస్త్ర రహస్యకోవిదులు సర్వతంత్రస్వతంత్రులునగు శ్రీ మజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు ఇద్దానిని "తల్లి విన్కి" యనుపేరఁ దెలుఁగు లోనికిఁ దెచ్చుట తెనుఁగువారికి వెలుఁగు చూపుటయే యని చెప్పవలయును. ఇయ్యది తెలుఁగునాడు భాగ్యము. సకల మోక్షమార్గములను బాగుగా నెఱిఁగి యవ్వా విని అనవతరము ప్రచారము గావించి భారతీయ జనోద్ధరణమునకుఁ దనజీవితము నంకితము గావించిన శ్రీ దాసవర్యులు సంపూర్ణానుభవమును గడించి తమ యశీతి తమవర్షమున నీ రహస్యనామమును జేతఁ బట్టుటలోనే యిద్దాని యతిశయము వ్యక్త మగుచున్నది. దానిబట్టియే వారి దృష్టిలో నీ రహస్య నామస్తుతి కెట్టి స్థానము గలదో మన మూహించుకొనవచ్చును. వారి యీ రచనమును బరిశీలించినచో సకల పురుషార్థములను గలుగఁజేయు సామర్థ్యము ఈ రహస్యనామస్తుతికి మాత్రమే గలదని శ్రీ దాసుగారి హృదయమను నభిప్రాయము మనకుఁ గలుగకమానదు. వారు తమ్మ జగజ్జ్యోతి యందు "కన్నతల్లీ, ఆదిశక్తీ, బాలత్రిపురసుందరీ, తెలిసీ తెలియని నళపళువును నేను, సర్వజగదుపకారముగా హాయిగా నూతేండ్లు నన్నుఁ బెంచుము. ధర్మమార్గమునుండి నన్ను జారిపోనీకు మోజగన్మాతా" యని జగద్ధాత్రిని వేఁడుకొనినారు. మహాభక్తావతంసులగు శ్రీ దాసుగారి పవిత్రకృతి

వలనఁ దీర్ణులయి, వారు అర్థజ్ఞానరహితులకుఁ బారాయణఫలమును అర్థవేత్తలకు మననానుకూల్యమును సమకూర్చి తరింపఁ జేసినారనుటలో లవంత యేనియు నతిశయోక్తి లేదు. ప్రతి నామము తుదిసిగూడఁ దత్తన్నామసంకీర్తన ఫలవిశేషము జేర్కొనుటలోనే యీగ్రంథము ఒక రూపమున శ్రీ దేవీ నామస్తుతికి భాష్యమాయ పించును. మంత్రార్థజ్ఞానమనఁగా మంత్రప్రయోజనజ్ఞానమనిగూడ శిష్టవ్యాఖ్యగలదు. అట్టి యాశయముతోడనే శ్రీ దాసుగారు నామప్రయోజనమును దుదియందు జేర్కొనుట. యియ్యది యీ గ్రంథమునకుఁ గల విశిష్టత.

ఈ గ్రంథము శ్రీ దాసుగారిచే అచ్చ తెలుఁగునందుఁ గీర్తింపబడినది. సహజముగ వారికి అచ్చ తెలుఁగనిన నెనలేవి యభిరుచి. తాము గీర్వాణభాషయందు చిన్ననాటినుండి బహుగ్రంథములను సంతరించియుఁ దనకు హృదయము మాత్రము అచ్చ తెలుగునందేయని —

"మొలకలేఁతఁదనము తలిరుల నవకంబు
మొగ్గసోగఁదనము పూవుఁదావి
తేనె తీయఁదనము తెన్గునకేగాక
పరుష సంస్కృతాఖ్య భాషకేది"

అని నుడువుచుఁ దమ యీ పద్యమునందే తెలుఁగు సౌకుమార్యమును సంస్కృత భాషాకాఠిన్యమును దెలిపినారు. ఈ యభిప్రాయమిట్లున్నను దాము తమ ప్రధాన గ్రంథములను దెలుఁగులోనే వ్రాయుటకు హేతువు ప్రతిజ్ఞారూపముతో నిట్లు వాక్రుచ్చిరి.

"తెలుఁగువారలకు తేట తెల్లముగను
దెలుఁగులో నెల్ల విద్దెలఁ దెలుప నెంతు
అన్నివిధముల ననుఁగాంచు నాంధ్రదేశ
మునకు నాయచ్చి యున్న యప్పునముఁ దీర్తు"

దీనివలన శ్రీ దాసుగారి దేశభక్తి, స్వదేశీయులయందుఁగల గాఢమగు ప్రేమయుఁ దెల్లమగుచున్నవి. ఇట్టి తమ యభిప్రాయమునే ఈ గ్రంథాదియందు 'తల్లివిన్క-కుదురు'న సంప్రదాయానుసారముగఁ దా నీవివరణమును వ్రాయుచున్నా ననియు నా వ్రాఁతగూడఁ దెలుఁగుజాతి పద్దెములలోనే యచ్చ తెలుఁగునందే వ్రాయుదుననియు అట్లు వ్రాయుటయే న్యాయ్యమనియుఁ దమ హృదయమును వెల్లడించిరి —

"అన్నిటికిన్ గతమౌ గట్టుపట్టి,
వేయి పేర్లకు వరుస వివరమెంనర్తు,
మాటకూర్పులం దగుపట్టు లేకపర్తు
వంచ శెండడ్డు చెప్పన్ దోడిడల్చి
టీకలో నుడువు రెట్టింపను పేర
తొల్లింటి చదువర్ల త్రోవం ద్రొక్కదను
పగడ నాటు తెలుంగు పల్కె పల్కెద.
ఎల్లనుడ్వులకు దెద్దే మేటిమాట,
అని చాటి చెప్పెద నందఱ కిటుల".

సామాన్యముగ ఉత్తమ గ్రంథములను అర్థజ్ఞానపూర్వముగం బఠించుచు విషయమును మననము జేసికొనువారలు చాల యరుదు. అట్టి యుత్తమాధికారులు పరిపూర్ణఫలము నందంగలరు. అయినను సామాన్యులుగూడ నుత్తమగ్రంథమును జదువవలసినదే. అట్టివారికి సంపూర్ణఫలము లభింపకపోయినను పారాయణఫలము లభింపకపోదు. ఈ యభిప్రాయమునే శ్రీ దాసుగారు ఇట్లు నుడివిరి.

వేలుపునుడుల తల్లి వెయి పేర్లెఱిగి - వినికి పలుపుందగు విన్నాణి యెవండో"
తొలిపలుకులనోట దొర్లించినంత - కోరిక లీడేర్చు గుబ్బలి పట్టి
తెలుగంట్లనుడిగాని తెల్గునన్గాని, తనుంగొల్చువారి న త్తల్లి కాపాడు.
వెలితివప్పెంకి వేపేర్ల వినకరి, పొగడు డింగరుల కెప్పుడు లోటురాదు."

కావున నర్థము దెలిసినను తెలియకపోయినను శ్రీ మాతృనామముల నెల్లపుడును గీర్తింపవలయును. శ్రుతిరూపమగు మూలనామములను జదువ నధికారము లేనివారలకు ఈ నామములు సర్వథా నముపాదేయములై యివ్వానివలననే తత్ఫలము నందవచ్చునను విషయముగూడ వేఱంజెప్పబనిలేదు. ఈ విషయము స్తుతిరూపముననొప్పు వీనికేగాక మూలభూతములగు మంత్రములకుంగూడ వర్తించును. దేవభాషతోనొప్పు మంత్రరూపములు ఎట్లు ఫలప్రాపకములగుచున్నవో యట్లే దేశభాషలతోనొప్పు శాబరమంత్రములుగూడ ఫలప్రాపకములగుచున్నవి. కావున దేశభాషతోనొప్పుచున్నంతమాత్రాన మంత్రఫలము సిద్ధింపదేమో యను సంశయము నందనక్కఱలేదు. శ్రీ దాసుగారు చెప్పిన- "తెలుగంట్లనుడిగాని తెన్గునన్గాని, తనుం గొల్చువారి న త్తల్లి కాపాడు" అను వచనమున కర్థ మియ్యదియే.

## ప్రధాన సామయిక ధర్మము :

శ్రీ విద్యాదీక్షయందు నాచార్యుఁడు దీక్షితుఁడగు శిష్యునకుఁ గొన్ని ధర్మము నుపదేశించును. అవ్వానినే "సామయిక ధర్మములని" యందురు. అందు - "స్త్రీ సామాన్యే దేవతాబుద్ధిః - జాయాంవినా" అనునది ప్రధాన సామాన్య ధర్మము. అట్టి యుత్తమధర్మమును విశేషవివరణముతో శ్రీ దాసుగారిట్లు వివరించి సంప్రదాయ ధర్మమును లోకమునకు నెఱుకపఱచిరి.

"ఆడు దేనికమాగా నగపట్టు వేల్పు,
పొంతులకెల్ల వేల్పడు పల్పవలయు,
మగువ నేఁ చెడువాఁడు మగవాఁడుగాఁడు."
"లేమలు కినియ నల్గెదరు వేల్పులు
చెలువలలరఁదని చెదరు జేజేలు"

ఈ యాశయమునే మనువుగూడ.

"యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్రదేవతాః।
యత్రైతాస్తున పూజ్యన్తేసర్వాస్తత్రా ఫలాఃక్రియాః (మను. 3-56)
తస్మాదేతాః సదాపూజ్యా. భూషణాచ్ఛాదనాశనైః
భూతికామైర్నరైర్నిత్యం సంస్కారేషూత్సవేషుచ ॥ (మను. 3-59)

సత్యమే, "కలకంఠి కంటికన్నీరొలికిన సిరియింట నుండనొల్లదు" గదా! భారతీయులు స్త్రీలయందెట్టి యాదరమును బ్రదర్శించిరో దీనిని బట్టి మనము గ్రహింపఁగలము.

"మాతృదేవోభవ" (తైత్తిరీయ) యనెడి ఉపనిషత్సూక్తికిని "శ్రీమాతా" యను రహస్యనామ ప్రాథమ్యమునకును భావ్యప్రాయముగాఁ దమ యుపోద్ఘాతమున నిట్లు పేర్కొనిరి.

"పిల్లలయెడఁ గన్నతల్లికన్నఁ బైవారికిఁ గూర్మి యంతగానుండదు కనుక నోజగా వింగినేలల దిమ్ములన్నియు నదనూటకై దాఁబుట్టించి పెంచి తనలోఁ జేర్చు కొనఁగల్గిన దేవయే తల్లియన నొప్పునని తెలిపిన తొల్లింటి పెద్దలు కన్నతల్లినే వేల్పుఁగా గొల్వఁజొచ్చిరి".

"ఆడుకూఁతుళ్ళే మందిలోనెల్ల నిండుకుండలుకన్న తల్లులు. కనికరము ఓర్పుగలవారలాడువారల నెగవారలన్నూడఁ దమ కడుపునఁ బదినెలలు మోసి కని

పెంచి మంచినడువడి న్నేర్పి యందరికి న్మేలు సల్పఁగలవారు....తల్లినోర్చెల్పఁ గొంత వఱక్కైన వీలున్నదిగాన తండ్రిఁజెప్ప నెవనితరము? కావున నాడుది నిక్కము. మగ వాఁడు కల్ల. కావుననే తొంటి పెద్దలు తల్లినే వేల్పుగా నమ్మి కొల్చుట తగవని నమ్మవలసివచ్చెను."

ఇట్లు సామాన్యజనులకుఁ దెలియునట్లు పరదేవతా స్వరూపము స్త్రీరూపముగా వర్ణించియు నుత్తమాధికారుల హైమవతీరూపము నిట్లు పేర్కొనిరి—

"మైమఱచిన కూరుకు, మెలకువ, కలకూర్కుల నిర్మించినది నాల్గవయునికి. అట్టి నాల్గవయునిక్కిఁ బుట్టిన నిండుతనుపే యైదవయునిక్కి గట్టువట్టి యనఁబడును."

దీనివలనట్టి పరదేవతా వాస్తవరూపము మనోవాగతీతమగు పరబ్రహ్మరూపమే యని వారు భావించినట్లు సుస్పష్టము.

ఇట్లు స్త్రీగౌరవము గలవాఁడే శ్రీవిద్యా గౌరవమును బాటించిన వాఁడగునని దెల్పుచు శ్రీ దాసుగారు ఇట్టి యుత్తమ విద్యయందు అధికారియగువాఁడు గల్గియుండ వలసిన సుగుణములను నిట్లు పేర్కొనిరి.

"నిండారు వోరిమి - నిబ్బరికంబు,
మాటనిల్కడతన్వి - మంచినడువడి,
తాల్మిదలుగఁబోని - దక్కోలం బ్రతుకు,
జంజాటమెడలి పీ - చ మొడసి మిగుల,
నడఁకువ - తోడుత - సందలుపట్లు,
నడుచుచుఁ - బ్రాగశ - సంజుడు దినశ,
చదువు గోటునఁ దెగసాగక పనికి,
మాలిన కోర్కులం బడయక లేని
పోని తలంపులఁ బొరయక తనకుఁ,
గలదానితోడుత నగడుఁ దన్పిఁబొంది,
గుండె బిగువు కలవు - గోలుతనమ్ము,
ఇమ్ములఁగూర్చువాఁడే తల్లివిన్కి,
గిడియతోఁ బాటఁదగిన మొనగాఁడు"

పైని శ్రీ దాసుగారు చెప్పిన లక్షణములన్నియు బ్రహ్మవిద్యాధికారియొక్క లక్షణములుగా బ్రహ్మవిదులు పేర్కొనినవి. ఇయ్యవియే - "నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమ-దమ-ఉపరతి-తితిక్షా-శ్రద్ధా-సమాధాన రూపమగు సాధనసంపద, ముముక్షుత్వమను సాధనచతుష్టయ సంపత్తి. ఇట్టి సాధన

చతుష్టయసంపద గలవాఁడే బ్రహ్మవిద్యాధికారి-కావుననే బృహదారణ్యకమున యాజ్ఞవల్క్యమహర్షి జనకున కుపదేశమును గావించుచు నాతని గుణశీలముల నిట్లు పేర్కొనెను.

“తస్మాదేవం విచ్చాన్తోదాంత ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యతి, సర్వమాత్మానం పశ్యతి, నైనం పాప్మాతరతి,విపాపో విరజోఽవిచికిత్సో బ్రాహ్మణో భవతి, ఏష బ్రహ్మలోకః సమ్రాట్” (బృ. 4-4-23)

దీనివిబట్టి యీ శ్రీ విద్యోపనిషత్తుగాఁ జెప్పఁబడు నీ రహస్యనామములయం దధికారి, పై బ్రహ్మవిద్యాధికారియే యనియు శ్రీవిద్య యనఁగా బ్రహ్మవిద్యయే యనియు శ్రీ దాసుగారు నిర్వచించినట్లు స్పష్టమగుచున్నది.

## గ్రంథరచనాపద్ధతి :

శ్రీ దాసుగారు ప్రతినామమునకును దొలుత అర్థమును తరువాత వద్దావి వివరణమును ఫలమును వివరించుచుఁ దమ వివరణ గ్రంథమును రచియించిరి. మచ్చునకు; దుర్గా (191 నామము) శబ్దార్థ నిరూపణమున—

“ఇదుమలార్చినవారికే చిక్కు వేల్పు,
ఎప్పటికి న్దొమ్మిదేండ్లయీడు చెలి,
పచరతపర్వ ముచ్చటలూరుపడచు,
కాల్ద్రొక్కి కానిమగతిమెట్టబొట్టె,
మగవానినెఱుంగదామల దొరపిల్ల,
ఆద, నేఁత, నుడుల కందనియంత,
ఆత్మగల్ దానెయౌనా నా గట్టుపట్టి,
పరవుఁగోటవలెఁ గాపాడెడు వేల్పు”

ఇందుఁ దొలుత యౌగికార్థ వివరణముతోపాటు ఆగమమున ‘దుర్గా’ నామ మెంత వయసుగల కన్యకకుఁ జెప్పఁబడినదో, యట్టి విశేషము, ఆ దేవతాస్వభావము, అట్టి విశేషములతో దుర్గాదేవ్యుపాసనమును గావించువానికిఁ గలుగు ఫలము గూడఁ దెలుపఁబడినవి.

‘త్రిస్థా’ యను (874) నామార్థ ప్రదర్శన ప్రసంగమున—

“మూఁడు లెక్కలనిల్చు ముద్దులగుమ్మ, ముచ్చోట్లు, చదువులు మూఁడు ముత్తిగలు దారులు ముచ్చయై దారలు మూఁడు, తొక్కలుతిన వెలుగులు మూఁడు పేళ్లు

మూఁడు పాదులు మూఁడు మూఁడు పలుకులు,తొసగులు మూఁడు బ్రతుకుతీర్లమూఁడు తెరుణము బ్మూడేడు తెరవిరువంచ, కొఱతలు మూఁడెఱుకువలు మూఁడిటుల బలుమూళ్ళ నిల్వగున్వలిగట్టు వట్టి, గుండని ముత్తైఁగుల నేలువేలు॥"

ఇట్లాగమానుసారముగ నర్థమును బెక్కునామములకు వివరించియు విశేషించి బహుభంగుల నర్థమును వివరింపవలసిన గంభీరములగు కొన్ని చోటులయందు నాయర్థము సంప్రదాయ రహస్యమగుటచే గురుముఖైకవేద్యమే యను దలంపుతోఁ గాఁబోలు అట విశేషించి యర్థమును వివరింపలేదు. కావుననే "శ్రీమద్వాగ్భవకూటైక స్వరూపముఖ పంకజా, కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ, శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణీ; ప్రతి పన్ముఖ్యరాకాంత తిథిమండల పూజితా, గురుమండలరూపిణీ", మున్నగు నామరహస్యములను లఘువుగానే నిరూపించిరి. ఇందుఁ గతిపయ నామార్థ వివరణ ప్రసంగమున భాస్కరరాయ నిరూపితమగు వామాచారమును శ్రీ దాసుగారు కీర్తించినను అయ్యది ద్విజేతర విషయమే యని వారి యభిప్రాయము. కానిచో అధికార నిరూపణమున వారుదెల్పిన "త్రాగక, నంజాదు దివక" అను ప్రధానలక్షణములు విరోధించునుగదా!

ఇట్టి స్తుతిగ్రంథము గానానురూపమగుటఁజేసి శ్రీ దాసుగారు తమ వివరణ గ్రంథమునకు దేశీయచ్ఛందమగు మంజరీ ద్విపదను 'చెండు' అనుపేరఁ బరిగ్రహించిరి. దేశీయచ్ఛందములలో ద్విపద గానానుకూలమైన దను విషయము వేఱఁ జెప్పఁబనిలేదు. సామాన్య ద్విపదకును మంజరీ ద్విపదకును గణములలో భేదము లేక పోయినను ప్రాసనియమము మాత్రమీ మంజరీ ద్విపదకు లేదని ఇట్లు చెప్పఁబడియె —

"శక్రత్రయంబును సవిత్రుండు పాద
విక్రీడితులు మృదు ద్విపదికి నెపుడు
వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని
వలదు ప్రాసంబింద్రు వరుస మంజరికి"
(కావ్యాలంకార సంగ్రహ)

ఇందు హెచ్చుగాఁ జెండ్లు వాడఁబడినను అటనట గీతపద్యములు సీసపాదములు కందములుగూడఁ గీర్తింపఁబడినవి.

ఇట్లు దాసుగారు శ్రీదేవీరహస్య నామములకుఁ దమ తెలుగువారల నుద్దేశించి యవ్వారలకు మహోపకారము గల్గునట్లు వివరణమును వ్రాసియుఁ దమ గ్రంథము అచ్చ తెల్గుఁగుల్లో నుండుటచేతను, అయ్యది ఆంధ్రులకందఱకును సుగమము కాక

పోవుటను గ్రహించి అవ్వారల కుపయోగపడునట్లు దీని కనుబంధముగ నీ
ప్రతిపదార్థ సూచికనుగూడ సంతరించిరి. అచ్చాంధ్రాభినివిష్ట చేతస్కు లగుట
వివృతార్థముగూడ నాటుతెలుఁగుననే వెలయుటచే జిజ్ఞాసువులు కొంత శ్రద్ధాతత్పర
వగవలుపవలసి యున్నది.

కష్టించియైనను దల్లివిన్కిని బారాయణముసేయు తమసాటి తెలుఁగు ప్ర
లకు ఆమహాభాగుఁడు కోరిన ఫలము—

"నాయీవ్రాఁత నాతోటిపాటి వారలకు మేలుచేకూర్చు గావుతమని తల్లివేఁ
పేర్లవిన్కి విన్లే నాటుతెలుఁగున నాయీ యెనుబదియేండ్ల యీడున వ్రాయించి
నాయిలవేల్పు నన్ను న్నామంచి చదువరు లన్దగు కోరికలొసంగి కోరినన్నేం
హాయిగా బ్రతికించి తనయందెల్లరికిని నమ్మిక హెచ్చించి యీమేనులతోనే తనలో
జేర్చుకొనుఁగాక" అని.

ఇట్లుపావన విషయమునఁ బ్రధాన ప్రమాణమగు శ్రీదేవీరహస్య నా
గ్రంథమునకుఁ దనసాటి యాంధ్రుల నుద్ధరించి తరింపఁ జేయుటకై మనోహరమ
వివరణమును రచించి యనుగ్రహించిన తాము నాటుతెలుగులో నీస్తుతిని వ్రాయ
టకుఁ దగు హేతువులను అద్దానివలనఁ దెలుఁగువారలకుఁ గలుగు విశేషఫలము
ఎంతయో వినయముతో పరదేవతకు విపులముగఁ దమ "కుదురు"లో నివేదించుకొ
నారు. కావున ఆవిషయములు ఈనావ్రాఁతలో సూత్రప్రాయముగనే పేర్కొన
బడినవి.

ఇట్లు సాటివారలకై తమ వార్ధకమునందు మిక్కిలి పాటుపడిన శ్రీదాసుగార
ఆంధ్రుల కందఱకును బరమపూజ్యులు. వారనుగ్రహించిన ఈ "తల్లివిన్కి"ని
దెలుఁగువారందఱును బ్రమాణభావముతో గ్రహించి దేశమునందెల్లయెడల నీపవిత్ర
గ్రంథమును బ్రవర్తింపఁజేసి తాము ధన్యులై తోడివారలను ధన్యులనుగాఁ జేసినప్పుడే
శ్రీదాసుగారి యాశయము నెరవేరును.

ఇట్టి సకల జనోద్ధారకమగు నుత్తమ గ్రంథమును నేఁటికాలమునఁ బ్రకటిం
చుట యెంత యావశ్యకమో యంత దుశ్శకము గూడ నగుచున్నది. హేతువు-గ్రంథ
ముద్రణసాధనము లన్నియు అందరాని యాకసము నంటుటయే. ఇట్టిసమయమున
గుంటూరు వణిగ్వరులు అనవరత శ్రీదేవీధ్యాన జపార్చన పరిపూత కరణత్రయులు
సుప్రతిష్ఠిత శారదాయతనులు వదాన్యవతంసులు నగు శ్రీ పోలిసెట్టి సోమసుందర
తనూభవులు శ్రీ సీతారామాంజనేయసహోదరులు ఈపావన కృత్య నిర్వహణము

సిద్ధసంకల్పులై సంపూర్ణహృదయముతోఁ దమదిగా గ్రహించి స
సాహాయ్యము నందఁజేసిరని తెల్పుటకుఁ బరమానందము నందుచు ఇ
భక్తులను చంద్రకళావతంస యగు నా చల్లనితల్లి తన చల్లని చూపుతోఁ
శ్రేయస్సుల నొసంగుచు సంతతముగాచుఁ గావుతమని యాశాసించుచున్నా

శ్రీ నారాయణచరణోద్భవ, శాస్త్ర కావ్య విమర్శాత్మక త్రిపథగ
పవిత్ర సారస్వతవాహిని లోకమున నందఱను బ్రయోజనమునందున
జేయుటకు దృఢదీక్ష వహించి యెన్ని యంతరాయములనైన సరకుఁగ
కృత్యులైన యపరభగీరథులు శ్రీ కట్టా ఈశ్వరరావుగారు, ప్రత్యగ్ర
ప్రతిభా సమంచితులు నారాయణదాస వాఙ్మయామ్నాయాపరసాత్యవతేయ
మహాకవి, మధురసరస్వతి శ్రీ ఆచార్య యస్వీ జోగారావు, M. A., Ph.
నన్నీ పవిత్ర సంపాదకకృతికిఁ బ్రోత్సహించి ప్రయోజకర్తృత్వమ
సుధాసారాభివర్షిణి యగు నా జగద్ధాత్రి యనుగ్రహమునకు భాజనుల
తెల్పుట సిద్ధవ్యాహారము.

గ్రంథము నింత సుష్ఠుగా శ్రద్ధతో ముద్రించి భక్తలోకమున
'వెల్‌కం ప్రెస్సు మేనేజింగ్ డైరెక్టరు' శ్రీ పి. రామకృష్ణమూర్తిగారుక
ప్రసన్న కటాక్ష వీక్షణ పాత్రములగుచున్నారనుట పునరుక్తప్రాయమే.

స్వస్త్యస్తు.

# తెనుఁగు రవ

శ్రీమద్గురుభాగవత, జీవ, బ్రహ్మ, ఆత్మ, తత్త్వ, విశిష్టాద్వైత,
విచారాది గ్రంథకర్త

## శ్రీ మిన్నికంటి గురునాథశర్మ

గుంటూరు

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసు తెనుఁగుబిడ్డ. నాటుతెనుఁగుబిడ్డ. పెరిమఁ తెనుఁగుబిడ్డ. ఆతల్లిబిడ్డల కొక్కరిపై నొక్కరికి నెక్కొన్న మక్కువ పెక్కువల లెక్కిడ సెక్కెముగాదు. తెనుఁగన్నఁ దెనుఁగా ? కలితీలేని తెనుఁగు. నాటు తెనుఁగు. తెలగన్న, తిమ్మన్న మున్నగు మున్మున్న కైసరులు అంకునుడిమార్పులను, పెరనాడు పల్కులను, గల్పుకొని బుల్పుపొల్పునఁ దెనుఁగువహాల నల్పిరి గాని, నాటుతెనుఁగు తేటమాటలతో నిబ్బరముగాఁ గబ్బములల్ల నొల్లరైరి. వారి పేదయాదలో నంతయీఁదు దిటము లేదనవలె. మఱి మన నారన్న యడియరియై జబ్బుచఱచి పని ముంగిటికుఱికి యెల్లచట్టముల, నెల్లమినుకుల, బ్రాఁబల్కు తలమిన్నలపైతము తేటనాటుతెనుఁగు మాటమూటలతో నవారిగా నవారి సేసిరి. దినుసులలోఁగాని, పరకుల వంతులలోఁగాని, దేనికిఁగాని, యేపగడ యంకునుడికైనఁ దెనుఁగునుడి దొరకక తడఁబడి యుడిగినదిలేదు. పలురకముల కమ్మని నుడికూర్పుల తెలుఁగులకయి యసలు పుట్టువులఁబెట్టి తన మిడుకుకలిమిఁ బంటపొలము నలుపుకొనిరి. నా మున్నాఁటి పున్నెము మున్నది క్రన్నన క్రొన్నన తొడిగినది కావలయు నీ యాటపాటల మేటి పన్నిన 1. పీమపల్కువహి 2. మన్కిమిన్కు 3. మొక్కుబడి 4. వేల్పువంద 5. వేల్పుమాట 6. గౌరమ్మపెండ్లి 7. వెన్నుని వెయిపేర్ల వినకరి 8. నూఱుగంటి 9. అచ్చతెలుఁగుపల్కుబడి అను కమ్మని నుడికూర్పులఁ గన్నారఁగాంచి, తనివితీఱఁ జదివి యుల్లమునఁ బెల్లుబికిన తలఁపుల పొంగులు మెలపున గిలితలఁగి గిలికితి. వానిని "ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము"నఁ జూడవచ్చు.

ఇపుడీ "తల్లివిన్కి"ని ఈ మేనితాల్పు తొలిబామునఁగల నోము గోమున వరయఁగలిగితి. వెన్నుని వెయిపేర్లవినకరి వ్రాసిన పిదప మనలెంక యెనుబది యేండ్లు దాఁటిన యంకెలో దీని వ్రాసిరి. ఈ యుంకింపున కొకవంక కల్గినది. వీరు దక్కినపు వీరువాఖి సరుధునఁగల శాయివరయు పొంతె బయనమయి పొగబండిలో

మూటముల్లెలు నేయించియు మరలఁ దనకయ్య దమన నెదకుదురుగలేదని మూటల దింపించి యా పొగబండినెక్కి పోక పయన మప్పటికి మానుకొనిరఁట. ఏమివింతః ఆబండి కొంత దవ్వరిగి పడిపోయెనఁట. అందెక్కి వెళ్ళుట కేల యుల్లమొల్లక పోయెనో, అంతకు నాతల్లి చల్లనిచూపే కతమని యెంచి యీ యబ్బురము గొలుపు కబ్బము వ్రాసి యా గబ్బిగుబ్బలిపట్టి నిబ్బడిముబ్బడిగాఁ గొండాడిరి. అందులకే కాఁబోలు పగడపగడ నుడిలోను నడుగున విడువక యావల దొరవెట్టము ముగతి తన యడియరి నెన్ని తెలుఁగులనో యరయుచు నెబ్బరలు ద్రొబ్బుచు నివ్వలిచ్చుచు నిచ్చలు నేదుచుండునని వ్రాసిరి.

అడుగు చెమ్మటలాని వెయిపేర్లు చులకనివిగాని మిను తిరితెలుగంటి క్రొత్తడి పేర్లు తేలికైనవిగావు. వంచవంచయుఁ బేవులు కొలుకునవి. నుడిగమి ముడివిగు వున నిడుదలైనవి. బలు రవణముల తళుకులు గలవి. మందల నిరమూఁడుగిలుల విలువఁగల జోగులకుఁగాని యలవిగానివి. నుచ్చెనయందలి వెయితేకుల తమ్మినుండి జాలు చవియానువారికిఁగాని తెలియఁబడనివి. మిడియల యన్వరికిఁగాని కొలుకుడు పడనివి. ఒజ్జలమాటబడి యమ్మచెయిదము లన్ని యాకళింపయైన వటగలకుఁగాని యయితిగానివి. చౌవంచ యసిముల యానుపాను లెఱిఁగినవారికిఁగాని ముక్కు దూలనివి. మన డింగరిఁ డీయన్ని తెరువుల యంతు గనుఁగొన్నవాఁడు. ఇంకేమిః వారికి నల్లేరుపై బండినడక యైనది. అదివలుక పలుకుచెలి నాలుకపైఁ జిందులు ద్రొక్కుచున్నదిగాన వంచవంచపేరు నంకించిలో వెలి సరకుల మూలముట్టు దులి పిరి. లోఁతుపాఁతులంకెల లంకెలన్న తావుల ముళ్ళువిప్పి చూపిరి. కొలలేకుండ నాకలదల కొలల నలమర తీలు విరియించిరి. చివరకుఁ దేలినపండును జాగుబడిక సాఁగించు వరవుని యొడిలో విడిరి. ఇట్టిదారి నీ తల్లి విన్కి పయనించినది.

వీరొక్కొక్క యిక్క నొక్క నుడికారమునే మార్చిమార్చి చెప్పిరి. అది నమలినది నమలుటగాదు. చదువరికిఁ జక్కగా నాకళింతయగుట కట్లుచేసిరి. ఇఁకఁ బద్దెములలో నొక్కతావుననే తల్లి (సీసమాలిక) వ్రాసిరి. మఱొకతావున 'ఒజ్జ' యడుగు (సీసపాదము) వ్రాసిరి. ఒకచో 'ముద్దుపలుకు'కాలు (మత్తకోకిలపాదము) ఒందు రెండు చోట్ల గెలుపుహజ్జ (ఆటవెలఁది పాదము) ఇలువేల్పడుగు (తేటగీతి పాదము) కన్పించినది. ఒక్క మూఁపు (కందము)గూడఁ గంటఁబడినది. ఇవియెల్ల బడినడుమఁబడినవి. నోటికివచ్చినట్లెల్లఁ జెప్పి వ్రాయించిరి. తొరగా ముగియుటకు దగరవడిలోఁ బరుగిడిరి. వెన్నునివిన్కరి యందువలె వింతెల్లరకములపద్దెములవాడ లేదు. పొత్తమునంతయు బడి (మంజరీద్విపద)తో నేగడపిరి. అచ్చతెనుఁగు కబ్బము

అందుఁ బేరులు వేల్పుబాస మున్నను వాడుకొనవచ్చు. ఐపులేదు. ఐనను మన తె
గారు తొల్లిటిపద్దెముల నాయాకట్టుబాట్లతో వాడుచునే యవి యంకుసుడులని కా(
వానికి మారుపేర్లు పెట్టుకొనిరి. ఇందులోనుజూడుఁడు. ఎట్లుగంతువైచిరో. వా
యణి.... (593) లో పామురార్చిత....(347) భండాసురేంద్ర....(79) మున్న
వానిఁజూడుఁడు. ఆపేర్లసైతము నుజ్జగించిరి. అంత మడిగట్టుకొని అచ్చతెను
కబ్బము వ్రాసిరి.

ఏల యంత అలసటపడిరి ? అందురా ?

కాదు. అదివారి కలసటగాదు. మీఁదు మిక్కిలి అనుగలమైన యాట. అ
వైనపాట. హత్తుకొన్న హాయిబాట. ఒకమాట : అయన యునికితటి రెం
వాదులు మింటికంటినవి. ఒకటి వేల్పుబాస యండలేని తెలుగుభాసలేదని. మఱొక
యున్నదని. మనచదువరికన్నాకు పెరల యొరిమ తగుబముతగులని తెలుఁగు కల
యెలుఁగెత్తిచాటుచు నందులకెల్లరకుఁ గనువిప్పుగలుగుటకీ తెలుఁగు పహలఁబన్ని
సలిపి అంకెవైచిరి. అందుకొఱకే పలురకముల దినుసులుగల మాటకూర్పు
కూర్చిరి. తెలుఁగు తనయిచ్చ మెయిమెలఁగఁ గలదని, ఒరులజోలియక్కఱలేనిద
దానికి లొంగని యేసరకు లేదని, అది యేరిని సరకుగొనదని కబ్బములు వ్రా
కన్నులకుఁ గట్టఁబెట్టిరి.

ఇచ్చట మఱొక యడుగరి షట్టవచ్చు. ఇది యేరికెఱుకపడునని.

ఇప్పీ ! ఇదియేమి పన్నము ? తెలుఁగుబాస యేరికిఁ దెలియదందురే ; వేల్పు
బాస తెలియునా ? దేనినైన నేర్చుకోవలసినదే. ఒజ్జల పజ్జఁజేరి హజ్జలొత్తువారియెడ
విద్దె విజ్జఁగలదు గాని, ఊరకూరక తారువారిఁజేరునా ?

అందఱకుఁ దెలియునట్లు పన్నకముండవలదా ? అందురా ?

అబ్బా ! అదికానిపని. అందఱ నొక గాటఁగట్టివేయరాదు. అందులకే మన
పటగడణి పిల్లలు చదివి చంకలుగొట్టుకొనునట్లువ్రాసిరి పెద్దలు చదివి ముక్కుపై
వ్రేలుంచు కొనునట్లు వీనిని వ్రాసిరి. ఇట్టివి వ్రాయకున్న చదువరి మిన్నలు
చప్పరింపరా ? అసలు తెలియకున్నను నుసులుగాదు. అట్లువుట వీకడితపుటంచున
పన్నువ టీకమంచిరి.

ఆ॥ నక్కవీశ్వరుండు సద్ధర్మ విదుఁడు గ్రం
థములవలన జనము నడుపవలయు

అట్లుగాక జనమె యాతని నడుపుచో
గో పదాలు నాల్గు కూలినట్లె

తే॥ సుకవి లక్ష్యమ్ము పఠితలందుకొనవలయు
పూర్వ మట్లుండె విద్య సమున్నతంబు
నేఁడు కవియె పాఠకుల క్రిందికిని జారి
చతికిలంబడిపోవదే చదువులమ్మ. (నా సూక్తిసిధి)

నేనీ తెలుఁగుంగూర్చి 'సీమపలుకువహి' లో వ్రాసినది చూడవచ్చు.

ఇప్పుడుఁగూడ మఱొకసారి గిడియగొట్టి చాటుచున్నాను. నాఁ గారి యందు గరువపు మురువుగలి విడిముడిరణులు కవ్రాయివలకు యున్న వారి 'సీమపలుకువహి'ని దుదిముట్టఁ బూరగింపఁజేసి నాటుతెలు దురుగాక. నేనును వలసిన సాయపడుదును. ఇది తెలుఁగుగడ్డ కెనలేని కీ. శే. నారాయణదాసుగారి యెదయు నెమ్మదించును.

నాకీ వ్రాఁత వీలుగల్గించిన మా పలుకుటొజ్జల తలకట్టు బ్ర. శాస్త్రులవారి కొరగినతల కై మోడ్పులు.

ఈమ్

# పరిచయము

కళాప్రపూర్ణుఁడుఁ గవిసార్వభౌముఁడు ననఁదగు శ్రీమదజ్జాడాదిభట్ల నారాయ
దాస మహాశయు నెఱింగించుటకుఁ బూనుట యాయాదిత్యునకు దీపనీరాజన మొ
గుటయె. ఆటలపాటల మేటియగు నా విపశ్చిన్మణి మహామేధావి. పరదేవతాకరు
కటాక్ష లబ్ధానుపమానకవితా వైభవుఁడు. పలుబాసలం గూలంకష మగు ప్రజ్ఞ సు
ర్జించిన మహామనీషి. హరికథాపితామహ బిరుదమునే గాక కవితాపితామహ బి
దమున నలంకరింపనర్హుఁడు. వాగ్గేయకారకాగ్రేసరుఁడై లయబ్రహ్మయై యనే
గ్రంథములను రచించి యజరామరమగు యశఃకాయమున నలరారు రససిద్ధుఁడ
కవివతంసుఁడు. సునిశిత మతివైశద్యవినిర్జిత వాక్పతి. నవనవోన్మేష ప్రతిభాపరా
గీష్పతి.

ఆంధ్రభాషలో నందము నానందమును వెదఁజల్లు కవితను బ్రసాదించిన క
తల్లజులెందరో గలరు. అందచ్చపుం దెనుంగునఁ గబ్బముల నల్లినవారు కడునరుద
పదునెనిమిదవ శతాబ్దిని కూచిమంచి తిమ్మకవీంద్రుఁడు రామాయణము సీ
సుందరీ పరిణయము మున్నగు గ్రంథములను నా భాషలోఁ గూర్చినాఁడు
యయాతిచరిత్ర మట్టిదియ, పిదప 'కుద్దిగాం' వాస్తవ్యుఁడగు మహాకవి యొకం
'కవ్వడికత'ను రచించెను. ఈ మహాశయుఁడా కోవలోఁ జేరియుఁ బ్రథమశ్రే
నలంకరించినాఁడు. సంస్కృత సమముల మచ్చునకైన ముచ్చటింపక నచ్చు
దెలుఁగున నతి సరళ మృదుమధుర పదవిన్యాసమునఁ గవిత నందగించినాఁడు.

ఈతని గ్రంథరాజములలో 'తల్లి విన్కి' యొకటి. ఇయ్యది 'లలితాసహస్ర
నామస్తోత్రము'న కనువాదము. సంస్కృతభాషలో సుప్రసిద్ధమై యంబోపాసకుల
కుపాదేయమై యతిగంభీర భావగుంభితమై రమణీయ రచనావిన్యాసశోభితమై యా నా
మావళి యతిప్రశస్తినందినది. అద్దాని ననువదింపఁ బూనుట యసామాన్యకృత్యము.
భాస్కరరాయాద్యుపాసకాగ్రేసరుల యనుభవ వచనములతో, శ్రీకల్యాణానంద
భారతీమంతాచార్య స్వామిపుంగవుల 'గుణనికా' వివరణ విమర్శలతో నొప్పు పరమ
పవిత్రమంత్ర సంపుటియగు నాగ్రంథరాజము నచ్చతెనుఁగులోని కనువదించి, యం
దనన్యసామాన్యమగు కవితాశిల్పమును బ్రకటించి, యాగ్రంథరత్నమునకు మెఱుగుల
దిద్దిన యీ పండితప్రవేకుని పాండిత్యప్రతిభ యవితరసాధ్యము. అత్యంతశ్లాఘ్యము.

'తల్లివిన్కి' యను వాదమయ్యు స్వతంత్ర గ్రంథమువలె నొప్పినది. ఈ కవీంద్రుఁడు స్వతంత్ర ప్రతిభాసమన్వితుఁడయి పరదేవతాసాక్షాత్కారమును బడసిన భక్తావతంసుఁడగుటంజేసి యీగ్రంథమునకా రామణీయక మలవడినది.

ఈ మహాకవి తనగ్రంథారంభమునఁ 'తల్లివిన్కికుదురు'లోఁ బల్కిన పలుకులంబట్టి యిట్టిగ్రంథములను రచించుట కెట్టి యర్హత వలయునో స్పష్టమగుచున్నవి.

"విండారునోరిమి - నిబ్బరికంబు
మాటనిల్కడ తన్వి - మంచినడువడి
గుండెలిగువు కల్మి - గోరుతనమ్ము
తాల్మి దొఱఁగఁబోని - దకొల్లబ్రతుకు
అవిటులఁ బిల్లల - నరగడంబులను
నొప్పించ కెప్పుడు - ద్రొప్పిచేడినేర్పు
జంజాట మెడలి పీ - చమెడసి మిగుల
నడఁకువతోడుత - నందటిపట్ల
నడచుచుఁ ద్రాగక - నంజుడు తినక
చదువుగోటునఁ దెగ - సాఁగక పనికి
మాలిన కోర్కులం - బడయక లేని
పోని తలంపులఁ - బొరయక తనకుఁ
గలదానితోడుత - నగుఁ దన్వఁబొంది
పాటించి మైవంచి - పాటునకోర్చి
కూడుగుడ్డలఁ గూర్చు - కొని తోటిపాటి
వారలతోఁగూడి - వంత పంచుకొని
క్రుంగుపొంగులు మాను - కొని రేపుమాపు
లిమ్ములఁ గుడ్చువాఁ - డే 'తల్లివిన్కి'
గిడియతోఁజాటఁ ద - గిన మొనకాఁడు"

ఆహా! ఇట్టి గుణసంపద యలవడుట దుర్ఘటముగదా! ఏతద్గుణసంపన్నుండగుట నీ కార్యమునకుఁ బూనినవాఁడీ మహాశయుఁడు.

ఈ "తల్లివిన్కి" మంజరీద్విపద ఛ్ఛందస్సున నడచినది. గ్రంథాంతర్భాగమున 'గొలుసుసీసము-సీసము' అను రెండుపద్యములు మాత్రము గలవు. మంజరికి 'చెండు' అను నామాంతరమిడినాఁడీ మహాకవి. అందు తొలిపూవు మాత్రము నామా

ర్థము వెలింగించును. మిగిలిన పూవులన్నియు నా నామమందలి విశేషాంశములను వివరణములను వెలువరించును. మఱికొన్నిట స్వానుభవసౌరభము గుబాళించును. మిఱ్ఱుపల్లలకుఁ బాలొసంగక రచనయంతయు కమ్మచ్చులోఁ దీగవలె సాగినది. దాని నాకళించుకొనిన, నందలి విశేషములను గనిన ఈ మహాకవి సర్వతోముఖప్రజ్ఞ కలవాఁడనియుఁ బరదేవతానుగ్రహమును బడసినవాఁడనియు నిశ్శంకముగ నుడువ వచ్చును.

సంస్కృతముననో యచ్చతెనుఁగుననోగాక యన్యమగు మిశ్రమభాష నిద్దాని నుడివిన ఫలముండఁబోదనియు నందున నచ్చతెన్గున రచించితిననియుఁ బేర్కొని నాఁడీ మహాకవి.

"తెలఁగంట్ల నుడిగాని - తెలుఁగునన్గాని
తమఁ గొల్చువారి న - త్తల్లి గాపాడు"

ఈతని కెంత భాషాభిమానమో చదువరు లూహింతురుగాక.

స్త్రీ సమాజమంతయు శ్రీస్వరూపమే కావున స్త్రీలను నిర్బంధింపరాదనియు, వారికి స్వేచ్ఛాస్వాతంత్ర్యముల నొసంగి యాదరింపనగుననియుఁ బలికి స్త్రీ స్వాతంత్ర్యమును బ్రకటించిన సంస్కర్త యీ కవిపుంగవుఁడు.

ఇఁక నీ గ్రంథము నందలి యొండు రెండు విషయములను గమనింపుడు.

1. కుండలినీ నామ నిర్వచనము :-

కుట్టె నరంబుల - కున్దల్లి వేరు
టొకున మాడప - ట్టునలకుఁబాఱు
తెగ నీడఁగా నెగా - దిగఁ గుడియెడమ
వైపుల కున్జట్టి - వచ్చెడి యుసురు
మడత చుట్టుకొని మైమఱచి కుర్కెడెదు
చిల్వలాగు మిడుకు - చేవయౌ వేర్పు
అడియరి నెల్లపు - డలరించు నెఱుక.

2. దుర్గా నామనిర్వచనము :-

ఇడుమ లోర్చినవారి - కే చిక్కువేల్పు
ఏప్పటికి న్దొమ్మదేండ్ల యీడు చెలి
సమరతవర్వు ముచ్చటలూరు పడుచు
కాల్గొర్కికుర్కొని ము గతి - మెట్టబొట్టె

మగవాని నెఱుఁగదా - మలదొరపిల్ల
ఆద, పేఁత, నడుల - కందని యంకు
అల్మగల్తానయౌ - నాగట్టు పట్టి
వరపుఁ గోటవలెఁగా - పాడెటు వేల్పు.

3. ఉమా నామ నిర్వచనము :

ఉడుగు వల్దనుచుండ - నొనరించుఁగాఁక
మైమరాచినటు క్రు - మ్మరెడి మలప్ప
వాఁక తాఱపురాణి - వలిమలపిల్ల
అప్పనమెఱుకమై - నలరెడి వేల్పు
పసుపుడాలొప్పు గు - బ్బలిదొరపట్టి
కోరిక విలువునఁ - గొమరారు జేజె
ఇరుమూళ్లయేండ్ల యీ - డెలరు చిన్నారి

ప్రతినామమునందు నిట్టి విశేషాంశము లెన్నియోగలవు. ఇట్లన్నింటినిఁ బరిశీలించి యందలి బాహ్యాంతరార్థములనేగాక తన యనుభవమునుగూడ నందిమడ్చి యీగ్రంథమును రచించినాఁడీ మహాకవి.

వేయేల - ఇయ్యది సహస్రనామస్తోత్రమునకు సర్వంకషయగు వ్యాఖ్య. అచ్చతెనుఁగున నుండుటంజేసి యిద్ది సర్వులకు సాధ్యపడదను శంక జనించి కాఁబోలు ఆతఁడే యిందలి నూతన పదములకు టీకారూపమున వివరణ మొసంగినాఁడు. అయ్యది గ్రంథాంతమునఁ గాననగును.

అనితరసాధారణమగు ప్రతిభా వ్యుత్పత్తులతో రచింపఁబడిన యీగ్రంథరాజమును బఠించి యిందలిసారము నాకళించుకొని యానందించి యాతల్లియనుగ్రహమునకుఁ బాత్రులగుదురుగాక.

ఓంతత్సత్.

విశాఖపట్టణము

సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి, M. A.
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు.



చతుర్భుజే చంద్రకళావతంసే కుచోన్నతే కుంకుమరాగశోణే
పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే నమస్తే జగదేకమాతః



శ్రీచక్రరాజము

"బిందు, త్రికోణ, కాష్ఠాఽవశారయుగ, లోకకోణ వృత్తయుతమ్.
వసుదళ, వృత్త, కళాదళ, వృత్త, త్రిమహీగృహం భజే చక్రమ్."

— ప్రపంచసార సంగ్రహము

# శ్రీ లలితా సహస్రనామావళిః

శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ ।
చిదగ్నికుణ్డసమ్భూతా దేవకార్యసముద్యతా॥ ౧

ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహుసమన్వితా ।
రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాఙ్కుశోజ్జ్వలా॥ ౨

మనోరూపేక్షుకోదణ్డా పఞ్చతన్మాత్రసాయకా ।
నిజారుణప్రభాపూరమజ్జద్బ్రహ్మాణ్డమణ్డలా॥ ౩

చమ్పకాశోకపున్నాగసౌగన్ధికలసత్కచా।
కురువిన్దమణిశ్రేణీకనత్కోటీరమణ్డితా॥ ౪

అష్టమీచన్ద్రవిభ్రాజదళికస్థలశోభితా।
ముఖచన్ద్రకళఙ్కాభ మృగనాభివిశేషకా॥ ౫

వదనస్మరమాంగల్యగృహతోరణచిల్లికా।
వక్త్రలక్ష్మీపరీవాహచలన్మీనాభలోచనా॥ ౬

నవచమ్పకపుష్పాభనాసాదణ్డవిరాజితా।
తారాకాన్తితిరస్కారినాసాభరణభాసురా॥ ౭

కదమ్బమంజరీక్లృప్తకర్ణపూరమనోహరా।
తాటఙ్కయుగళీభూతతపనోడుపమండలా॥ ౮

పద్మరాగశిలాదర్శ పరిభావికపోలభూః।
నవవిద్రుమబిమ్బశ్రీన్యక్కారిరదనచ్ఛదా॥ ౯

శుద్ధవిద్యాఙ్కురాకారద్విజపంక్తిద్వయోజ్జ్వలా।
కర్పూరవీటికామోదసమాకర్షి దిగన్తరా॥ ౧౦

నిజసల్లాపమాధుర్యవినిర్భర్త్సితకచ్ఛపీ।
మన్దస్మితప్రభాపూరమజ్జత్కామేశమానసా॥ ౧౧

అనాకలితసాదృశ్యచుబుక శ్రీవిరాజితా।
కామేశబద్ధ మాంగల్యసూత్రశోభితకన్ధరా॥
కనకాంగద కేయూర కమనీయభుజాన్వితా।
రత్నగ్రైవేయచిన్తాకలోలముక్తాఫలాన్వితా॥
కామేశ్వరప్రేమరత్నమణిప్రతిపణస్తనీ।
నాభ్యాలవాలరోమాళిలతాఫలకుచద్వయీ॥
లక్ష్యరోమలతాధారతాసమున్నేయమధ్యమా।
స్తనభారదళన్మధ్యపట్టబన్ధవళిత్రయా॥
అరుణారుణకౌసుంభ వస్త్రభాస్వత్కటీతటీ।
రత్నకిఙ్కిణికారమ్యరశనాదామభూషితా॥
కామేశజ్ఞాతసౌభాగ్యమార్దవోరుద్వయాన్వితా।
మాణిక్యమకుటాకారజానుద్వయవిరాజితా॥
ఇంద్రగోప పరిక్షిప్తస్మరతూణాభజంఘికా।
గూఢగుల్ఫా కూర్మపృష్ఠజయిష్ణుప్రపదాన్వితా॥
నఖదీధితిసంఛన్ననమజ్జనత మోగుణా।
పదద్వయప్రభాజాలపరాకృతసరోరుహా॥
శింజానమణిమంజీరమణ్డిత శ్రీపదామ్బుజా।
మరాళీమన్దగమనా మహాలావణ్య శేవధిః॥
సర్వారుణాఽనవద్యాంగీ సర్వాభరణభూషితా।
శివకామేశ్వరాఙ్కస్థా శివా స్వాధీనవల్లభా॥
సుమేరుమధ్యశృంగస్థా శ్రీమన్నగరనాయికా।
చిన్తామణిగృహాన్తస్థా పఞ్చబ్రహ్మాసనస్థితా॥
మహాపద్మాటవీసంస్థా కదమ్బవనవాసినీ।
సుధాసాగరమధ్యస్థా కామాక్షీ కామదాయినీ॥

దేవర్షిగణసంఘాతస్తూయమానాత్మవైభవా।
భండాసురవధోద్యుక్తశక్తిసేనాసమన్వితా॥ ౨౪

సమ్పత్కరీసమారూఢసిన్ధురవ్రజసేవితా।
అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటికోటిభిరావృతా॥ ౨౫

చక్రరాజరథారూఢసర్వాయుధపరిష్కృతా।
గేయచక్రరథారూఢమంత్రిణీపరిసేవితా॥ ౨౬

కిరిచక్రరథారూఢదండనాథాపురస్కృతా।
జ్వాలామాలినికాక్షిప్తవహ్నిప్రాకారమధ్యగా॥ ౨౭

భండసైన్యవధోద్యుక్తశక్తివిక్రమహర్షితా।
నిత్యాపరాక్రమాటోపనిరీక్షణసముత్సుకా॥ ౨౮

భండపుత్రవధోద్యుక్తబాలావిక్రమనందితా।
మంత్రిణ్యంబావిరచితవిషంగవధతోషితా॥ ౨౯

విశుక్రప్రాణహరణవారాహీవీర్యనందితా।
కామేశ్వరముఖాలోకకల్పితశ్రీగణేశ్వరా॥ ౩౦

మహాగణేశనిర్భిన్నవిఘ్నయంత్రప్రహర్షితా।
భండాసురేంద్రనిర్ముక్తశస్త్రప్రత్యస్త్రవర్షిణీ॥ ౩౧

కరాంగుళినఖోత్పన్ననారాయణదశాకృతిః।
మహాపాశుపతాస్త్రాగ్నినిర్దగ్ధాసురసైనికా॥ ౩౨

కామేశ్వరాస్త్రనిర్దగ్ధసభండాసురశూన్యకా।
బ్రహ్మోపేంద్రమహేంద్రాదిదేవసంస్తుతవైభవా॥ ౩౩

హరనేత్రాగ్నిసందగ్ధకామసంజీవనౌషధిః।
శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజా। ౨౪

కంఠాధఃకటిపర్యంతమధ్యకూటస్వరూపిణీ।
శక్తికూటైకతాపన్నకట్యధోభాగధారిణీ॥ ౩౫

మూలమంత్రాత్మికా మూలకూటత్రయకళేబరా।
కులామృతైకరసికా కులసంకేతపాలినీ॥

కులాంగనా కులాంతస్థా కౌలినీ కులయోగినీ।
అకులా సమయాంతస్థా సమయాచారతత్పరా॥

మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంథివిభేదినీ।
మణిపూరాంతరుదితా విష్ణుగ్రంథివిభేదినీ॥

ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథివిభేదినీ।
సహస్రారాంబుజారూఢా సుధాసారాభివర్షిణీ॥

తడిల్లతాసమరుచిష్షట్చక్రోపరిసంస్థితా।
మహాసక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ॥

భవానీ భావనాగమ్యా భవారణ్యకుఠారికా।
భద్రప్రియా భద్రమూర్తి ర్భక్తసౌభాగ్యదాయినీ॥

భక్తిప్రియా భక్తిగమ్యా భక్తివశ్యా భయాపహా।
శాంభవీ శారదారాధ్యా శర్వాణీ శర్మదాయినీ॥

శాంకరీ శ్రీకరీ సాధ్వీ శరచ్చంద్రనిభాననా।
శాతోదరీ శాంతిమతీ నిరాధారా నిరంజనా॥

నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా।
నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా॥

నిత్యముక్తా నిర్వికారా నిష్ప్రపంచా నిరాశ్రయా।
నిత్యశుద్ధా నిత్యబుద్ధా నిరవద్యా నిరంతరా॥

నిష్కారణా నిష్కళంకా నిరుపాధి ర్నిరీశ్వరా।
నీరాగా రాగమథనీ నిర్మదా మదనాశినీ॥

నిశ్చింతా నిరహంకారా నిర్మోహా మోహనాశినీ।
నిర్మమా మమతాహంత్రీ నిష్పాపా పాపనాశినీ॥

నిష్క్రోధా క్రోధశమనీ నిర్లోభా లోభనాశినీ।
నిస్సంశయా సంశయఘ్నీ నిర్భవా భవనాశినీ॥ ౪౮

నిర్వికల్పా నిరాబాధా నిర్భేదా భేదనాశినీ।
నిర్నాశా మృత్యుమథనీ నిష్క్రియా నిష్పరిగ్రహా॥ ౪౯

నిస్తులా నీలచికురా నిరపాయా నిరత్యయా।
దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహంత్రీ సుఖప్రదా॥ ౫౦

దుష్టదూరా దురాచారశమనీ దోషవర్జితా।
సర్వజ్ఞా సాంద్రకరుణా సమానాధికవర్జితా ౫౧

సర్వశక్తిమయీ సర్వమంగళా సద్గతిప్రదా।
సర్వేశ్వరీ సర్వమయీ సర్వమంత్రస్వరూపిణీ॥ ౫౨

సర్వయన్త్రాత్మికా సర్వతంత్రరూపా మనోన్మనీ।
మాహేశ్వరీ మహాదేవీ మహాలక్ష్మీ ర్మృడప్రియా॥ ౫౩

మహారూపా మహాపూజ్యా మహాపాతకనాశినీ।
మహామాయా మహాసత్త్వా మహాశక్తి ర్మహారతిః॥ ౫౪

మహాభోగా మహైశ్వర్యా మహావీర్యా మహాబలా।
మహాబుద్ధి ర్మహాసిద్ధి ర్మహాయోగేశ్వరేశ్వరీ॥ ౫౫

మహాతన్త్రా మహామన్త్రా మహా యన్త్రా మహాసనా।
మహా యాగక్రమారాధ్యా మహాభైరవపూజితా॥ ౫౬

మహేశ్వర మహాకల్ప మహాతాండవసాక్షిణీ।
మహాకామేశమహిషీ మహాత్రిపురసుందరీ॥ ౫౭

చతుష్షష్ట్యుపచారాఢ్యా చతుష్షష్టికళామయీ।
మహాచతుష్షష్టికోటియోగినీగణసేవితా॥ ౫౮

మనువిద్యా చంద్రవిద్యా చంద్రమండలమధ్యగా।
చారురూపా చారుహాసా చారుచంద్రకళాధరా॥ ౫౯

చరాచరజగన్నాథా చక్రరాజనికేతనా।
పార్వతీ పద్మనయనా పద్మరాగసమప్రభా॥

పఞ్చప్రేతాసనాసీనా పఞ్చబ్రహ్మస్వరూపిణీ।
చిన్మయీ పరమానన్దా విజ్ఞానఘనరూపిణీ॥

ధ్యానధ్యాతృధ్యేయరూపా ధర్మాధర్మవివర్జితా।
విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా॥

సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థావివర్జితా।
సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ॥

సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ।
సదాశివాఽనుగ్రహదా పఞ్చకృత్యపరాయణా॥

భానుమండలమధ్యస్థా భైరవీ భగమాలినీ।
పద్మాసనా భగవతీ పద్మనాభసహోదరీ॥

ఉన్మేషనిమిషోత్పన్నవిపన్నభువనావళిః
సహస్రశీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్॥

ఆబ్రహ్మకీటజననీ వర్ణాశ్రమవిధాయినీ।
నిజాజ్ఞారూపనిగమా పుణ్యాపుణ్యఫలప్రధా॥

శ్రుతిసీమన్తసిందూరీకృతపాదాబ్జధూళికా।
సకలాగమసన్దోహశుక్తిసమ్పుటమౌక్తికా॥

పురుషార్థప్రదా పూర్ణాభోగినీ భువనేశ్వరీ।
అమ్బికాఽనాదినిధనా హరిబ్రహ్మేన్ద్రసేవితా।

నారాయణీ నాదరూపా నామరూపవివర్జితా।
హ్రీంకారీ హ్రీమతీ హృద్యా హేయోపాదేయవర్జితా॥

రాజరాజార్చితా రాజ్ఞీ రమ్యా రాజీవలోచనా।
రంజనీ రమణీ రస్యా రణత్కిఙ్కిణిమేఖలా॥

రమా రాకేన్దువదనా రతిరూపా రతిప్రియా।
రక్షాకరీ రాక్షసఘ్నీ రామా రమణలమ్పటా॥ ౭౨

కామ్యా కామ కలారూపా కదమ్బకుసుమప్రియా।
కల్యాణీ జగతీకన్దా కరుణారససాగరా॥ ౭౩

కళావతీ కళాలాపా కాన్తా కాదమ్బరీప్రియా।
వరదా వామనయనా వారుణీమదవిహ్వలా॥ ౭౪

విశ్వాధికా వేదవేద్యా విన్ధ్యాచలనివాసినీ।
విధాత్రీ వేదజననీ విష్ణుమాయా విలాసినీ॥ ౭౫

క్షేత్రస్వరూపా క్షేత్రేశీ క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ।
క్షయవృద్ధివినిర్ముక్తా క్షేత్రపాలసమర్చితా॥ ౭౬

విజయా విమలా వన్ద్యా వందారుజనవత్సలా।
వాగ్వాదినీ వామకేశీ వహ్నిమండలవాసినీ॥ ౭౭

భక్తిమత్కల్పలతికా పశుపాశవిమోచనీ।
సంహృతాశేషపాషండా సదాచారప్రవర్తికా॥ ౭౮

తాపత్రయాగ్నిసంతప్తసమాహ్లాదనచంద్రికా।
తరుణీ తాపసారాధ్యా తనుమధ్యా తమోపహా॥ ౭౯

చితి స్తత్పదలక్ష్యార్థా చిదేకరసరూపిణీ।
స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతతిః॥ ౮౦

పరా ప్రత్యక్చితీరూపా పశ్యంతీ పరదేవతా।
మధ్యమా వైఖరీరూపా భక్తమానసహంసికా॥ ౮౧

కామేశ్వరప్రాణనాడీ కృతజ్ఞా కామపూజితా।
శృంగారరససమ్పూర్ణా జయా జాలంధరస్థితా॥ ౮౨

ఓడ్యాణపీఠనిలయా బిందుమండలవాసినీ।
రహోయాగక్రమారాధ్యా రహస్తర్పణతర్పితా॥ ౮౩

సద్యః ప్రసాదినీ విశ్వసాక్షిణీ సాక్షివర్జితా।
షడంగదేవతాయుక్తా షాడ్గుణ్యపరిపూరితా॥

నిత్యక్లిన్నా నిరుపమా నిర్వాణసుఖదాయినీ।
నిత్యాషోడశికారూపా శ్రీకంఠార్ధశరీరిణీ॥

ప్రభావతీ ప్రభారూపా ప్రసిద్ధా పరమేశ్వరీ।
మూలప్రకృతి రవ్యక్తా వ్యక్తావ్యక్త స్వరూపిణీ॥

వ్యాపినీ వివిధాకారా విద్యావిద్యాస్వరూపిణీ।
మహాకామేశనయనకుముదాహ్లాదకౌముదీ॥

భక్తహార్దతమోభేదభానుమద్భానుసంతతిః।
శివదూతీ శివారాధ్యా శివమూర్తి శ్శివంకరీ॥

శివప్రియా శివపరా శిష్టేష్టా శిష్టపూజితా।
అప్రమేయా స్వప్రకాశా మనోవాచామగోచరా॥

చిచ్ఛక్తి శ్చేతనారూపా జడశక్తి ర్జడాత్మికా।
గాయత్రీ వ్యాహృతి స్సన్ధ్యా ద్విజబృందనిషేవితా॥

తత్త్వాసనా తత్త్వమయీ పఞ్చకోశాన్తర స్థితా।
నిస్సీమమహిమా నిత్యయౌవనా మదశాలినీ॥

మదఘూర్ణితరక్తాక్షీ మదపాటలగండభూః।
చందనద్రవదిగ్ధాంగీ చామ్పేయకుసుమప్రియా॥

కుశలా కోమలాకారా కురుకుళ్ళా కులేశ్వరీ।
కులకుండాలయా కౌళమార్గతత్పరసేవితా॥

కుమారగణనాథామ్బా తుష్టిః పుష్టి ర్మతిర్ధృతిః।
శాన్తి స్స్వస్తిమతీ కాన్తి ర్నన్దినీ విఘ్ననాశినీ॥

తేజోవతీ త్రినయనా లోలాక్షీకామరూపిణీ।
మాలినీ హంసినీ మాతా మలయాచలవాసినీ।

సుముఖీ నళినీ సుభ్రూశ్శోభనా సురనాయికా।
కాలకంఠీ కాన్తిమతీ క్షోభిణీ సూక్ష్మరూపిణీ॥ ౯౬

వజ్రేశ్వరీ వామదేవీ వయోఽవస్థావివర్జితా।
సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా సిద్ధమాతా యశస్వినీ॥ ౯౭

విశుద్ధిచక్రనిలయా రక్తవర్ణా త్రిలోచనా।
ఖట్వాంగాదిప్రహరణా వదనైకసమన్వితా॥ ౯౮

పాయసాన్నప్రియా త్వక్స్థా పశులోకభయంకరీ।
అమృతాదిమహాశక్తిసంవృతా డాకినీశ్వరీ॥ ౯౯

అనాహతాబ్జనిలయా శ్యామాభా వదనద్వయా।
దంష్ట్రోజ్జ్వలాఽక్షమాలాదిధరా రుధిరసంస్థితా॥ ౧౦౦

కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతా స్నిగ్ధౌదనప్రియా।
మహావీరేంద్రవరదా రాకిన్యంబాస్వరూపిణీ॥ ౧౦౧

మణిపూరాబ్జనిలయా వదనత్రయసంయుతా।
వజ్రాదికాయుధోపేతా డామర్యాదిభిరావృతా॥ ౧౦౨

రక్తవర్ణా మాంసనిష్ఠా గుడాన్నప్రీతమానసా।
సమస్తభక్తసుఖదా లాకిన్యంబాస్వరూపిణీ॥ ౧౦౩

స్వాధిష్ఠానాంబుజగతా చతుర్వక్త్రమనోహరా।
శూలాద్యాయుధసంపన్నా పీతవర్ణాఽతిగర్వితా॥ ౧౦౪

మేదోనిష్ఠా మధుప్రీతా బందిన్యాదిసమన్వితా।
దధ్యన్నాసక్తహృదయా కాకినీరూపధారిణీ॥ ౧౦౫

మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాఽస్థిసంస్థితా।
అంకుశాదిప్రహరణా వరదాదినిషేవితా॥ ౧౦౬

ముద్గౌదనాసక్తచిత్తా సాకిన్యంబాస్వరూపిణీ।
ఆజ్ఞాచక్రాబ్జనిలయా శుక్లవర్ణా షడాననా॥ ౧౦౭

మజ్జాసంస్థా హంసవతీముఖ్యశక్తిసమన్వితా।
హరిద్రాన్నైకరసికా హాకినీరూపధారిణీ॥

సహస్రదళపద్మస్థా సర్వవర్ణోపశోభితా।
సర్వాయుధధరా శుక్లసంస్థితా సర్వతోముఖీ॥

సర్వౌదనప్రీతచిత్తా యాకిన్యంబాస్వరూపిణీ।
స్వాహా స్వధా మతి ర్మేధా శ్రుతిః స్మృతి రనుత్తమా॥

పుణ్యకీర్తిః పుణ్యలభ్యా పుణ్యశ్రవణకీర్తనా।
పులోమజార్చితా బంధమోచనీ బంధురాలకా॥

విమర్శరూపిణీ విద్యా వియదాదిజగత్ప్రసూః।
సర్వవ్యాధిప్రశమనీ సర్వమృత్యునివారిణీ॥

అగ్రగణ్యాఽచిన్త్యరూపా కలికల్మషనాశినీ।
కాత్యాయనీ కాలహంత్రీ కమలాక్షనిషేవితా॥

తాంబూలపూరితముఖీ దాడిమీకుసుమప్రభా ।
మృగాక్షీ మోహినీ ముఖ్యా మృడానీ మిత్రరూపిణీ ॥

నిత్యతృప్తా భక్తనిధి ర్నియంత్రీ నిఖిలేశ్వరీ ।
మైత్ర్యాదివాసనాలభ్యా మహాప్రళయసాక్షిణీ ।

పరాశక్తిః పరానిష్ఠా ప్రజ్ఞానఘనరూపిణీ ।
మాధ్వీపానాలసామత్తా మాతృకావర్ణరూపిణీ ॥

మహాకైలాసనిలయా మృణాలమృదుదోర్లతా ।
మహనీయా దయామూర్తి ర్మహాసామ్రాజ్యశాలినీ ॥

ఆత్మవిద్యా మహావిద్యా శ్రీవిద్యా కామసేవితా ।
శ్రీషోడశాక్షరీవిద్యా త్రికూటా కామకోటికా ॥

కటాక్షకింకరీభూతకమలాకోటిసేవితా ।
శిరఃస్థితా చన్ద్రనిభా ఫాలస్థేన్ద్రధనుః ప్రభా॥

హృదయస్థా రవిప్రఖ్యా త్రికోణాన్తరదీపికా ।
దాక్షాయణీ దైత్యహన్త్రీ దక్షయజ్ఞ వినాశిని ॥ ౧౨౦

దరాన్దోళితదీర్ఘాక్షీ దరహాసోజ్జ్వలన్ముఖీ ।
గురుమూర్తి ర్గుణనిధి ర్గోమాతా గుహజన్మభూః ॥ ౧౨౧

దేవేశీ దండనీతిస్థా దహరాకాశరూపిణీ ।
ప్రతిపన్ముఖ్యరాకాన్తతిథి మండలపూజితా ॥ ౧౨౨

కళాత్మికా కళానాథా కావ్యాలాపవినోదినీ।
సచామరరమావాణీసవ్యదక్షిణ సేవితా॥ ౧౨౩

ఆదిశక్తి రమేయాత్మా పరమా పావనాకృతిః।
అనేకకోటిబ్రహ్మాండజననీ దివ్యవిగ్రహా ౧౨౪

క్లీంకారీ కేవలా గుహ్యాకైవల్యపదదాయినీ।
త్రిపురా త్రిజగద్వన్ద్యా త్రిమూర్తిస్త్రిదశేశ్వరీ॥ ౧౨౫

త్ర్యక్షరీ దివ్యగంధాఢ్యా సిందూరతిలకాఞ్చితా।
ఉమా శైలేన్ద్రతనయా గౌరీ గన్ధర్వ సేవితా॥ ౧౨౬

విశ్వగర్భా స్వర్ణగర్భా వరదా వాగధీశ్వరీ।
ధ్యానగమ్యాఽపరిచ్ఛేద్యా జ్ఞానదా జ్ఞానవిగ్రహా॥ ౧౨౭

సర్వవేదాన్తసంవేద్యా సత్యానన్దస్వరూపిణీ।
లోపాముద్రార్చితా లీలాకౢప్తబ్రహ్మాండమండలా ॥ ౧౨౮

అదృశ్యా దృశ్యరహితా విజ్ఞాత్రీ వేద్యవర్జితా।
యోగినీయోగదాయోగ్యాయోగానందా యుగన్ధరా॥ ౧౨౯

ఇచ్ఛాశక్తిజ్ఞానశక్తి క్రియాశక్తిస్వరూపిణీ।
సర్వాధారా సుప్రతిష్ఠా సదసద్రూపధారిణీ॥ ౧౩౦

అష్టమూర్తి రజాజైత్రీ లోకయాత్రావిధాయినీ।
ఏకాకినీభూమరూపా నిర్ద్వైతా ద్వైతవర్జితా॥ ౧౩౧

అన్నదా వసుదా వృద్ధా బ్రహ్మాత్మైక్యస్వరూపిణీ।
బృహతీ బ్రాహ్మణీ బ్రాహ్మీ బ్రహ్మానందా బలిప్రియా॥

భాషారూపా బృహత్సేనా భావాభావవివర్జితా।
సుఖారాధ్యా శుభకరీ శోభనాసులభాగతిః॥

రాజరాజేశ్వరీ రాజ్యదాయినీ రాజ్యవల్లభా।
రాజత్కృపా రాజపీఠనివేశితనిజాశ్రితా॥

రాజ్యలక్ష్మీః కోశనాథా చతురంగబలేశ్వరీ।
సామ్రాజ్యదాయినీ సత్యసంధా సాగరమేఖలా॥

దీక్షితా దైత్యశమనీ సర్వలోకవశంకరీ।
సర్వార్థదాత్రీ సావిత్రీ సచ్చిదానన్దరూపిణీ॥

దేశకాలాపరిచ్ఛిన్నా సర్వగా సర్వమోహినీ।
సరస్వతీ శాస్త్రమయీ గుహాంబా గుహ్యరూపిణీ॥

సర్వోపాధివినిర్ముక్తా సదాశివపతివ్రతా।
సమ్ప్రదాయేశ్వరీ సాధ్వీ గురుమండలరూపిణీ॥

కులోత్తీర్ణా భగారాధ్యా మాయా మధుమతీ మహీ।
గణాంబా గుహ్యకారాధ్యా కోమలాంగీ గురుప్రియా॥

స్వతన్త్రా సర్వతంత్రేశీ దక్షిణామూర్తిరూపిణీ।
సనకాదిసమారాధ్యా శివజ్ఞానప్రదాయినీ॥

చిత్కళానందకలికా ప్రేమరూపా ప్రియంకరీ।
నామపారాయణప్రీతా నందివిద్యా నటేశ్వరీ

మిథ్యాజగదధిష్ఠానా ముక్తిదా ముక్తిరూపిణీ।
లాస్యప్రియా లయకరీ లజ్జా రంభాదివందితా॥

భవదావసుధావృష్టిః పాపారణ్యదవానలా।
దౌర్భాగ్యతూలవాతూలా జరాధ్వాంతరవిప్రభా॥

భాగ్యాబ్ధిచంద్రికా భక్తచిత్తకేకిఘనాఘనా।
రోగపర్వతదంభోళి ర్మృత్యుదారుకుఠారికా ౧౪౪

మహేశ్వరీ మహాకాళీ మహాగ్రాసా మహాశనా।
అపర్ణా చండికా చండముండాసురనిషూదినీ॥ ౧౪౫

క్షరాక్షరాత్మికా సర్వలోకేశీ విశ్వధారిణీ।
త్రివర్గదాత్రీ సుభగా త్ర్యంబకా త్రిగుణాత్మికా॥ ౧౪౬

స్వర్గాపవర్గదా శుద్ధా జపాపుష్పనిభాకృతిః।
ఓజోవతీ ద్యుతిధరా యజ్ఞరూపా ప్రియవ్రతా॥ ౧౪౭

దురారాధ్యా దురాధర్షా పాటలీకుసుమప్రియా।
మహతీ మేరునిలయా మందారకుసుమప్రియా॥ ౧౪౮

వీరారాధ్యా విరాడ్రూపా విరజా విశ్వతోముఖీ।
ప్రత్యగ్రూపా పరాకాశా ప్రాణదా ప్రాణరూపిణీ॥ ౧౪౯

మార్తండభైరవారాధ్యా మన్త్రిణీన్యస్త రాజ్యధూః।
త్రిపురేశీ జయత్సేనా నిస్త్రైగుణ్యా పరాపరా॥ ౧౫౦

సత్యజ్ఞానానందరూపా సామరస్యపరాయణా।
కపర్దిని కళామాలా కామధు క్కామరూపిణీ॥ ౧౫౧

కళానిధిః కావ్యకళా రసజ్ఞా రసశేవధిః।
పుష్టా పురాతనా పూజ్యా పుష్కరా పుష్కరేక్షణా॥ ౧౫౨

పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరా।
పాశహస్తా పాశహంత్రీ పరమంత్రవిభేదినీ॥ ౧౫౩

మూర్తాఽమూర్తానిత్యతృప్తా మునిమానసహంసికా।
సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామిణీ సతీ॥ ౧౫౪

బ్రహ్మాణీ బ్రహ్మజననీ బహురూపా బుధార్చితా।
ప్రసవిత్రీ ప్రచండాఽజ్ఞా ప్రతిష్ఠా ప్రకటాకృతిః॥ ౧౫౫

ప్రాణేశ్వరీ ప్రాణదాత్రీ పంచాశత్పీఠరూపిణీ।
విశృంఖలా వివిక్తస్థా వీరమాతా వియత్ప్రసూః॥ ౧౫౬

ముకుందా ముక్తినిలయా మూలవిగ్రహరూపిణీ।
భావజ్ఞా భవరోగఘ్నీ భవచక్రప్రవర్తినీ॥ ౧౫౭

ఛందస్సారా శాస్త్రసారా మంత్రసారా తలోదరీ।
ఉదారకీర్తి రుద్దామవైభవా వర్ణరూపిణీ॥ ౧౫౮

జన్మమృత్యుజరాతప్తజనవిశ్రాంతిదాయినీ।
సర్వోపనిషదుద్ఘుష్టా శాంత్యతీతకళాత్మికా॥ ౧౫౯

గంభీరా గగనాంతస్థా గర్వితా గానలోలుపా।
కల్పనారహితా కాష్ఠా కాంతా కాంతార్ధవిగ్రహా॥ ౧౬౦

కార్యకారణనిర్ముక్తా కామకేళితరంగితా।
కనత్కనక తాటంకా లీలావిగ్రహధారిణీ॥ ౧౬౧

అజా క్షయవినిర్ముక్తా ముగ్ధా క్షిప్రప్రసాదినీ।
అంతర్ముఖసమారాధ్యా బహిర్ముఖసుదుర్లభా॥ ౧౬౨

త్రయీ త్రివర్గనిలయా త్రిస్థా త్రిపురమాలినీ।
నిరామయా నిరాలంబా స్వాత్మారామా సుధాసృతిః॥ ౧౬౩

సంసారపంకనిర్మగ్నసముద్ధరణపండితా।
యజ్ఞప్రియా యజ్ఞకర్త్రీ యజమానస్వరూపిణీ॥ ౧౬౪

ధర్మాధారా ధనాధ్యక్షా ధనధాన్యవివర్ధనీ।
విప్రప్రియా విప్రరూపా విశ్వభ్రమణకారిణీ॥ ౧౬౫

విశ్వగ్రాసా విద్రుమాభా వైష్ణవీ విష్ణురూపిణీ।
అయోని ర్యోనినిలయా కూటస్థా కులరూపిణీ॥ ౧౬౬

వీరగోష్ఠీప్రియా వీరా నైష్కర్మ్యా నాదరూపిణీ।
విజ్ఞానకలనా కల్యా విదగ్ధా బైందవాసనా॥ ౧౬౭

తత్త్వాధికా తత్త్వమయీ తత్త్వమర్థస్వరూపిణీ।
సామగానప్రియా సౌమ్యా సదాశివకుటుంబినీ॥ ౧౬౮

సవ్యాపసవ్యమార్గస్థా సర్వాపద్వినివారిణీ।
స్వస్థా స్వభావమధురా ధీరాధీరసమర్చితా॥ ౧౬౯

చైతన్యార్ఘ్యసమారాధ్యా చైతన్యకుసుమప్రియా।
సదోదితా సదాతుష్టా తరుణాదిత్యపాటలా॥ ౧౭౦

దక్షిణా దక్షిణారాధ్యా దరస్మేరముఖాంబుజా।
కౌళినీ కేవలాఽనర్ఘ్యకైవల్యపదదాయినీ॥ ౧౭౧

స్తోత్రప్రియా స్తుతిమతీ శ్రుతిసంస్తుతవైభవా।
మనస్వినీ మానవతీ మహేశీ మంగళాకృతిః॥ ౧౭౨

విశ్వమాతా జగద్ధాత్రీ విశాలాక్షీ విరాగిణీ।
ప్రగల్భా పరమోదారా పరామోదా మనోమయీ॥ ౧౭౩

వ్యోమకేశీ విమానస్థా వజ్రిణీ వామకేశ్వరీ।
పఞ్చయజ్ఞప్రియా పఞ్చప్రేతమఞ్చాధిశాయినీ॥ ౧౭౪

పంచమీ పంచభూతేశీ పంచసంఖ్యోపచారిణీ।
శాశ్వతీ శాశ్వతైశ్వర్యా శర్మదా శమ్భుమోహినీ॥ ౧౭౫

ధరా ధరసుతా ధన్యా ధర్మిణీ ధర్మవర్ధనీ।
లోకాతీతా గుణాతీతా సర్వాతీతా శమాత్మికా॥ ౧౭౬

బంధూకకుసుమప్రఖ్యా బాలా లీలావినోదినీ।
సుమంగలీ సుఖకరీ సువేషాఢ్యా సువాసినీ॥ ౧౭౭

సువాసిన్యర్చనప్రీతా శోభనా శుద్ధమానసా।
బిందుతర్పణసంతుష్టా పూర్వజా త్రిపురామ్బికా॥ ౧౭౮

దశముద్రాసమారాధ్యా త్రిపురా శ్రీవశంకరీ।
జ్ఞానముద్రా జ్ఞానగమ్యా జ్ఞానజ్ఞేయస్వరూపిణీ॥ ౧౭౯

యోనిముద్రా త్రిఖండేశీ త్రిగుణాఽమ్బా త్రికోణగా।
అనఘాఽద్భుతచారిత్రా వాంఛితార్థ ప్రదాయినీ॥

అభ్యాసాతిశయజ్ఞాతా షడధ్వాతీతరూపిణీ ।
అవ్యాజకరుణామూర్తి రజ్ఞానధ్వాంతదీపికా।

ఆబాలగోపవిదితా సర్వానుల్లంఘ్యశాసనా।
శ్రీచక్రరాజనిలయా శ్రీమత్త్రిపురసుందరీ॥

శ్రీశివాశివశక్త్యైక్యరూపిణీ లలితాంబికా ॥





Adibhatla Narayanadas
Principal,
Sri Vijayarama Ganapatasala.
Vizianagram.



"ఒక పండితోద్దండుఁ డుద్ధతుం డొక యోద్ధ
ఒక మహాసమ్రాట్టు నొక మహర్షి" — యస్వీ.

## మ ట్టు

ఎవ్వరికైన స్థమపుట్టు పీడేర్చుకొను తెలింగుల న్దోటిపాటియంద ఱితో మిక్కిలి పొత్తుగొని యెవ్వరినైన నెపుడేని న్గొంచెమయిన నొప్పిం చ కందఱు న్మెచ్చఁదగిన మంచినడువడి పూటపూటకున్వొంపారఁబొసరు చూపక నలువురితోఁ గలసిమెలసి హాయిగా బ్రతుకుకొనసాగించుకొనుట కంటె వెరవింకేదియున్లేదు. మేనువంచి నుదిటచెమ్మటనూడ్చి నలువురు మెచ్చుకొను తీరునఁ బాటుపడి కూడుగుడ్డలు కూర్చుకొని యిరుగుపొరుగు వారలతో నన్నియాస్తుల న్వంతుపంచుకొని యెక్కువతక్కువ తెగలవాసి యెన్నుకొన కొండొరిమిక నెమ్మినెనరొర్పులు నిండార మనుటమేలు. తేర గావచ్చిన యాస్తుల న్దెగనీల్గుచు సోమరులైన చెడుగొట్టులకు నిండుతనివి కలుగఁబోదు. కలయందుదాల్చిన యొడలు, సల్పెడుపను లెట్లు కలలయ్యు నిక్కముగాఁదోచునో యటుల నిరుగుపొరుగు పచ్చ కిట్టని పాపాలముద్దలకే తనవారు-పైవారు, నేను – నాదను వేలువేలు చెడుతలంపులొదవి పెచ్చు పెరుగుచుండును. ఒరులకు గల్గినమేలు తనదిగా నుప్పొంగు మంచివారికే నిక్కముగా నింగినేలలందు జరుగు నేపనులకైన న్దగనిపొంగుక్రుంగులు లేకుండును. పిల్లలయెడలఁ గన్నతల్లికన్న పైవారలకుఁ గూర్మియంతగా నుండదు కనుక నోజగా నింగినేలల దిన్సులన్నియు న్దనయాటకై దాఁ బుట్టించి పెంచి తనలోఁజేర్చుకొనఁగల్గిన చేవయే తల్లియన నొప్పునని తెలిసిన తొల్లింటిపెద్దలు కన్నతల్లినే వేల్పుగాఁ గొల్వఁజొచ్చిరి. ఎల్లకొ ర్కు లుడిగి యొరుల మేలునకై పాటుపడు మంచివారుతప్పఁ దల్లిన్గొల్చు టకుఁ దక్కినకడుపుకక్కుర్తికాం డ్రిసుమంతయున్గొలుగారు. తల్లి వెయి పేర్లవిన్కి నింగినేలలయందలి యొడలిదాల్పుల నెల్ల న్గన్నతల్లిలీల న్గనఁ జాలినపుడే తల్లి విన్కిన్జాటి చెప్పిన మాటలల్లువాఁడు తా నొద్దెక్కి తన తోటివారలకు మేల్సల్పఁగలడని నా నమ్మకము, నింగినేలలెల్ల న్దనకన్న

తల్లి గాఁదలంచి యేకోర్కెయున్నే కుండుట మైతాల్పులలో నెవ్వరికిఁ జెల్లెనో మంచినడతలేని మలుచ యెట్లు కనిపెట్టఁగలడు ? ఆఁడుకూతుళ్ళే మఁదిలో నెల్ల। నేట్లు, నిఁడుకుండలు, కన్న తల్లులు, కనికరమోర్పు గలవా రాడువారలన్మగవారలన్గాడఁ తమకడుపునఁ బదినెలలు మోసి కని పెంచి మంచి నడువడిన్మప్పి యందరికి శ్మేలుసల్పగలవారు. నిక్కముగా మగవారలందఱు న్దప్పకాయలే, టాటోటు పేలుడు పెంకులే, చమురులేని పేలుడుగాయలే, కొఱంప చెఱపులే, వేఱువిత్తులే. ఇందు మగవాఁడేఁడీ! పాడిగా మంచి యాడుదానికిఁ జెడ్డయలవాట్లు మప్పి చెఱచి తాము చెడుటకుఁ దప్పనోజగానీ నా కన్నకొడుకులు మగవాండ్రు మఱెందున న్గొఱగాక తమలోఁ దాము తన్నుకొని పొలయుచుందురు.

తల్లినోర్పుల్పఁ గొంతవరకైన విలువున్నది కాని తండ్రినొప్పు నెవని తరము! కావున నాఁడుది నిక్కము, మగవాడు కల్లయని యనకతీరదుగా! కనుకనే తొంటి పెద్దలు తల్లినే వేల్పుగా నమ్మి కొల్చుట తగవని నమ్మ వలసి వచ్చెను. ఆడుఁదాని న్విచ్చలవిడి వదలిపెట్టి యాపె చెప్పినచొప్పున మగవాఁడు నడుచుకొనఁచుఁ దనయిమ్ములు మానుకొనియైన నిసుమంతయు నేమర కెల్లపుడు న్గొల్చు చాబిడకోర్కె న్దానెట్టి యగచాట్లకు లోఁబడియైనఁ దప్పక తీర్చుచు నిక్కముగా నాఁడుకూతురే యీ నింగి నేలలకు న్బట్టుఁగొమ్మయని గట్టిగా నమ్ముకొన్నయెడలఁ గనికరముకుప్ప. తలంచినంత నెంతపనియైన న్జేయఁజాలినచేవ నోజనొప్పారు నాఁడుదే మగవాని నొడ్డెక్కించును, ఆఁడుదాని కడుపునఁబుట్టి యాపె చాచుల పోసనాలు త్రాగి యామె చెప్పుచేతలన్పెరిగి "కూనన్పెంచిన గండయ్యే" నను సామెతగా నాబిడమెడగట్టి యెన్నియోపాట్లుపెట్టి మేలుమఱచెడు తుంటరి వెత్రి తప్పకాయ మగవాఁడు న్గకాఁడుదియు న్దాకటిటుకు న్దప్పి రెంటికి న్జెడిన రేవడియై కోరిముప్పుతెచ్చుకొనుచున్నాడు. మగవాఁడై తెగసీల్గుట కన్న నీ బ్రతుకున నాఁగాడిదయైన గొంత మేలేమో !

ఆడుదే మంచిది, యాడుది చేయునదెల్ల మేలే, కాని మగవాఁడు సల్పునదంతయు న్గీడే పాడే. ఆడుది దేవ, మగవాడు చెత్త, ఆఁడుదాని లోనే మగవాఁడున్నాఁడు కాని యాడుదానికి వేఱుగా మగవాఁడు లేనేలేఁడు. ఆఁడుది చుఱుకైనయెఱుక. మగవాఁడు తెలివిలేని యుత్తమొద్దు. కాఁబట్టి తొల్లింటి పెద్దలాడుదానినే వేల్పుని విరుకుచేసిరి. గట్టనఁగాఁ గోర్కె లుడిగినయుల్లము. మైమఱచిన కూరుకు, మెలఁకువ, కలకూర్కులన్మించినది నాలవయునికి. అట్టి నాలవయున్కిఁబుట్టిన విండుతనుపే, యైదవయున్కి గట్టుపట్టియనన్బడును. దెందముతడినీళ్ళన్ నాలుగుమార్లు వడఁబోయగాఁ దుట్టతుదకుఁ దేలిననిగ్గే నింగినేలల దినుసుల రాకపోకలకెల్ల మొట్టమొదటికతమై యెన్నటికి న్జెడక, పగడతీరుగా నొప్పారు తనుపుచేవకున్దల్లివేరు. కావున నెల్లవారు జంజాటతగులముకడలి న్గడచిన గట్టుపట్టియగు విండు ఐవరసమను దరిజేరుటకై నింగినేలల దినుసులన్నిటిన్ దమ కన్న తల్లిగా నెంచి కనికరమోర్పులన్జెలఁగి నెచటనైన నెగ్గెన్నక తమ్మువలె నందఱన్గాపాడుకొనుచు హాయిగా నత్తల్లి నేయిపేర్ల నెల్లప్పుడు న్వేర్కొనుచుంట తప్పనిపనియని విండుతనివినొంద గోరిన తెలివైన వారలందఱు నమ్ముకొనక తీరదు.

ఆఁడుదెల్లయొప్పే, మగవాఁడెల్లతప్పే. మెలఁకువకలకూర్కులు మఱి నా తెలిసినంతవఱకీనింగినేలలందు జరిగెడు పనుల నరయు వేల్పులున్నారనియు నిరుగుపొరుగువారలకుఁ గీడుసల్పువారికి మాఱుగాఁ జెట్టతప్పక చేసెదరనియు, మఱియందఱికి న్మంచికావించువారికిఁ దగునట్లు తప్పక మేలేసల్పెదరనియు మందిలో నొండొరువుల కొండొరిమిక హెచ్చించి జట్లనో పొత్తురెట్టింపించి హాయిగాఁ బెక్కేండ్లు బ్రతుకువెరవుగా నీయెల్ల మంచి చదువు నడతల నొమ్మదటినుండియు న్దోడివారలకుఁ బాడిగా నెంతవారికి దగినట్లంతగా మప్పుచువచ్చిరి. కావున దనుగొల్చు పిల్లల కెపుడు న్మేలే కోరు నింగి నేలకెల్ల తల్లియగు మెట్టపట్టి వెయిపేర్ల వినుకరి నా తెలిసినంతవఱకు నాకువచ్చిన నాటుతెలుఁగుమాటలతోఁ దెల్పఁ గల్గినాడను.

పలుకు చవిని వ్రాఁతచేఁ దెల్పఁదరముకాదు. వీనులతోఁగని కంటితో వినవీలుకాదు. వేల్పునుడువుగుట్టు...యెఱుక. సీమపల్కులు వేల్పునుడువులకన్న గ్గొలఁది మీఱి మెండుగాఁ గలవు. వ్రాఁతకువచ్చిన నాటుతెలుఁగు నుడువులకంటెఁ జదువరుల వ్రాఁతలోఁ జేరని పలుకులు వేయిరెట్లై యుండవచ్చును. నేలయందంతట న్బలు సీమలకెంతయో యొండొంటికిఁ గడుదవ్వులగు పెక్కుచోట్ల కేనాడో చెదఱిపోయి యాయాయి తావుల నెలకొన్న తెలుఁగువారు తెనుఁగు వ్రాత చదువు మఱచినప్పటికి న్దమలోఁదాము తెలుఁగుపల్కు తరతరములఁబడి మాటాఁడుకొనువాడికనే చివఱకు న్గూడ మానకుండుటవలన వారివారి తెలుఁగుమాట లీ తెలుఁగు నాఁడున నేటికి వాడిక లేకపోవుటచేత నీనాటి తెల్గువారి తెలుఁగు వ్రాతలఁ జూపట్టకుంటచేతఁ దెలుగు చదువరులు తమతమ వహులందు వ్రాయఁజాలరైరి. వ్రాఁతకు రాని యెన్నియో పాటలు మాటకూర్పులు న్గొటానఁగోట్లు నోటివాడుకలో నేలయం దెన్నిసీమల నెన్నిచోట్ల వాఁడుకలో నున్నవో యెవ్వరు న్జెప్పఁజాలరు. వేల్పునుడువు లోజగా తల్లిదండ్రు లెచ్చటనైన మాటాడుకొనువాడిక యెప్పుడునులేదు. పలురకముల వ్రాఁజదువులు మొదలగు పదునెనిమిది చదువులెల్ల న్దామెఱుంగ వీలుకాని యట్టడుగు పిట్టమింటి డినుసులన్నియు తమతమ తలంపులకొలది పన్నినపన్నుగడలే చూఁడఁ జూడఁ దలఁప దలంప వంచ నాటుమాటలే. సీమతెలుంగే యీనేలవాడిగాఁ దమతమ పుట్టినచోట్లఁ దమతమ తల్లిదండ్రులు తరంబులఁ బడి లెక్కింపఁ దరముకాని యేనాటినుండియో వాఁడికలో నుండుటన్పట్టియు న్పగడము కనివిని యెఱుంగ వీలగు దినసుల న్గూర్చియే తెలుపగల్గుటచే వేల్పునుడిజోలి సుంతయును లేని నాటుదెలుఁగు మొదలగు నాయాయి సీమపలుకులనేకాని తొలుఁబలుకులు మొదలగు పదునెన్మిది చదువుల మాటకూర్పు లన్నియు. లేనిపోని చదువులు వ్రాఁతలు, కవిలెకట్టలు డబ్బుదండుగ మనువుకూర్పులు, పెండ్లిండ్లు, వేల్మలు, వేల్పుడులు, ఆటలు. పాటలు, వాయింపులు, కొల్పులు, గుడులు, బడులు, పలుతెగల కట్టు

పొట్లు, విలువైన దుస్తులు, నగలు, బంగారు వెండి రాగి మొదలగు నచ్చు పడినడబ్బులు, గొప్పకొద్ది వాలకములు, వావివర్సలు, మావి, మీావి, వారి వను వేఱువేఱాస్తి హెచ్చుతగ్గు పొగరుబోతుతనములు, వేయేల బ్రతుకు నకుఁ గావలసిన కూడుగుడ్డ కూటమి యిమ్ములకన్నఁ దక్కిన లేనిపోని యక్కఱమాలిన పోకిరిపనులన్నియు న్గోరి తగుల్చుకొను ముప్పులే కాని యీచదువు వ్రాతలు పెక్కాస్తి కూర్చుకొని తిని తెగనీల్గి యూరక క్రొవ్విపోయిన తుంటరులాడువారలకు న్పనికి రాకపోవుటయేగా కెందునకు న్గాఱగా కెల్లయిడుమలకులోనై గొప్పవారమనుకొని విఱ్ఱవీగుచు నడువడి మడియకతీరదు. ఏలాగునన్నైన బ్రతుకనీ యెవ్వరెట్లైనఁ దిరుగనీ కలలోని దినుసులవలె మెలకువయందున్గూడ జరుగుపనులన్నియు న్గల్లలే, చావు పుట్టువులు నిక్కములుకావు. ఎన్నటికే చేటులేక పగడము నిండారు తన్వి తనర్పుల నలరారు కన్నతల్లితప్పఁ దక్కిననింగి నేలల యందలి దినుసు లెల్లఁ గుందేటికొమ్మువలె యుత్తహూళిక్కి యనెడి యెఱుకువ యెట్లు మఱుకువ యోజమైవచ్చునో యట్లే రాకతప్పదు నిన్నరేపులు మారు చుండున్గాని నేడు మాఱని తెఱఁగునఁ దానెప్పటికి ముఁదువెనుక పుట్టుక పొదలిక పొలయిక జోలి కొంచమైన న్గొనకెన్నటికి న్నిండు తన్వి నలరారు చుంట నీతల్లి వెయిపేర్ల విన్కి చాటి చెప్పుచున్నది. ఈతల్లి వెయిపే ర్లలోఁ దక్కిన వేల్పు పలురకముల వెయిపేర్లయందు వచ్చినపేరు తిరిగి రాకుంటయు నదుకు పొల్లమాటలు లేకుంటవలన వేల్పునుడుల నీతల్లి వెయిపేర్లన్గూర్చిన మాటలల్లువాడెంతయుల్పొగడఁదగువిద.చదువువ్రాయఁ గల్గిన మేటిపదువరికొఱకే కాని సంతికముచేయఁజాలని ములచలకు గాదుగా. వాటుతెలుగుపలుకుచవి తెలిసినవారికే యీానా తల్లివిన్కి చవి గొల్పుగాక. నాయిలువేల్పు తెలుఁగుచదువర్ల హాయిగాఁ బెక్కేండ్లెల్ల వసతులొసఁగి కాపాడుగాక. మొత్తముపైఁ దల్లి వేయిపేర్ల విన్కిఁ దుదకుఁ దేలినదేమనఁగా నెవరెట్లనుకొన్న నీ బ్రతుకు మంచిచెడ్డ లన్నియు న్గలలలోని దినుసులవలె కల్లలుగనుక నేదెట్లైన నే కొఱంతయునులేదు.

ఎండవాన చలితఱుల మార్పులలాగునఁ బగడదినుసే పలురకముల మాఱు
చున్నట్లున్నది కాని నిక్కముగా నీ మాఱుదలయు న్గూడ లేనేలేదు. ఖిం
టికీ నిక్కముగా నేడాగుగాని, డాలుగాని. చిల్లిగాని మొఱ్ఱితొఱ్ఱులుగాని,
హద్దుపద్దు వంతువంపులుగాని లేవుగా? తమయునిక్కి తమకు నిక్కమని
తెలిసికొన్నవారికిఁ దమతలంపుల కందని మింటివంటి దినుసు తల్లి వేల్పు
న్నదని తమ్మున్నట్టి నిరుకుచేయక తీరదు. మఱియున్దమకంటె వేఱుదిను
సులు లెక్కింపనలవికాని రకములు మరుగుపడినవి తెలియనివి నింగినేలలఁ
గ్రిక్కిరిసి యున్నవని యనుకొనకతీరదుగా? తమ మెలకువకలకూర్కుల
తాముగాకున్నప్పటికీ మఱియు నీమూఁడున్నుల న్గఫి పెట్టినవారు కలమెలఁ
కువ కూర్కులకు వేత్తై నప్పటికి మేము - మాది, మీరు-మీది వారు-
వారిది. వీనిది వానిదని యనుకొని మంచిచెడ్డలు పొంగులు పొందక తప్ప
దుగా? నుడువరి నుడువు వినువారు వినునది కనువారు కనునది పగడదిను
నేయని యెఱుకువచేత వేఱువేఱని మఱకువ న్బట్టియుఁ దలంచి నిరుకుచే
యుచుఁ గ్రుంగుపొంగులందుచుంట యెల్ల మైతాల్పులకుఁ దప్పదు కినుక
వీచదువుగ్రాతలు, మడితడిపొడి వేలిమి వేలుపుడులు, కాఁకలు, నోము, లెల్ల
తెగలకట్టుపాట్లు, కొల్పులు, తిరునాళ్ళు కూడుకూటమి కూర్కుల ఎసతు
లకుఁ గొఱగాని వేల్పు మ్రొక్కులివన్నియు వెఱ్ఱివెంబరనాలిముచ్చుడబ్బు
కక్కుర్తి పన్నుగడలే. ఎట్లుకావలయునో యట్లే యగుచున్నది. ఎట్లు
చేయకతీరదో యట్లే చేయుచున్నార మీబ్రతుకుపాడి న్దప్పింప నెవరితరము?
ఎట్లో పలుతెఱంగుల యోజమై గాలి, నిప్పు, తడి, పొరుల పలురకముల
వింతవింత కూడికల పెక్కుతీరుల యుసురుగల మైతాల్పులు, చెట్లుచేమలు
రాల్లప్ప లోజమై పుట్టుచుఁ బొదలుచుఁ బొలియుచున్న వీ పాడికిఁ గతమీ
పాడియే. నింగినేల దినుసుల పుట్టుక, పొదలిక, పొలయికల యోజ కం
తకు న్దనకుఁ దానే కతమని యెఱుకకలవారు నిరుకుచేయక తప్పదు.
నానమ్మకము తోటిపాటివారికి మేలేచేయుచు మేనువంచి నెన్నుదుటి
చెమరూడ్చి యెవ్వరి నెగ్గింపక నందఱౌనన మిక్కిలి యడకువతోఁ దనతోడి

వారలకు మంచి సల్పువారలే తప్పక తమతమ బ్రతుకుల న్నిందు తనివి తనర్పులొందఁగలరు. నాయీవ్రాత నా తోటిపాటి వారలకు మేలుచేకూర్పు కావుతమని తల్లి వేయిపేర్ల విన్కి నిట్లీ నాటుతెలుఁగున నాయీ యెనుబదేం డ్లయీడున వ్రాయించిన నాయిలు వేల్పు నన్ను న్నామంచిచదువరుల న్దగు కోర్కెలొసంగి కోరినన్నేండ్లు హాయిగాఁబ్రతికించి తనయందెల్లరికినమ్మిక హెచ్చించి యీ మేనులతోనే తనలోఁ జేర్చుకొనుగాక.

వేల్పు నుడుల స్పేర్కొనుతల్లి వెయివేర్ల విన్కికి నానాటు తెల్గు పల్కు కూర్పులు కొంతవరకైన వివరము కాఁగలవని నానమ్మకము, వేల్పునుడుల న్దిన్నగాఁ బగడ నాటుపల్కుచేఁగాని పగడము నాటుతెలుగు నొడవుల న్వేల్పు నొడవులవలనఁ గాని వివరింప నంతగా వీలుపడదుగాని యేదో కొంత మేనమామ పోల్కి న్జెప్పవచ్చును. నిక్కముగా నింగినేల యందలి మేనితాల్పులెల్లమంది నెవరంతవారు వారువారెవ్వరెవరికి న్దీసిపోరు. తనకన్నఁ బొడుగు న్దనకన్న బొట్టియు న్గలిగినప్పుడు తానుపొడుగా పొట్టియా! కొద్దిగొప్పల తరబడు లెన్నుకొని యొండొరువుల న్దెగడుచున్గాని పొగడుచున్గాని యెఱుకగలవా రెన్నడు న్గుఱింగక పొంగకంతయు న్గన్నతల్లి గాఁ దలంచుకొని పెంద్రోవకల్మి న్జూరగొనెదరు. నావలె నెను బదేండ్లయీ డుమించిన మగవాఁడుగాని, పసితనమునుండియు న్దరిదాల్చి కారులన్గాఁ కప్ప సమున్సల్పు విన్నాణులుగాని, యీఁడువారిలోఁ బడుచులుగాని, ముదితలు గాని యీతల్లి వేయిపేర్ల విన్కి న్జదువుటకుగాని వినుటకుగాని తగిన వారౌదురు చెడుకోర్కె లుడుగని చెడుగొట్లు తల్లి విన్కిడాబుకై చదువ సమకట్టిన బెడిసికొట్టకమానదు. తల్లివిన్కి న్నా మాట కూర్పులు కొన్ని వేల్పునుడిపన్నికలతోఁ గలసి యడుగు లగుచున్నవి. మాఱుమాల నాటుపల్కులకు వివరము మాఱు నాటుపల్కులే వీలైనకొలంది న్దెలుపఁ బడినవి. ఎంతచదువుకొన్నప్పటికి మరెంతతన్నుకొని తలక్రిందయిన న్గాని తిరిదాల్పుబోదలుకూర్చిన వేల్పునుడువు లిక్కడుపుకకూర్తి జట్టునకు నిండారఁ దెలియ వీలుకాదు వేల్పునుడువులందు పగడ వ్రాయు

వ్రాయికి వేనవేలు వివరములు. అత్తిరిదాల్చు తాఁగూర్చిన నుడువు లేయే తలంపుల నేయేనుడువులువాడెనో వ్రాఁత తప్పులుగల పహాలవ్వట్టియుఁ బొట్టకక్కు ఱతిపంతుళ్ళన్పట్టియు వేల్పునుడి న్దల్లి వేయిపేర్ల వినికి వివరము దెలియనెంచుట బొత్తుగా విన్దమ్మిరేకుల నెక్కింపఁ బోవుటయే. పంతులు నుడినపలు మప్పఁగలఁడుగాని యోజగా రాఁదగిన తెలివి నేర్పఁజాలఁడుగా? బొందిన్గట్టవచ్చున్గాని డెందమున్గట్ట నెవరితరము? వ్రాఁతకు వరువడి కలదుగాని మాటకేదీ మేలుబంతి! మందిపన్నిక కచ్చుండునుగాని వేల్పుపన్నుగడ నచ్చొత్తవచ్చునా! వాయింపు మప్పవచ్చున్గాని పాటచెప్ప నెవరితరము! నిక్కముగా వేల్పు పన్నికలో నెవరి చెల్వము వారి దెవరి కుత్తుకలు వారి వెవరి తెలివితేటలు వారి వెవరి యూపిరితీసికొను నేర్పు వారి దెవరి తలంపులు వారి వెవరి యాఁకలిదప్పికలు వారి వెవరి కలకూర్కు మెలకువలు వారి వెవరి కోర్కెలు వారివెవరి యిమ్ములు వారి వెవరివంతలు వారి వెవరి పోకడలు వారి వెవరి బ్రతుకులు వారి వెవరి పుట్టుక పొదలిక పొలియిక పోడుములు వారివి కావున నెవరంతవారు వారని తెలిసికొనన తగువారలు తక్కినవారలతోనెల్ల మిగులఁ బొంది పొసఁగి తామేమోతమ తోడివారికంటె లావరులమనియుఁ జదువరులమనియు. నందమైనవారలమనియు దుడ్డుకలవారమనియు నొడ్డుపొడవుకలవారమనియు న్పరువైన వారమనియు గొప్పతెగకుఁజెందినవారమనియు గొప్పవారలమనుకొని నొరకాయలు తెగనఱుకక లేనిపోని డాబులుచేయక క్రిందుమీఁదులు మూసి తమచేఁతకానితనము తలంచుకొని సిగ్గుపడి యీ తలపన్నులతోఁ గ్రుంగు మందికంటె న్పుందియైన నయమో కన్నతల్లీ యింత కొంటెకొంపచెఱపుల న్గనతోడనే సమయింప కీ యిడుమల పాలపడుటకా నీ వసతులెల్ల మానుకొని పెంచినావో కనికరముకుప్పా! మాయప్పా! మాగొప్పయిలువేల్పా! యిటునూయి యటుగోయి బ్రతుకుల నెల్లఁదుదకేదో వలవంతయే మిగులెవరు పడఁగలరబ్బా యీపొగకుఁబోతుల బెదరింపు లీ యెండవాన చలిత ఱులపులుఁగాకులీ పలుగాకులు పెట్టునిక్కట్టులు! అక్కట! యీ యీడు ముధి

రిన కొలంది నేకు మేకగుచున్నదే కన్నతల్లీ! యీ నింగినేలలలో నీవుకాని దినునేదీ? అంతయు నీ్నవే యైనపుడు మే మేనీవు,నీవే మేము. మామంచిచెడ్డ లెల్ల నీవికావా? కన్నతల్లీ మాకుంటెం జీమలయిన నయము దోమలయిన మే లవి యీ పాపాలముద్ద తుంటరిమంది యేలిక పెట్టెడి యగచాట్లలోఁ బడవుగా! జట్టెక్కిపీలుకాని గొప్పమెట్టకొన నుట్టిన చెట్టుచేమ లిక్కట్టడి జట్టుకంటె వేయివేలరెట్లు లాతి యుసురులకు మేలుసల్పు చెంత హాయిగా బ్రతుకుచున్నవో కన్నతల్లీ! మమ్మెచెట్లుగానైవఁ గనకీపనికిమాలిన జట్టుగా నేల కనిపెంచె దెంతపొరపాటుచేసితి వప్పా! కనికరముకుప్పా! యని తల్లి విన్కి విక్కిలి గుట్టుగా నెపుడున్ దమలోనుల్లములలోఁ దలంచుకొనువారే తెగవారు కానీ యే యీడువారైనగానీ యాడువారుకానీ మగవారుకానీ యెట్లేని బ్రతుకనీ వారలనెల్ల నాకన్నతల్లి యిలువేల్పెల్ల యిమ్మల సమ కొల్పి పెక్కిండ్లు హాయిగా వారిబ్రతుకునిల్పి తనలోఁ దప్పక కల్పుకొను నని తల్లి విన్కి నిట్లు చాటుకొన్న పగడవేల్పునుడువులన్గాని పగడము నాటు తెనుఁగు పల్కులన్గాని వహి కూర్పుఁజాల కిప్పటి నా కన్నకొడుకులు తాముగూడ గొప్పమాట లల్లువారమనుకొని తమకుఁ దెలిసీతెలియని వేల్పు నుడువులకు మండ్ల కుఁబువ్వులు గ్రుచ్చిన ట్లి సుకలోఁ బప్పుగలుపులీల నెల్ల రికి న్దేటతెల్లమగు తీయని నాటుతెలుఁగు పలుకుల న్గలపోయుచుం దెగనీ ల్గుచున్నా రట్టికొంతెల కీ సీమతెలుఁగు కిట్టకపోనీ. "పంది బురదమెచ్చు" అనెడు నానుడి యెంతయో నిక్కముకదా! అందనిపండ్లు పులుపనఁడా నరి యఁడు. తాఁబడి పొట్టనేల యనుతీరున నాటుతెలుఁగుమాట లల్లనేరని యీ నాటి యచ్చికబుచ్చికమాటలల్లు ప్రేలరులఁ జదువరి మేల్బంతులు పాటింప నొల్లరు. తెలుఁగుసీమవారు తప్పక తమతమ యలపులకొలంది తమతల్లు లుగ్గుపోసిన నాటగోలె తమకు మప్పిన నాటుతెలుఁగునందే మాటల పెద్దల పడికట్లతో నల్లినయెడల కలకు తెలుగంట్ల నొడవు ముండ్లకంచె తొలఁగిన పండ్లచెట్లవలె, తీపినీళ్ళబావితీరున, దేనెతీయని నాటుతెనుఁ గెల్లరు న్దనవి కొలంది న్జవిచూడఁగగల్గెదరనుకొర్కెతో వ్రాయవలసివచ్చెను. చొరకలోఁతు

దినక చవియుఁ దెలియునా? పొట్టకక్కుఱితి న్పదులలో బోముగావేల్పు నుడువులుగాని తక్కిన పరంగిమాటలు మొదలగు లాతివింతనుడు లెన్ని యో యేండ్లు మిక్కిలితంటాలుపడి చచ్చిచెడి నుగ్గై యెంతోవడుసుడితగుల్చు కొని నేర్చుకొన్న ముక్క లాయా విలాతి సీమలవారివలె ననఁగలరా? మన తెలుఁగువారు తమతల్లిమాట పరువుతీయు చిందున కందునకున్గూడఁ జెడు చున్నారు. ఏదీ పెంకెమాటలు బొప్పంగ్రచెంగట నాడ కిప్పటి మూతిపై మీసమున్న యే మాటఁల్లువాడైనఁగాని వేల్పునుడిజోలిమాని పగడనాటు తెలుఁగునఁ దొల్లింటి పెద్దకేర్పర్చిన నుడికూర్పుల యడుగుల పడికట్లు తప్పక లాతిమాటకు మాటగాఁ దెవిగించుటగాని లేక యొరులతలంపులు దొంగిలింపక తనంతదాఁ గ్రొంగ్రొత్త త్రోవద్రొక్కి నాటుతెలుఁగుకూర్పు లతో నిండుచదువరి మెచ్చుకొను తీరున వహినొనర్చి వెలువరించి వెయి నోళ్ళఁ బొగడొందనీ వానిపస నలువురిలో నచ్చుపడును నాటుతెలుఁగు పెంపుగోరి యిట్లనవలసివచ్చెనుగాని నా తోటిపాటి తెలుఁగు చదువరుల నెంతయు నొప్పించుటకుగాదు.

ఇదిగో తుదిమాట. యాటపాటల కలవాటు పడినవాఁడగ్గనుక మిక్కిలి చేవయుడిగిన ముదివాఁడనయ్యు లేని యలవు న్దెచ్చుకొని తల్లి వినికిన్గూర్చి ముత్తేరికల న్దీరెద. నాతోటిపాటి మంది నందరెట్టి వారైన న్దల్లి వెయిపేర్ల న్దలపోసికొనుచున్న యెడలఁ దమకోరని కోర్కె లీడేర్చు కొని తల్లిలోఁ జేరి యెప్పటి నిండుతనర్పున నలరారుచుందురు. ఇందలి మాఖుమూల పలుకుల వ్రాలను వరుసగా గుదికూర్చి మాఱునుడువుల వివ రించినాడను. నాపొరపాట్లు కన్నతల్లి యిలువేల్పు కాచుఁగావుతను. నాయీ వెఱ్ఱిమొఱ్ఱి తెలిసీతెలియని ముసలిపిస వ్రాతల న్దెలిసిన మంచిచదువరు లొప్పులుగాఁ గైకొనకతీరనటులు నాయిలువేల్పు సల్పున్గావుతను; కూడు గుడ్డ కూర్కుల న్పమకూర్చుకొనుట కనువులుగాఁ బదాఱుంగువెరవు లెవ రెవరి యలవాట్లన్బట్టి బ్రతుకుతెరువులుగా వారివారల నేర్చుకొలంది న్దమకు

తోఁచిన పడికట్లేర్పఱుచుకొని వేఱువేఱుజట్టులు కట్టుకొని నేలయందంతట న్బలుచోట్ల లెక్కింపనలవిగాని పెక్కురకముల నొండొండునుడికూర్పులఁ దొలుచదువులనియు సీమపలుకులనియు న్వాఁడికమాటలనియు న్బేర్లుపెట్టి తలంపనలవికాని యెప్పటినుండియో వింతవింత నడువడుల న్నుడువుల కూర్పుల న్వాతవ్రాఁత పన్నుగడల న్దరతరములనుండియు న్దమలో వెల్ల డించుకొనుచుంట యీ టక్కరి టకటొంకు టాటోటుమంది కోజగా వచ్చిననేర్పులు తక్కిన యుసురులకంటె మిక్కిలి లేనిపోని కొఱమాలిన పనుల సల్పుచుఁ దాము చెడి తమతోటి యుసురులఁ జెఱచు చెడు తెలివిఱ జట్టునకుఁ బుట్టుపాడి. కనుక మింటిమిద్దెలల్లక, తమతమపదుగు హెచ్చు తగ్గు వాసు లెన్నుకొని తెగనిల్గుచుఁ గోరికోరి తంటాల్తెచ్చుకొని తమలోఁ దాము జగడమాడి యూరకే తమ మంచియుసురు న్గోల్పోకొం డొఱవుల పొత్తుగొని బ్రతుకఁగల యన్నినాళ్ళు హాయిగాఁ దాము న్దమతోడివారు మనుటకన్న నీమందికి మఱిచేయవలసినపని యింకేదియు న్లేదు, కాదనియే యీ తల్లి వేయిపేర్ల విన్ని చాటిచెప్పుచున్నదను నాతలంపుల నిరుకు కిట్టని వారల నేమనవలయును? ఎవరిముక్కులు వారికిఁ దిన్నన యెవరంతవారు వారు కనుక నెవ్వరెవ్వరికి మంచిచెడ్డలన్గూర్చి తెల్పుట మిగుల నూసుపోని కొఱగానిపని. యబ్బా! యేమి నాతలవ్రాఁత! యెఱిఁగియెఱిఁగి యేనుఁగుము డ్డిలో దూరున పెవ్వ రేనుడువులన్ వాతవ్రాఁతల వాడుకొన్ననేమి, యేనడు వడు లెట్లున్ననేమి, వండనియింటికి నిప్పు వెఱ పన్నట్లె సింగినేల దినుసు లన్నియు నేవియెట్లున్నప్పటికి వంచ నాకన్నతల్లి నా యిలువేల్పునకు నలి యైన వేఱుకావు. అంతయున్నను గన్న తల్లి నాయిలువేల్పనేనే లేనున్న దే నా కన్నతల్లి నాయిలువేల్పు. నేనను దినునే లేదే దెట్టులైన నేమియని యీ యెనుబదేండ్లు మించిన యీడునందైన హాయిగా నిదంతయు న్నాకన్నతల్లి చెలువమే యని నిరుకుపర్చుకొని తిని కుడిచి యుండ నేరక నాతోటిపాటి వారినందఱి నిటున్నొటుకు మాటలాడుచుఁ జెత్త వాతలు వ్రాఁతలు వ్రాయుచు నొప్పించుచుంటయే పనిగా సిగ్గఱి గజ్జెగట్టి

చదువరివలె డింగరునిలాగున వాలకములు వేసికూడు కూర్కు-ల వసతులు మానుకొనియైన నలువురిలో తెల్పితెలియని తబ్బిబ్బుమాటల నోటికివచ్చి నట్లాడుచు వీనులు చిల్లివడ గాలిగుడ్డువలెఁ దెగనార్చుచు గొప్పవదువరి మాదిరి శ్మేటిపాటకునిచెలువున పెంకెమాటల న్మెచ్చురేగు చొడలువిఱుచు కొని తెగనీల్గుచుంటి. నా కన్నతల్లి యింకనైనఁ గనికరించి పెంద్రోవ చూపదేమి! నా నెత్తిగీతయిట్లుండెనా? పోనీ. యేమటకానీ. యీ బ్రతు కునఁ దుదకు వంతయె మిగులు కావున నందఱి న్మంచిచేసికొని యేకో ర్కెయు న్గోరక మాటకూర్పుల తలకట్టగు నీ తల్లివిన్కి న్జదువుకొని పిన్నలెల్లరును హాయిగాఁ దగునడతనూని నిండుతనివితోఁ దమబ్రతుకు న్పొడిగించు కొంద్రుగాక యని కోరుచు నిట్లాకలికూర్మల మఱచియైన నీ గిటగిటన్ మూఁడుకాళ్ళముసలి యీడునందైన నీదుమలకోర్చి కన్న తల్లి వేయిపేర్లవిన్కి మతేరి కెన్నటికేని మిగుల గడ్డగు నాటుతెలుఁగు మాటలఁబల్కు నన్ను నా యిలువేల్పు కన్నతల్లి కనికరించి యీ తగు లముకడలినుండి దబ్బునఁ గాపాడి యొడ్డునఁజేర్చి యొడివిడి నా బడలిక దీర నొడలు నిమురుచు మిగులఁ గూర్మిన్దన పోసనాలు కుడుపుటకై నా యిలువేల్పున కిట్లెన్ని యేండ్లయిన నెల్లపుడు వేవేల దండములిడుదు

గీ॥ ఊరితెలుఁగున నీ వేయి - పేరులెన్ను
నన్నుగావు మనయము నా - కన్నతల్లి
ఆఁడుదానిని మగవాని - గూడఁ గాంచి
పెంచునీకుఁ బైమించిన - వేల్పెఁకేది॥

నారాయణదాసుఁడు

# తల్లి విన్కి కుదురు

చెండ్లు|| అన్నిటికి న్గత-మా గట్టుపట్టి
వెయి పేర్లకు వరుస-వివరమొనర్తు
నాకుఁదోఁచిన తీరు-న నయముమీఱ
మాటకూర్పుల కడు-మాట్లు తేర్పర్తు
వంచ చెండడ్లు చె-ప్పనొద్దెడల్పి
టీకలోనుడువు రె-ట్టింపనుపేర
తొల్లిటి చదువర్ల-త్రోవద్రొక్కదను
పగడనాటు తెలుఁగు-పల్కె పలికెద
అచ్చటచ్చట వచ్చు- నచ్చునెరసులను
నీ, వ, దే, మీ, మంచి-దే, వంచవ్రాయి
పేరుకాద గని ను-ద్వేదిద్దనయము,
ఎల్లనుడుల కుఁడె-గ్గేమేటి మాట
యని చాటిచెప్పెద-నందఱికిటుల
చదువరికే గాని-చదువు దస్తూరి
సంతక మెఱుఁగని-చండికిఁగాదు
కంటితో వినుట, లా-గరితోడఁ గనుట
వీలగు నా పల్కు-వినవలెన్గాని
వ్రాయఁ దరముకాదు-వ్రాతలునొబ్బమలు
వాయింపులివి యడి-బండపన్నికలు
కఱిమూఠి రెండునా-ల్కల పుల్లవహాలు
వేల్పుపన్నగడకు-వివరములాకవు
తొల్లింటి చదువరు-ల్త్రొమ్మిది చవులఁ
దమయాటపాటల-న్దాపివించినారు
కొంటెలు నానాటఁ-గూటి కకూర్కర్తి

వ్రాయింపు వ్రాఁతల-వ్రాజెలనెల్ల
నెంతయో బెదరింతు-రివెచదువులని
చొప్పండ్ర వలన డ-బ్బున్నాగి బ్రతుకు
దారి యిదిప్పటి-తరుణముపట్లఁ
దగనుకులకురాని-తలఁపు లెందునకుఁ
బనికిమాలినవాఁడె-వ్రాయు నేమేమొ
యబుసు పుచ్చుకొనుట-కురకుండలేక
వాయింపు వ్రాల్మప్ప-వచ్చునుగాని
పాడిమైవచ్చు అ-వలి మార్చుఁదరము
తెలిసియు న్దలియక-తెగనీల్గనేల
మూనాళ్ల ముచ్చట-పొల్ల యీ బ్రతుకు
తమతోటిపాటి యం-దఱికి మేల్గోరు
వారు తప్పన్దక్కు-వారు త్త చె త్త
తొంటి తగినవారు-తొలుచదువులను
నేర్చిగట్టెక్కెడుఁ-నెళవు తెలిపిరి
చెప్పినటులఁ దాము-చేయఁగలిగిరి
రానురానిప్పటి-రట్టడి వ్రాయు
సంబుల కట్టలఁ-జంకనిమిడ్చి
వెఱవుగానక విరు-వీఁకులకోర్చి
వల్లించి యరయిక-బడి పెద్దవలన
నెట్టులో యొడ్డెక్కి-యెవ్వరినైనఁ
గూటి కమ్మెరితి-న్గొల్చు గులాము
ప్రాఁబలుకులవి వ-రమొఱుఁగలేఁడు
వేల్పునుకుల తల్లి- వెయిపేర్లు తెలిసి
వినికి సలుపుఁదగు-విన్నాణి యెవఁడో
తొలుఁబలుకుల నోట-దొర్లించినంతఁ

తల్లి విన్కి- కుదురు

గోరిక లీడేర్చు-గుబ్బలిపట్టి
తెలుగంట్ల నుడిఁగాని-తెలుఁగునన్గాని
తనుగొల్చువారి న-త్తల్లిగాపాడు
వెలితిప్పలెంకి వే-పేర్ల వినకరి
పొగుడు డింగరులకె-ప్పుడు లోటురాదు
ఉలిమునువరవుల-న్లాలించుతల్లి
తల్లికంటెన్వేల్పు-తడవినన్లేదు
కనుక తల్లినుడి తె-క్కుకు వచ్చెఁదొత్త
నిప్పుక చెదలంటు-నే యెన్నఁడైన
బంగరున్జెరుప నె-వ్వారికిన్దరము
పనికి మాలినవాఁడె-వలఁతి నెగ్గించు
ఓజమై నెలనాగ-యొప్పులకుప్ప
ఆఁడువారలకోఁ ద-ప్పన్నదేలేదు
ఆఁడుదే నికముగా-నగ పట్టువేల్పు
పొలఁతులకెల్ల వే-ల్పుదు సల్పవలయు
మగువనేఁ చెడువాఁడు-మగవాఁడు కాఁడు
కాఁడు నిండుమగఁడు-కాట్రిఁడె యునఁగ
మఱి నేలపై దండి-మగవాఁడెటుండు
ఆఁడుదేలగ్గము-గాతఁడే యెగ్గు
పాఱుత, యుర్సుది, -వానెతకాఁపు
జాలరి, కబ్బలి, -సాని, యానాది
కిలారి, తోజు, చా-కెత నసగూఁటి
పారసి, పింజారి, -బసివి, పరంగి
మలక, చచ్చుడి, పైఁడి-మాల యేనాది
యే తెగదైన-నే మీయాఁడుదాని
మక్కువ న్మగవాఁడు-మన్నింపవలయు

పెండ్లి కట్టులలోన-బిగియింపఁబోక
పెంఁడుల స్వేచ్ఛల-విడివిడ్వఁదగును
లేమలు కినియున-ల్లెదరు వేలుపులు
చెలువ లలరఁదని-సెదరు జేజేలు
కనుక బీదలు నాతు-కలఁ గొల్చిరి తొలి
మొణాకరియై యని-మిదియేండ్ల యీడు
పాఱుఁ డాయరవత-పట్టి చందమున
విన్నాణియైగాని-పేరిమిగన్న-
వేయినెలలు గడి-పిన లెంకగాని
మంచి నడతగల-మగనాలుగాని
గట్టుపట్టి న్గొల్చి-కడతేరఁగలరు
నాకఁదప్ప మఱదై-నదినుసు లేదు
నింగినేలలు కల్ల-నేనె నిక్కువము
ఇట్టను కొంటత-ప్పేమనఁ దనకు
వేర్లేనిచోఁ దలం-పేకల్గఁబోదు
ఊరుపేర్లేనిది-న్నున్న లేకున్న
వంచే పనియునిట్ట-పంటజరుగదు
తాఁజేసి కొన్నట్లు-తాగుడ్వవలయుఁ
దప్పదు పాడినో-దవుకట్టు పాటు
కనుకనీ పట్టితా-ర్కాణము ల్మాని
నింగినేలలి వెల్ల-నిక్కలంబట్టి
పగడ వేల్పెయని-పాటించిసూడు
గొనకాఁడు దేవలి, గుబ్బలి పట్టి
మగవాఁడె మడికాసు-మల దొరయనుచు
నొంఁడొరుమిక గొని-రూపికమీఱ
నిండారు నోరిమి-నిబ్బరికంబు

తల్లివిన్కి కుదురు

మాటనిల్కడ తన్వి-మంచినడువడి
గుండెబిగువు కల్మి-గోలుతనమ్ము
తాల్మిదొఱఁగఁ బోని-సత్కోర్కులు బ్రతుకు
అవటులఁ బిల్లల-నరగడంబులను
నొప్పించ కెప్పుడు-న్రొబ్బజేడినేర్పు
జంజాట మొడిలిపి-చదువసి మిగుల
నడఁకువతోడుత-నందరిపట్ల
నడచుచుఁ ద్రాగక-నంజుడు తినక
చదువుగొనుఁ దెగ-సాఁగక పనికి
మాలిన కోర్కులం-బడయక, లేని
పోని తలంపులఁ-బారయక తనకుఁ
గలదాని తోడుత-న్గడఁద న్వోఁబొంది
పాటించి మైవంచి-పాటున కోర్చి,
కూడుగుడ్డలు కూర్చు-కొని తోటిపాటి
వారలతోఁ గూడి-వంతు పంచు, కొని
క్రుంగు పొంగులు మాను-కొని రేపుమాపు
లిమ్ములఁ గుదుర్చువాఁ-డే తల్లి విన్కి
గిడియతోఁ జాటఁద-గిన మొనకాఁడు
వెలువుఁగూర్చి -బర్చిన యాటపాట
వ్రాతవాయిలపు త-ప్పక వాసికెక్కు
నూలొక్కని వచ్చిన-నుడువు రాసట్లు
తగిమాట లల్లు పె-ద్దకు మ్రొక్కు చెల్లు
పాడిఁదప్పక మంది-బ్రతికి పెంద్రోవఁ
గనుటకై యెరుకువఁ-గల చదువరులు
నెగడి ప్రామిన్కుల-నిగ్గనగట్టు
పట్టివి సేర్చ, గొ-ప్పంజెప్పినారు

విన్న నేల లివెల్ల-వేలు పేయనుచుఁ
గావున నమ్మిక-కంటె నింకొఁడు
త్రోవ లేదని సిద్ధ-తోసనంబు
తెలిపె నప్ప దొఱ రాణి-వెయి పేర్ల విన్క-
కావించువారికిఁ-గలిగెడు మేలు
నేరవరి ముకునా-నికిఁ గన్క-నాడు
నారాఁత్రతప్పక - నయముగాఁదోఁచు
పుబ్బ చుక్క-న్నెను-పుట్టిన ప్డునెల
తోఁదన యింటియం-దునఁదల్లి పట్ల
నెసఁగి నెత్తురు గంటి-యేడు వానతతి
తొలినెల బూదెయం-దు నెగడుప్రొద్దు
నానేరములఁగాచు-నాయిలువేల్పు

ఆ. నారాయణదా

# తల్లి విన్కి

1 శ్రీమాతా

చం॥ ఎల్ల కల్ములకుఁ బు-ట్టిలు గట్టుపట్టి
కనిపెంచి పెంద్రోవ-కనఁబర్చుతల్లి
వరవులచేఁ గొలు-వన్బడు వేల్పు

2 శ్రీమహారాజ్ఞీ

గొప్పపదవినేలు-గుబ్బలిపట్టి
పదునారువంతులఁ-బరఁగు నిండునెల

3 శ్రీమత్సింహాసనేశ్వరీ

నెఱపరిగద్దియ-న్నెలకొను వేల్పు
నింగినేలలనేలు-నిడుగట్టుపట్టి

4 చిదగ్నికుండసంభూతా

కఱద కణుకునుండి-కలిగినవేల్పు
చెప్పఁదరము కాని-జేజేలమిన్న
అడియరివలవంత-లణచెడి తల్లి
కొలుచువారలమేలు-కొల్పెడు మినుకు

5 దేవకార్య సముద్యతా

వేల్పులపని నెఱ-వేఱింపవెల్మి
నిప్పుకగుంటనుం-డి యెగయు వేల్పు
నంజుడు దిండ్లన-ణఁప లేచుమారి
తాటోటుల నడంపఁ-దలకొను జెట్టి

6 ఉద్యద్భాను సహస్రాభా

వేయిలే మొండదొరలత-ళ్కుయొప్పారి

గట్టుపట్టి లాగివ్వరు-స్గాంలలేరు
వరవుల ననయము-వరలించు వేల్పు
వెలుగు నిలువుననెల్ల పు-డలరు జేజె॥

7 చతుర్బాహు సమన్వితా

నాలుగెఱకలతో-నలువారు వేల్పు
వలనుల నాల్గు జ-బ్బలనేలు జేజె
కొఱకాని దినుసుకై-కొనక విడుచుట
గొప్పడింగరికిఁ జా-గుబడికసేత
గట్టువిలుతు వహు-ల్కాయి సేయుచుంట
నెలతాల్పు నిప్పుకి-న్వేల్మి నలుపుట
యీా యడ్డ యడియని-కెలరించుతల్లి

8 రాగస్వరూపపాశాఢ్యా

ఎడమకై తగులురి-నెలరారు వేల్పు
అడియరికై తగు-లందిన జేజె॥

9 : క్రోధాఽఽకారాంకుశోజ్జ్వలా

కినుక నిలువుసిడి-కేలొప్పు వేల్పు
కొయ్యదిప్పులఁ జొరి-గొను గట్టుపట్టి

10 మనోరూపేక్షుకోదండా

డాకేల నాదతుం-ట విల్దాల్పు దణి
కొలువుకుకాని బా-గు పరచుతల్లి
మంచి డెందమలరు-మలదొరపిల్ల
డింగరు న్దనలోన-డిందించు వేల్పు

11 పంచతన్మాత్ర సాయకా

ఉలివు, తాకుడు, పొడచవి-వలపుములికి

నిలువుతాలిచి తనకుడి—కెలనిజబ్బ
క్రిందు మిక్కిలికై సేయం—జిందుద్రాక్ష
నిట్టి పంటచున్న టనిండు—గట్టుపట్టి॥
అయిదుముప్పుల నడి—యనిఁ గాచువేల్పు

12 నిజారుణ ప్రభాపూరమజ్జద్బ్రహ్మాండ మండలా
తనకెంపుజిగినెల్ల—తావులన్ముంచి
విడిదాల నడియని—వెలయించువేల్పు

13 చంపకాశోకపున్నాగ సౌగంధిక లసత్కచా
బంగరుతాపుతోఁ—బైఁదోచునలరు
పొక్కిలిన్నుబరుడించు—పువ్వుచెందోవల
ముడిచినగొప్పక్రొ—మ్ముడిగట్టుపట్టి
పైకము పెంద్రోవ—పాడితగులము
పువులటుచెంపకో—ప్పునఁదాల్చుపిల్ల
జోడికమూలసొం—పుసలుపువేల్పు
వరవుదోసంగెడఁ—బాపెడు జేజె॥

14 కురువింద మణిశ్రేణీ కనత్కోటీర మండితా
గురువెందపూసల—కుళ్ళాయితాల్పు
అడియరిన్గూరిమి—నారయువేల్పు

15 అష్టమీ చంద్రవిభ్రాజదలికస్థల శోభితా
ఎనిమిదవనాటి నెలవంక—నేలునుదురు
చెలువములరాగు చూఁదో—చిన్నపిల్ల॥
ఎల్లనిద్దపుఁబొట్టు—లేలెదువేల్పు॥

16 ముఖచంద్రకలంకాభ మృగనాభివిశేషకా
మూతిజాబిలి మచ్చ—పోలుపారునిత్తి

పొక్కిలిబొట్టు సొం - పుతనరుపడుచు
నెలవలెడింగరీ - నినలర్చు వేల్పు॥

17 వదనస్మర మాంగల్య గృహతోరణ చిల్లికా
కంతునిలువాయి గుమ్మము —కన్నుబొమ్మ
లగు జాలుబిబ్బీలఁ జె - లంగుపడుచు॥
చిరునగవలర మం - చిగఱపుతల్లి॥

18 వక్త్రలక్ష్మీపరీవాహ చలన్మీనాభలోచనా
ఉలివాఁడుడాలుక-లువునమిట్టాడు
వంజరములచూపు - వలిగట్టుపట్టి
డింగరుకనుకలి - టీకిడు వేల్పు॥

19 నవచంపక పుష్పాభనాసాదండ విరాజితా
హొసబంగరువితి - యటులొప్పుసొగ
ముక్కలరారెడు-ముక్కంటి వెలఁది
తనుగొల్చువారికం - దమలర్చువేల్పు
వరవుపొగడగొప్ప - వఱలించు జేజె

20 తారాకాంతి తిరస్కారినాసాభరణ భాసురా
వాలుచుక్క, నేలపట్టి మెఱుంగుల
గేరెడుహురుమంజి-కెంపుపూస
లమరుమేల్పసిండి-యడ్డబాసహొయలు
గల్గు మెచ్చులాడి-గట్టుపట్టి
అడిగొంట్ల నెఱ్ఱగా-నరసెడున్గాని
చిరునగవలర మం-చిన్బంచుతల్లి
వరవులమగజాల-వలె సల్పు వేల్పు॥

21 కదంబమంజరీ క్లృప్తకర్ణపూర మనోహరా

కమ్మతావుల నీను-కడపటావళము
లులివులాగఁదాల్చు-నొయ్యారి వేల్పు
మిడిచుల పల్లించు-మిణకరిగొంతు
చెలువాలకించెడి-జేజేలమిన్న॥

22 తాటంకయుగళీభూత తపనోడుప మండలా

ఎండదొరనెలల-నిరుతమ్మలందు
కమ్మలుగాఁదాల్చు-గట్టాడుపడుచు
నింగినేల లివెల్ల-నిండుగ కొనుగ
నాడుచు న్నాడెడు-నాగట్టుపట్టి
చదలు పంటవలంతి-జాడగానోజ
కదలీకదలకొవ్వు-కవికిమలప్ప
అడియరి నెల్లడ-నలరించువేల్పు॥

23 పద్మరాగశిలాదర్శ పరిభావికపోలభూః

లాలుపూస నీడగను బి-ళ్ళకురళించు
పెలుఁగుచెక్కిళ్ళ నలరారు-మెట్టపట్టి
సైకముల పయిమెట్టు మా-సామితల్లి॥
అడియరినందగాఁ-డనిపించువేల్పు॥

24 నవవిద్రుమ బింబశ్రీన్యక్కారిదశనచ్ఛదా

క్రొంగసరామణి-కువ పండుచెన్ను
నగెడుకెమ్మోవి యుం-దము గుల్కుపడుచు
ముదిడింగరికిఁగూడఁ-బొలుసిడువేల్పు॥

25 శుద్ధవిద్యాంకురాకార ద్విజపంక్తిద్వయోజ్జ్వలా

పదునాలుగ్రాల ప-ల్వరుసమెులకల

కొమరారు మడికాసు-గుబ్బలికొంకి
పాలువారలనిల్వు-పల్వాలు వేల్పు
నేలవేల్పుల నోట-నీ కన్నతల్లి
ముప్పదిరెండు కొ-ల్పులఁ గొను జేజె॥

26 కర్పూర వీటికామోదసమాకర్షద్దిగంతరా
కమ్మతావుల నల్గడ-ల్పిమ్మెడినెల
తమ్మబుగ్గనమర్చు నం-దములదొంతి
నింగినేలల నంతట-న్నిండిన చలి
యిసుకమించిన మంచి పే-రెసఁగు తల్లి
తనుఁగొల్చుచుండు నం-దఱ హాయిమీఱఁ
గ్రేగంటితోఁ దిల-కించెడి జేజె
అడియరికెల్లరి-నగపర్చు వేల్పు॥

27 నిజసల్లాప మాధుర్యవినిర్భర్త్సితకచ్ఛపీ
తనపల్కు తీపిచే-తన్వీనెమిగులు
చల్లని నఁడువుల-చవిమల పిల్లౌ
అడియరి న్దీయుమూ-టాడించు వేల్పు॥

28 మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానసా
చిన్నినగవుడాలు-వెల్లి, నంగ మొల
వేల్పుడెందము ముఁచు-వెలితిప్పకొంకి
బోడికన్నెరునగ-వునఁగాంచు వేల్పు॥

29 అనాకలిత సాదృశ్య చుబుకశ్రీవిరాజితా
ఎనలేని గద్దువ-నింపారు పడుచు
అడియరికందము-లలరించు వేల్పు॥

30 కామేశబద్ధమాంగల్య సూత్రశోభితకంధరా

తొలుతాలఁ పుట్టిన-తాలిబొట్టు
గ్రాలు కుత్తుక వలరారు-గట్టుపట్టి
అడియఱి కొల్వున-కలరేడి వేల్పు
డింగరు చాగుబ-డిక గొనుజేజె
తగు నింటి కాఁపు సుం-తయు నెన్నఁడేని
వెరవేకి వేఁగని- వెరవిడుముగతి
ఎనిమిదేఁడ్ల పడుచ-దేనాటికైన
మగఁడే దుమిక్కాణి-మాబిడ్డతల్లి
తనయంత నాల్మగ-ల్తానె యాతాయి
అన్ని వావుల సగ-టాముట్ట బొట్టె

31 కనకాంగదకేయూర కమనీయభుజాన్వితా

మేల్పసిఁడి జబ్బరొత్తుల-న్మెఱయు పడుచు
ఎఱకల యొలపున-నెదరిపడంచు
ఘంచివారలఁ దనచప్పు-మాటునవిడు
అడియరుల నిరురెట్టల-యుండఁ జేర్చు
ఊరకుండిన వారి-నోకొండి వేల్పు
పైఁడితాయెత్తులఁ-బరఁగెడిపిల్ల॥

32 రత్నగ్రైవేయ చింతాకలోల ముక్తాఫలాన్వితా

కుతికంటుతీఁగడ-గ్గుల యాణిపేర్లు
తనరారు జాబిల్లి-తాలుపురాణి
తావి కొలంది మే-లెసఁగించువేల్పు॥

33 కామేశ్వర ప్రేమరత్న మణీప్రతిపణ స్తనీ

వలదొఱపగ తన-పైఁ గొల్పువలపు

పూస వెలకు గుబ్బ-మొనవిల్లుముగతి
కొల్ఛువారిఁజూచి-కూడిపెడుతల్లి॥

34 నాభ్యాలవాలరోమాళిలతాకుచ ఫలద్వయీ

బొడ్డుపాదునుండి-పొడమిననూగారు
గొనబుతివ్వపండ్ల-గుబ్బజోడు
పాడికుడ్పిడింగరులఁ గా-పాడుతల్లి
మంచివారల నందఱ-న్మనుపువేల్పు॥

35 లక్ష్యరోమలతాఽఽధారతా సమున్నేయ మధ్యమా

నూగారుతీగయు-నుంబట్టి తనకుఁ
గలదు కౌననిపించు-గట్టాదుపడుచు
అగపడీయగపడ-దాయుప్పనడుము
ఆరయువీల్కా-ని-యున్మిటినడుమ
అడియరి నడఁకువ-నలరించువేల్పు॥

36 స్తనభారదళన్మధ్య పట్టబంధ వళిత్రయా

చాఁచులమోపిక-దవ్వాకునడుము
ముమ్మడుతలఁగోక-మూఁపిరిగట్టు
బంగరుబొమ్మగు-బ్బలిదోరపిల్ల
తనడింగరీని కం-దమలర్చు వేల్పు॥

37 అరుణారుణ కౌసుంభ వస్త్రభాస్వత్కటీతటీ

ఎఱెఱజాబురకోక-నింపారుమొలదూర
యలరెడి చలిమల-యాఁడుపడుచు
ఎలయీడు కడిమితో-నెల్లప్పుడు తన
లెంకచెన్నొప్ప సల్పెడు వేల్పుమిన్న॥

38 రత్నకింకిణికా రమ్యరశనాదామభూషితా

ఘాసముఁవ్వల కమ-ర్పొలుపొనుపడుచు
బొడ్డుసుడిఅవలి-పొడనొప్పువేల్పు
అడియరినడుము జ-వ్వాడించుజేజ॥

39 కామేశజ్ఞాత సౌభాగ్యమార్దవో రుద్వయాన్వితా

పగడముక్కుంటికే-యగపడుమవ్వపుం
బెడఁగుతొడకవ క్రొ-త్తడిసిరాజి
కోర్కులుడిగితను-గొల్చువారికిఁదప్ప
మైమొప్పగించని-మంచిపిల్ల
తగులాటమున్మాని-తానొంటిగాఁగాఁక
నడికెనుబోడ తో-నుండు పడుచు
ఎప్పుడొండొరుమిక-న్నెల్లరియెడఁ జూపు
జాలిగుండియలో నె-సంగుతల్లి

అప్పసము తనతప్పుల-నొప్పుకొనుచు
నొరుల సెగ్గింప కొందలి-నోర్చుకొనుచు
అందరికి మే త్తలంచెడి-యడియనెంచి
పొందుగా నేలుకొనువేలు-పుతలకట్టు॥

40 మాణిక్యమకుటాకార జానుద్వయ విరాజితా

గుడికెంబొమిడికము-ద్దులు లరుపడుచు
ఆడిగొంట్ల గుండియ-లణఁచుట న్నెత్తు
రలమిన మోఁకాళ్ల-నలరెడు దణియ
అడియరికెల్ల మే-లఁరించుజేజె
అడియనెక్కువ యొడ-యని సల్పువేల్పు॥

41 ఇంద్రగోప పరిక్షిప్త స్మరతూణాభ జంఘికా

పసిఁడి పువ్వులనింపు-పచ్చవిల్తుపొది
లాగొప్పు చిరుతొడ-లన్నించుపడుచు
కదలకే మేల్మిపో-కలఁ జోవువేళ్ళు
ఏతతి కల్గి సై-కెగరెసి జెట్టి॥

42 గూఢగుల్ఫా

డాఁగిన చీలమండల ముద్దుగుమ్మ
ఏదియైనన్గుడ్వ-కెదిగెడి పిల్ల
ఆఁకలి దప్పిక-లానని పడుచు
తన్ను తాఁదిని త్రాఁగి-తనరెడు వేల్పు
డింగరునకులావు-టీకిడు జేజ॥

43 కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాంచితా

మీఁగాళ్లపాటి దా-మేటి వీపుపస
పలుమఱున్దగనాడు-వలిగట్టుపట్టి
లన్నిదిన్నుల మోయు-నడఁగులమీఁద
మిక్కిలి చుల్కఁగా-మెట్టాఁడు పడుచు
అంతయు న్దనయడు-గై యొప్పువేల్పు
ఎల్లరి న్వరవ్రకిం-దేయుంచు జేజ॥

44 నఖదీధితి సంఛన్ననమజ్జనతమోగుణా

తనయడుగుల గోళ్ళ-తళ్కుచేఁ దనకు
మ్రొక్కువారల మఱ-పున్గప్పువేల్పు
కొల్చువారల కెఱు-కవనిచ్చు జేజ॥

45 పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా

అంజకేవ జిగికువమేల-మాడుతమ్మి
లాలు తెలుపు సొంపలలారు-కాలిగంటి

అడుగులన్నింగి నేల లి- ముడుచు వేల్పు

46 శింజాన మణిమంజీర మండిత శ్రీపదాంబుజా

పూసగజ్జెల మ్రోఁగు-పొందమ్మిమడుగు
వరుస ఘందులుదొ్రోక్క-వలిమలపడుచు
అడియడినొ్నాగసుగా-నాడించు వేల్పు

47 మరాలీ మందగమనా

ఆఁడు తూఁడుదిండి-యల్లనల్లనడ
కోల్పాట్లనుండి బా-గులనేర్చుదంట
అడియరి కెఱుకువ-నలరించు వేల్పు

48 మహాలావణ్యశేవధిః

గొప్పయందంబుల-కుప్పమలప్ప
అన్ని యంగములడి-యనికిడు వేల్పు

49 సర్వారుణా

నిలువెల్ల గావి డా-ల్నిం డారుతల్లి
బొమ్మంచుపై వల-పుగ్గొనుపడుచు
కెంపు తల్క-డియని-కిన్గొల్పు వేల్పు!

50 అనవద్యాంగీ

ఈడన్ని దేడులీడున
సీడన్నటి కైవలేని-యొక్కటియైమే
నొ్పడిమి నుండికందక చిం
దాడఃక్షిడాని పదు చౌనొ. యారిసిరాజీ.

51 సర్వాభరణభూషితా

నలువదినాలుగు-నగలెల్లఁదాల్చు
బంగరుబొమ్మగు-బ్బలి దొఱబిడ్డ
డింగరు మేన్పసిం-డిన్పల్పు వేల్పు

52 శివకామేశ్వరాంకస్థా

ముక్కంటి తొడమీఁద-మురిసెడు ముగ్ధ
ఎప్పటి కెఱుకువ-సేపారు జే జె
కోర్కెలుడుగు బీద-కొల్చెడి వేల్పు

53 శివా

ముక్కంటితానెయా-ముద్దులగుమ్మ
పెంద్రోవ నిలువగు-వెలి దొరరాణి
ఎల్లపుడున్మంచి-యొసల్పు వేల్పు
వంచపాల్మగ వాఁడు-పగడవంతుచెవి
పగడ మే నల తాల్పు-వలిగట్టు పట్టి॥

54 స్వాధీనవల్లభా

ముక్కంటి నాడించుఁ-బోగట్టుపట్టి
నెలతాల్పు కానాచి-నిడుమెట్టబొట్టె
చెల్వాని లోఁకువ-చేసెడు చెలువ
అడియని కెల్లపు-డగపడు వేల్పు

55 సుమేరుమధ్యశృంగస్థా

పొంగట్టు నడ్మి కొ-మ్మున నొప్పు వేల్పు
వరపుడెందము నడ్మ-వరలెడి జే జె

56 శ్రీమన్నగరనాయికా

సాదరు ప్రోలేలు-చలిమలవిల్ల
నింగినేలలకుఁ దా-నే పాదిసాహి
చీఁకటి వెల్తురు-ల్చేరివంతు సల్పి
హెచ్చుతగ్గుల నెన్న-కేలెడి జే జె
కోడిక కెల్లక-ల్మలలర్పు వేల్పు

57 చింతామణి గృహాంతస్థా

కాయ్వెడు పూసలో-గలినుండు పిల్ల
కోఅని కోర్కెల-నురిపించు తల్లి
వరవు నెల్లప్పుడు-ద్రవ్రతికించు వేల్పు॥

58 పంచబ్రహ్మాసనస్థితా

నింగి, గాలి, నిప్పు,-నీళ్లు, పంట వలంతి
మైదరగులనుండు-నలరుఁబోడి
ఏవురు తాతల-నెక్కిన వేల్పు
వరవునైదు సురుల-న్వాఅలెడి జే జె॥

59 మహాపద్మాటవీసంస్థా

తల వేయిరేకుల-తమ్మిపొలమున
నసలుఁ బుట్టువు నడి-నలరెడి వేల్పు
బోడికయాదల-నొప్పారు జే జె॥

60 కదంబవనవాసినీ

వెలిమ్రాని తోటలో-విడిసిన పడుచు
ఊడిగింద్రకుఁ గోర్కె-లొసఁగెడు వేల్పు॥

61 సుధాసాగరమధ్యస్థా

చవికడలి నడుమ-సమకూరు పడుచు
ఔదల తమ్మిలో-నలరారు వేల్పు॥

62 కామాక్షీ

గడిఁదేరు కడుసోయు-గవుచూపుపడుచు
కఱు, కెంఢదొర, నెల-కన్నుల వేల్పు
కోలుమ్రోలున నెల-కొన్న వాల్గంటి
తనుఁగొల్చువారి డెం-దమలము జే జె॥

63 కామదాయినీ

కాఁక కోర్చియుఁ గొల్చువారలఁ-గన్నతల్లి వలెన్గనున్।
తనకొల్చు నల్పునం-దరి కోర్కె-లిచ్చు
ఒరపైన వరవుల-కొడఁబకు వేల్పు॥

64 దేవర్షిగణ సంఘాతస్తూయమానాత్మ వైభవా

చదలుకాపులు కాఁక-సల్పెడివారు
గుమికొని కొండాడు-గొప్పమేలప్ప
ఎఱుకువఁగలవారి-కెల్ల మేల్బంతి
బాసవాలుల కెల్ల-వలిగట్టు పట్టి
డింగరుల్జట్టు-గట్టి పొగడు వేల్పు॥

65 భండాసురవధోద్యుక్త శక్తిసేనా సమన్వితా

తొలివేలు పులరేనిఁ-ద్రుంగించు పౌజు
మైఁజెఱ-లాడెడు-మలదొరపిల్ల
సిగ్గిడి బండలఁ-జెండిన యసరి॥

66 సంవత్కరీ సమారూఢసింధురవ్రజసేవితా :

కలిమిచెలి మొక్క-నేనుంగు-గములనెప్పుడు
కొల్వఁబడు మంచు గుబ్బలి-కూర్మిబిడ్డ
మంచికోఱికలఁ గొనసా-గించు వేల్పు॥

67 అశ్వారూఢాధిష్ఠితాశ్వకోటికోటిభిరావృతా :

కోటానఁ గోట్లని-గుడుకిలాతముల
నెక్కిన గులపల-నెనసిన దణియ
బొందినదప్పు-డెండ-మున కూఁతకోల
ఎల్ల మైకొల్పుల-నేలెడు వేల్పు॥

68 చక్రరాజరథారూఢ సర్వాయుధపరిష్కృతా

తేరాద గుల్లాము-తెలివి, కైదువులు

కాంక, నికము, కని-కరము మొదలగు
లెన్ననడువడులు,-లేక తానగుచు
ననయుమూ సునకంబో-రాడెడు పిల్ల
మొలకువ, కల, కూర్కు-మిగిలిన పడుచు
నిండారు తన్వియై-నెగడెడు తల్లి
ఔదలసుడి లోన-నలరెడు నెఱుక
వరవు పగరనెల్ల-బరిమార్చు వేల్పు॥

69 గేయచక్రరథారూఢ మంత్రిణీ పరిసేవితా :
ఆట, పాట, పలుకు-లలరించు తల్లి
ఇంపారు అవలిపు-ట్టిల్లగు పిల్ల
పాటకత్తెల నేలు-పైదలిమిన్న
నవ్వులబండియై-నలువారుపడుచు
ఎల్లచదువరుల-నేలెడు వేల్పు॥

70 కిరిచక్రరథారూఢ దండనాథాపురస్కృతా :
కొమ్ముకాంత్రడ తెగలా-గు వలుదబండి
నెక్కి-నిక్కెడుదణి-నేలెడి వేల్పు॥

కం॥ కనురెప్పమూసి తెఱచున
దనులోనే నింగినేల-తరబడిపుట్టిం
చి ని గిడ్చి తునుముకడిమి
న్వినంగు పనికత్తె పడుచు-పిల్లసిరాణి॥
మయితేరు డెందము-మందడి డొరుక
తానయెడాఁగురిం-తలనాడు పిల్ల
కట్టుట, విప్పుట,-కలిగించుట, తెగ
నాడుట, తనపని-యైయొప్పు వేల్పు॥

71 జ్వాలామాలినికాక్షిప్తవహ్నిప్రాకారమధ్యగా
పదియారు జాబిలి. వలతులలోన

పదునాలుగవ వంతు పడఁతి పనివిని
ముప్పదియామడ-లొప్పెడవు వెడల్పు
వేయూఁత నేలల-వెల్గెడు నిప్పు
చుట్టుల వలవాయిఁ-జొఁబన్ను దాని
నడిగడిన్నిలఁబడి-నాల్గు తెఱఁగుల
మెట్టుపోగుల తోడ-నేపాటు జెట్టి
విదార, పగలు, మూ-పగుదుము దాఁదు
సమకట్టు నీరెండు-పరకుల నల్ల
నీరెంటి పుఁటఁదా-నే జోలి మాని
యలరెడు నెలయయి-యాగట్టుపట్టి
తానెయంతయు నొచుఁ-దనకంటె వింత
గానకెన్నో వాల-కము లూను వేల్పు॥

72 భండసైన్యవధోద్యుక్త శక్తి విక్రమహర్షితా :
నంజాడు దిఁడితొ-నలసమయించు
గమి శక్తియుల పోటు-గని పొంగు జే జె.
గుండియులో నెదు-ర్కొను పగమూక
లడఁచుడింగరు చేవ-కలరారు వేల్పు

73 నిత్యాపరాక్రమాటోపనిరీక్షణసముత్సుకా :
తనచేవ నానాటఁ-దలచూపు దణియఁ
గాంచి వేడ్కపడు ము-క్కంటి వెలఁది
అటిముటిఁ దనయుడి-యురులు గెలువఁగ
మబలాటమున నెప్పు-డుప్పొంగు వేల్పు॥

74 భండపుత్రవధోద్యుక్త బాలావిక్రమనందితా :
తొలివేలుపుఁ ముప్పు-దుంప్రఁ జెండాడు
తొమ్మిదేండ్ల తనకూఁ-తుఁగని యుప్పొంగు

మంచిబిడ్డలతల్లి —మలదొఱపిల్ల
అరయిక చేవమై-నలరారు వేల్పు
తనడింగరులగొప్ప-తనమెంచు జేజె.

75 మంత్రిణ్యంబావిరచిత విషంగవధ తోషితా :
తనవజీరిపగతు-తలద్రెంచిననాడు
పనసకుప్పొంగెడు-వలిమలపిల్ల
అడియరులాకతా-యులపీఁచమడఁప
కలకల నవ్వి వే-డ్కఁగనాడు వేల్పు॥

76 విశుక్రప్రాణహరణ వారాహీ వీర్యనందితా :
నంజుడు దిండుల-న్మట్టి మల్లాడు
దుముదారి చేవకెం-తో పొఁగు వేల్పు
అడియడగ్గులనోర్వ-నలరారు జేజె॥

77 కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా :
తనచూపు గిత్తత-త్తడితేనిమూఁతిఁ
జెలఁగ బిళ్ళారిఁగాం-చిన గట్టుపట్టి
దొడ్డతలంపుల-తో మంచివారి
నెల్లరిన్గనిపెంచి-యేలెడితల్లి
అడియచేఁ బగఱయే-పడఁగించు వేల్పు।

78 మహాగణేశనిర్భిన్నవిఘ్నయంత్రప్రహర్షితా :
గొప్పపిళ్ళారి పోఁ-గొట్టినయడ్డు
మరఁగని యుప్పొంగు-మలదొఱపిల్ల
మంచివారలు కొట్ల-మారులకుట్రఁ
జాలియింపఁ జిరునగ-వునవొప్పు వేల్పు॥

79 భండాసురేంద్రనిర్ముక్త శస్త్రప్రత్యస్త్రవర్షిణీ :

వేగంటి గొంగలు-వేయునల్లులకు
మాటుకోలలెగచు-మలదోఅబిడ్డ
డెందములోని క-డింది మారుతులఁ
గడువడినడఁగింపఁ-గలిగిన యొఱుక॥

80 కరాంగులినఖోత్పన్న నారాయణ దశాకృతిః :

కఱివేలుపున్నన-కయిపదిగోళ్ల
మొనలతో నీరేను-పొలుపులఁబన్ని
నేలనల్లాడించు-నేర్పైనజేజె
తలఁచినంతనే నింగినే-లలనివెల్లఁ
బన్నుచడఁగించుచుండు ద-ప్ప కమలప్ప॥

81 మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసుర సైనికా :

కనలు కైదువుడిగ్గి-కాల్చిన సోఁకు
మూఁకలబూడిదె-న్బొరలాడువిల్లి
పెంద్రోవఁ జెరలాడు-పెరవరిమిన్న
వరవుల మఱపెడఁ-బాపెడువేల్పు॥

82 కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసురశూన్యకా :

కడుగరాసులప్రోలుఁ-గాల్చు చుఱుకరి
పొగ్గిచీనవిత్తుల-న్బరిమార్చు దణియు
ప్రాద్వాకుల పొగరు-వాపెడుజెట్టి
పాడగట్టులనేలఁ-బ్రాపెమఁబిరుదు
మఱకువ నెఱుకచే-మాపెడుపదుచు
అడియరులకు మేటి-యల విడువేల్పు॥

83 బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవసంస్తుతవైభవ :

తమ్మిపుట్టువుతల్లి -తల్లి పెనిమిటి
వేగంటి మొదలగు-వేల్పులవలనఁ
బొగడఁబడెడు విడి-ముడినొప్పు జేజె
అడియని కందరి—కన్న నాస్తియిడు
నలవిమీరిన యల-వలరారువేల్పు॥

84 హరనేత్రాగ్నిసందగ్ధకామసంజీవనౌషధి :

ముక్కంటి కల్లెరు-పున బుగ్గి యైన
వచ్చవిల్తు మఱల-బ్రతికించు వెఱవు
మానిన తోడుసు క్ర-మ్మఱఁగలిగించు
మందు నిక్కంబుగ-మలదొఅపిల్ల
చేరిక పోడిమి-న్జెలగించు వేల్పు॥

85 శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజ :

మూఁడురెండు వి త్తులనుండి-పుట్టుబొమ్మ
మూతితమ్మి పొల్పారెడి-ముద్దుగుమ్మ
ఐదు మైదిన్నుల-యడపొడ వేల్పు
తలచుకొన్నటు నిల్వు-తాల్పెడి జేజె॥

86 కంఠాధఃకటిపర్యంత మధ్యకూటస్వరూపిణి :

అఱుమొదలుకొని మొల-వఱకు నడిమిబొంది
యాటపట్టుకాగ-నలరు వేల్పు॥
కానిపించు నెవరి-కేనియుఁ దమనడి
యీాడునందె డెంద—మేలు వెలుఁగు॥
క్రిందుమీఁదుల నడ్మఁ-గేరెడు జేజె॥

87 శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణి :

మొలక్రింది వంతు పొ-ల్వుగ వెలుగుపడుచు
ఒడికట్టు కొల్వున-కుప్పొంగు వేల్పు
వలదో ఆనేగించు-వలిమలపిల్ల
డింగరుద్దన్వి గ-డింపించు జేజె.

88 మూలమంత్రాత్మిక

మొదటి మంతరమడ-పొడగట్టుపట్టి
తలచిన యట్టులం-తయు సల్పు వేల్పు
పదునైదువ్రాల చె-ల్వము మెట్టబొట్టె
వరవునకు ముగితి-వఱలించు జేజె.
ఈ నింగినేలల-కెల్ల గతంబు॥

89 మూలకూటత్రయకలేబర :

మొదటి నెలవు ముచ్చ-బొందిమలప్ప
ముక్కంటి, పెరుమాళ్లు-ముత్తాతకల్పు
ఎల్ల వేలుపులు తా-నే గట్టుపట్టి
నెలపదునారు వం-తే మెట్టబొట్టె
విన్నునేలల తొలి-విత్తైన జేజె॥

90 కులామృతైకరసిక :

నామగుంటదగిల్చి-నాలుక చివర
యునయు మాదలచవి-నానెడుపిల్ల
అన్నియు న్దానెమై-యాటాడుపడుచు
అప్పసమెఱుక ని-ల్వో ముద్దులాడి
పుట్టినట్లు న్గిట్టు-పోల్కి నెల్లపుడు
వింతవాలకములు-వేయు లేబడ్చు
డింగరు న్మగిత గ-డింపించు వేల్పు॥

91 కులసంకేతపాలిని :

పదుగు, పేర్నడతలే-ర్పరచెడి వేల్పు
తన్నుఁగొల్చెడి గుట్టు-దాఁచెదు వదుచు
బాడుచాటునఁగొల్వఁ-బడుగట్టుపట్టి
డెందము చాగు-బడిక గొనుజేజె॥

92 కులాంగన :

కొ్రత్తడికన్నాకు-గుబ్బలిపట్టి
నింగినేలల నెల్ల-నిండారు తెలివి
ఆఁడుకూతురు మంచి-యాసరాపాడి
కందువచాగు బడ్క-గొనుమలప్ప
వరవు మిక్కలి తగ-వరి సల్పు వేల్పు॥

93 కులాంతస్థ :

కూటమి, కుదువు, కూ-ర్కుల నిల్వుపావ
ఆలుమగలు తానె-యానెలపడుచు
ఎక్కువతక్కువ-లెన్నని తల్లి
నింగి నేలలుకల్ల-నిక్కమావిల్ల
అన్నిటికి న్నడమ్మ-నలరారుజేజె
ఈవునే నదదివి-యెల్ల నావేల్పె

94 కౌలిని :

అందరికిలు వేలు-పాగట్టుపట్టి
వావివర్సలనెన్ను-పడుచుసిరాజి
డెందమందే తోఁచెడి మెఱుఁగుబోఁడి
ఐదేండ్ల మెణకరి-ననఁగు నచ్చాళి

అందాల కాణాచి-యామెట్టుజొట్టె
అడియంద్ర కప్పస-మాసరా వేల్పు॥

95 కులయోగిని :

కలలాడుచు-కూర్కి-డుచు నొ
డలు తెలియక తప్పద్రాగి-టాటోటులతోc
గలియికల నోలలాడుచుc
జాలమింగెదు కల్లరీంద్ర-cబోరిగొనుననలా॥
ఒంటికాని కఱద-నొప్పారు జేజె
డింగరీని మెడం బొల్చె-డి యిలువేల్పు॥

96 అకుల :

ఆద తనంతట నొబ్బడమి-యున్నియుc దా నలరించు
ఆద యాదలతమ్మి-నలరారు వేల్పు॥ [నొంటిగా

97 సమయాంతస్థ :

తొలు చదువులలోనc-దులకించు వేల్పు
నెలతాల్పు తానెయా-నిడుగట్టు పట్టి
డెందము చాగు బ-డికగొను జేజె॥

98 సమయాచారతత్పర :

కాచు నమలక, తా-గక, జంటcబోక
బ్రతికెడి డింగరీం-ద్ర గ్గాచు వేల్పు
ఎవ్వరికైనc ద-ప్పెన్నని జేజె॥
కొదల తమ్మిలో-నలరారు నిగ్గు॥

99 మూలాధారైకనిలయ :

జొడ్డు సుడి యసలుc-బుట్టింటకాcపు
కొనికి పడెడు మేలు-కొనియు నావేల్పు॥

100 బ్రహ్మగ్రంధివిభేదిని :

బోడిక మఱుకువ-ముడివిప్పు తల్లి
తనపన్నకము లోనఁ-దాఁజొచ్చు వేల్పు
తాత మెఱ్కువ తల-న్దన్నిన తేజ॥

101 మణిపురాంతరుదిత :

తొమ్మిది పూసలం-దువఁ బుట్టుపాప
బొడ్డుదిగువ సుడి-న్బొడమెడు పిల్ల
అచ్చోటు కొల్వున-కలరెడు తేజ
విన్ను నేలల నొద-వించెడి తల్లి
తను నెలయునెడు న-తనిబెంచు వేల్పు॥

102 విష్ణుగ్రంధివిభేదిని :

వంచరెండును కొంట-బంగారుకోక
దాలువుముడి, దానిఁ- దలగించు నెఱుక॥

103 ఆజ్ఞాచక్రాంతరాలస్థ :

కనుబొమల-గడిసుడి రేకుల
రెంటినడుమ-రేమొండవంటి
ఒంకి చేర్పగు-టీకు తెల్సి తెలియు
కొంటినాటాడు-చుండు గుబ్బలిపట్టి॥
అన్నియున్దనలోనఁ దా-బన్నియాడు
కొనెడి పసిపాప తెలిసి తె-ల్యని తెఱఁగున
పాడినతీఁగె మెఱుఁగని లేఁ-బడుచుకరణిఁ
దనకుఁదాఁ బగడము మెచ్చు-కొనెడి వేల్పు॥

104 రుద్రగ్రంధివిభేదిని :

కూర్కు-మఱుకువ చి-క్కు విప్పు వేల్పు
వరవుఁ గినుకఁదీర్చి-వరలించు తల్లి॥

105 సహస్రారాంబుజారూఢ :

వేదల తమ్మిపై-నలరాగు జేజె
అంతయు స్థానమై-యడరెడు తెలివి
వరవుని వేగంటి-వలెఁ దెల్విఁ తేట
ల నిమ్మలఁగించుమ-లదణియబిడ్డ॥

106 సుధాసారాభివర్షిణి :

కోల్పవి జడివాన-ఁగురియించు వేల్పు॥
బోడిక కెల్లయి-మ్ముల్లోసంగుతల్లి॥

107 తటిల్లతాసమరుచి :

ఆడె బలడరున బొడమెడు
తీఁగెమెఱుఁగటు తో-తెంచెడు వేల్పు
వానతటి మెఱపు-వంటి మలప్పు
మించులాగున నొప్పు-మించెడి పడుచు
మంచివారల యాద-మలయు క్రొమ్మెఱుఁగు॥

108 షట్చక్రోపరిసంస్థిత :

ఆఱుగిఱుల పయి-నలరారు వేల్పు
నుచ్చున నలరు త-నువు గట్టుపట్టి
డింగరు ముగిటి గ-డింపించు వేల్పు

109 మహాసక్తి :

మంచివారలపొందు-మరగినపడుచు
తనకొలు పరుదెంచు-తటివేచువేల్పు॥

110 కుండలినీ :

కుట్టినరంబుల-కు స్థల్లి వేరు

టోకున మాడవ-ట్టువరకుఁ బాఱు
తెగ నీచఁగా నెగా-దిగఁ గుడియెడమ
వైపులకు న్జుట్టి-వచ్చుచుయుసురు
మడతచుట్టుకొని మైమఱచి కూర్కు-డెను।
చిల్వలాగు మిడుకు-చేవయా వేల్పు
అడియరి నెల్లపు-డలరించు నెఱుక॥

111 బిసతంతుతనీయసీ :

సన్నలేఁదూడుదారము-సాటివేల్పు
గుండెలో నల్లమింటి చు-ట్టుందుమెఱపు
వరవులన్దనలోన-వఱలించు జేజె
నెమ్మియి మిడుకుల-నిండారుచేవ॥

112 భవానీ :

ముక్కంటి కంతు బా-ములఁ గాచు పడుచు
పునుకతాలుపునంటు-ముద్దుల గుమ్మ
లావున నింగిసే-లల నేలు తల్లి
ఎల్లెడల న్మించి-యేనల్పు వేల్పు
వరవుల వందేండ్లు-బ్రతికించు జేజె॥

113 భావనాగమ్యా :

అనుకొన్నటు లెదుట-నగపడు వేల్పు
పదియేండ్ల యీడొప్పు-బంగారుబొమ్మ
వరవుల కోటికె-ల్వఱలించు జేజె॥

114 భవారణ్యకుఠారికా :

తోడరి పుట్టువు కారు-తునుమున రాజ
కడిది బాము లడంచి-కాపాడు వేల్పు
వరవునకు ముగితి-వఱలించు జేజె॥

115 భద్రప్రియా :

మంచి కొదలయూంచు-మలదొరపిల్ల
డింగరుమేల్నడ్వ-డికలరు వేల్పు!

116 భద్రమూర్తిః :

మంచినిలువు మంచు-మలయాడు పడుచు
బోడిక నొఅపరి-న్బొనరించు వేల్పు!

117 భక్తసౌభాగ్యదాయినీ :

అడియరులకు మంచి-యలరించు వేల్పు
చెలకు, రేలపం, డ్లనుములు-జీలకఱ్ఱ
మెంతులు, చవి, బుక్క-, పెఱుంగు-మేల్దినుసులు
డింగరీని కీ వెన్నిదిం-టి నిడు శేజె!

118 భక్తిప్రియా :

మంచినడత మెచ్చు-మలదొరపిల్ల
గొప్పకొల్పునకుఁ ద-గులొ్కను శేజె

119 భక్తిగమ్యా :

నమ్మినవారికెంతయుఁ-జిక్కు-వేల్పు
కొల్చెడి వరవుల-కు దొరకుశేజె

120 భక్తివశ్యా :

వేల్పుదునకు లొంగు-వెలిదొరరాణి
అడియనితలంపున-కగపడు వేల్పు

121 భయాపహా :

లొంకలు మొదలగు-లొద్ది చక్కటుల
లోఁతునీల్లలఁ దెగు-ళ్లుతగులుపట్లఁ

తల్లి విన్కి-

దనపేరుతలంచినం-తన వెలిపిల్ల
మానావు పలికిరి-మలదొరపిల్ల
బోడిక దిగులెల్లం-బోంగొట్టు వేల్పు॥

122 శాంభవి :

మడికాసుమలతేని-మంచియిల్లాలు
నాల్గజయుగికి త-నర్చెడియమ్మ
పైంజూచునటు తెప్ప-పాటులేకున్న
కనుల నొదల సొంపు - గాంచెదునేర్పు
ఎనిమిదేడాదుల-యీడొప్పు పిల్ల
అడియారి నెల్లవు-డలరించు వేల్పు॥

123 శారదారాధ్యా :

పలుకువెలంది చాగు-బడిక నుప్పొంగు ॥
చదువరి వేల్పుదు-సమకొల్పువేల్పు
చలిదతి ద్రొమ్మిదవనాటి-కొలువు గొప్ప
పంకువున్నని కదువేడ్క-పడెదు జేజె॥

124 శర్వాణీ :

మొగిలువిడితయి యి-మ్ము సల్పు వేల్పు
నేలనిల్వగు వేంత-నలతాల్పురాణి॥

125 శర్మదాయినీ :

బోడికకెల్ల యి-మ్ములొసంగు వేల్పు॥

126 శాంకరీ :

అడియునికిం బదవి-నలరించెడి నెల
తాల్పు పెండ్లాడిన_తల్లి తల్లి చెలి
గుండనికెల్ల కోర్కు-లదీర్పు తల్లి॥

5)

127 శ్రీకరీ :

ఎన్నిదికల్మలి-నెసఁగించు వేల్పు॥

128 శక్తిః :

నింగినేలలచేవ-నిడుగట్టుపట్టి
అడియని కెలయల-వలరించు వేల్పు॥

129 శ్రద్ధా :

మేటినమ్మిక నిల్వ-మెట్టాఁడుపడుచు
అడియకు నమ్మిక-మలరించు వేల్పు॥

130 భాగవతప్రియ :

వరవులపై మక్కు-వన్గొనుతల్లి
జాలిగుండెల నప్పు-సముగాచు వేల్పు॥

131 శాతోదరీ :

అలతికౌ నసియాడు-నలమలపిల్ల
అడియరి డెందమం-దలరారుజగ్గు
కూటమిహాయిపై-కొల్పెడు వేల్పు॥

132 శాంతిమతీ :

అడియరి నోర్మిపై-నటిసెడు వేల్పు
మిగుల నోర్పునమించు-మెట్టతొల్పాలు॥

133 నిరాధారా :

ఏయూండయున్గొన-కెలరారు వేల్పు
నింగినేలలకుఁ దా-నే దండఁగోల
అడియని కాసరా-మై యొప్పుజేజ॥

134 నిరంజనా :

ఏకప్పులున్లేని-దే గట్టుపట్టి
అప్పసం బలరారు-నాకన్నతల్లి
అడియరిమఱుకువ-నడగించు వేల్పు
ఎప్పుడు న్వరవుహా-ఋన్పించు శేజె॥

135 నిర్లేపా :

ఏపూఁతయైన లే-కెలరారు వేల్పు
దేనినంటీయుంట-దేగట్టుపట్టి
ఎఱుక తానైయున్న-దే మెట్టబొట్టి॥

136 నిర్మలా :

మస్టులెవ్వియులేని-మలతేనిపిల్ల
ఊడిగీంద్రకుఁ గీడు-లుడిపెడివేల్పు॥

137 నిత్యా :

పగడములాగె య-ప్పస మొప్పువేల్పు
అడియరి న్వాలాయ-మలరించు శేజె॥

138 నిరాకారా :

ఏయడపొడయులే-కెలరారు వేల్పు
తలఁపునకందక-తనరెడు శేజె
తనుఁగొల్చువారి డెం-దమలర్చుతల్లి।

139 నిరాకులా :

కొంకుపాటెఱుఁగదు-గుబ్బలిపిల్ల
కాదుహాలికిక్క-ముక్కంటి వెలంది
అడియరి నదురులే-కాడించు వేల్పు॥

140 నిర్గుణా :

ఏపోకడలులేని-దేగట్టుపట్టి
ఎన్నడు న్పగడలా-గేయొప్పు వేల్పు।
వరవుఁగోరిన లీల-బ్రతికించు జేజె॥

141 నిష్కలా :

వంతులుకాని జా-వలిమెట్టబొట్టి।
చిన్నచిన్నకు, పెద్ద-పెద్దకా వేల్పు।
అంతయు న్దానెయా-నమ్మఁబిల్ల।
తఱుఁగు విఱుగులేక-తనరారు తెలివి।
కొల్చువారికి వెల్తి-గొల్పని జేజె॥

142 శాంతా :

ఎంతమోమోర్పుతో-నెసఁగెడితల్లి।
కలఁగని చవిబావి-గట్టేనిపట్టి।
తనడింగరుని తప్పి-దముఁగాచు వేల్పు।
వరవునకు ముగిలి-వఱలించు జేజె॥

143 నిష్కామా :

కోర్కెలన్నియుఁ దీర్చు-కొన్నమలప్పు।
డింగరుకోర్కు లీ-డేర్చెడివేల్పు।
అడియరి న్దన్వెమై-నలరించు జేజె॥

144 నిరుపప్లవా :

చేటెన్నఁడున్లేని-జేజేలమిన్న।
డింగరుల కీడు ము-ణిన్మ్రాన్పు వేల్పు।

145 నిత్యముక్తా :

అలరు విచ్చులవిడి-నననయమా వేల్పు।

వట్టువిడువులేని-వలిమలపట్టి।
చెలి యెన్నఁడెఱుఁగని-సీమాటిమేటి।
వరవులు న్బంద్రో-వ వఱలించు తేజె॥

146 నిర్వికారా :

మాఱువల గనదా-మలదొరపిల్ల
అకటావికటముగా-కలరారు వేల్పు
అడియరి న్బగడలా-గలరించు తేజె.

147 నిష్ప్రపంచా :

నింగినేలలతోఁబ-నియొలేని వేల్పు
తనకు రెండవదిన్ను-తలపనితేజె
పజోలికినోబ్బని-దేగట్టుపట్టి
తనవతె డింగరు-న్దనరించుతల్లి.

148 నిరాశ్రయా :

ఏయూసరాలేని-దే గట్టుపట్టి
అడియఁడు తానయై-యులరారు వేల్పు॥

149 నిత్యశుద్ధా :

అప్పసమున్నడు-వౌ గట్టుపట్టి
అంటు న్నడున్గొన-కలరు మలప్ప
తనయడియని మడి-దక్కించు వేల్పు॥

150 నిత్యబుద్ధా :

కల, కూర్కు, మెలకువ-కడమ యనుకల
నాల్గు పగడలాగు-నడిపెడుయెఱుక
అడియరి కెఱుకవ-నలరించు వేల్పు॥

151 నిరవద్యా :

దోసంగు లెవ్వియులేక-తులకించువేల్పు
తనడింగరునకు బి-స్త నడపుజేజె॥

152 నిరంతరా :

అంతట న్నిండారు-నాగట్టుపట్టి
ఏవె_ల్తియు న్లేని-దేమలపిల్ల
కలదు పగడము మా-కరువతోల్బ్యాలు
ఎడముగానక నిండి-మెలలారు వేల్పు
డింగరు లెల్వి నిం-డించెడి జేజె॥

153 నిష్కారణా :

తనకుఁ గతములేక-తవరారుతల్లి
కతనకక్క-అ పుగు-గట్టాఁడు పడుచు
ఓజమైఁ దనపుంత-నొదవినపిల్ల
ఏజోలి గొనకెప్పు-డెలరారు వేల్పు
వరవు డబ్బాటుగా-పఅలించు జేజె॥

154 నిష్కలంకా :

ఏమఅకయు లేని-దేకన్నతల్లి
కొలువుకాసికిడాఁగు-కొల్పని జేజె॥

155 నిరుపాధిః :

అనయము న్దనయంత-నలరారు వేల్పు
ఏయూపరాగొన-దేగట్టుపట్టి
తాఁ దనవ, రవయు-తనరారు జేజె॥

156 నిరీశ్వరా :

ఏలిక తనకు లే-కెలరారువేల్పు
తనడింగరీంౢడ నం-దరి నేలు జేజె.

157 నీరాగా :

ఏ కోరికలు లేని-జేమలపిల్ల
అన్నికోర్కెల నీడేర్చు-కన్నతల్లి
కోరిక లెవ్వియు-న్గోరనిపడుచు
కొల్చువారలకుఁ గోర్కె లొసంగువేల్పు
నీళ్లు తిప్పయును దానే ఊగు జేజ॥

158 రాగమథనీ :

తగులెడపి మాగిటి-తనరించువేల్పు
కొల్చువారలకుఁ జిక్కులు మాన్పుజేజ॥

159 నిర్మదా :

లాహిరి గొనని మ-లదొర తొల్పాలు
అప్పసము న్దల్వ-నలరారుతల్లి
మెలఁకువ నడియరి-న్మెలఁగించుజేజ॥

160 మదనాశినీ :

బోడిక కీడుల-నోబ్బమాడ్చు వేల్పు
అడిబండల బడాయి-నడఁచుజెట్టి॥

161 నిశ్చింతా :

అడలేదియున్లేని-దాగట్టుపట్టి
అడియని తుందుడు-కడఁగార్చువేల్పు॥

162 నిరహంకారా :

ఏకావరముగాన-కేపారు పడుచు
కొల్వ్యాకాంద్ర కదటు-గొల్పనివేల్పు
తన్నుఁ దా మఱచి యొం-తయు నొప్పుజేజ.

163 నిర్మోహా :

వలపులే కలరు నా-వలిమలపిల్ల
అడియరి తగులాట-మూపెడిజేజె.

164 మోహనాశినీ :

అడియరి మఱకువ-నడంగించు వేల్పు
అడియని కెఱుకువ-నలరించుజేజె॥

165 : నిర్మమా :

నేను నాదనకొప్పు-నిడుగట్టుపట్టి
వేఱుపాటెఱుగని-వెలిదొరరాణి
అంతయున్నానయ్యె-యలరారువేల్పు
నివ్వాఱ సుంతయు-న్లేని మలప్పు

166 మమతాహంత్రీ

ఏను నాదను తిము-రెడలించువేల్పు
అడియని మెఱుంగమి-నణంచెడి జేజె॥

167 నిష్పాపా

ఎగ్గుసుంతయులేని-డేగట్టుపట్టి
అడియర్ల కీడెల్ల-నణంగించువేల్పు॥

168 పాపనాశనీ

తీంపురవులుడుపు-తిప్పతొల్పాలు
పాడెగట్టులనెల్లం-బరిమార్చునెల్లి

169 నిష్క్రోధా

అలుక తొఱంగిన-దా మలబిడ్డ
ఖోడికకు న్గినక-పోంగొట్టువేల్పు

170 క్రోధశమనీ

కోల్పు గూడని యలు-కువమాన్పు తల్లి
కొఱకొఱవడఁగించు-గుబ్బలిపట్టి
అడియనికి న్దాయి-యటుతోఁచు వేల్పు
తనలెంకపగఅనం-దఱఁగూల్పుపోలి
అడియరి తప్పుల-కలుగని శేజె॥

171 నిర్లోభా

కాదడియరిబేసి-కంటి పెండ్లాము
బోడికన్నీడు పరి-న్పొనరించు వేల్పు॥

172 లోభనాశనీ

అడియరి కకూ-ర్తి-నడఁగించు వేల్పు
బోడికకు విడుపు-పొదలించు శేజె॥

173 నిస్సంశయా

అఱమఱన్గనక న-యమలగు వేల్పు
అడియని నివ్వెర-నడఁగించు శేజె॥

174 సంశయఘ్నీ

అడియరిమెదమదు-గడఁ గార్పు వేల్పు
కలదు నిక్క-ముగ ము-క్కంటి వెలంది

175 నిర్భవా

పుట్టుకలేని దా-ముక్కంటి వెలఁది
అడియని వాలాయ-ములరించు వేల్పు

176 భవనాశనీ

బోడిక జంజాట-మున్దుల్పు వేల్పు
పెంద్రోవ నిడు నేటి-పేరిటిశేజె

నెలతొమ్మిదవనాడు-నెయ్యితోఁ దనకు
గుర్తింకొవర్పడి డింగ-రు న్గాచునంట॥

177 నిర్వికల్పా

అంతయు న్దానెయై-యలరారు తెలివి
తనకు వేఱరయక-తనరారువేల్పు
తేబరంబుగఁ దోచు-లేగట్టుపట్టి॥

178 నిరాబాధా

అప్పసము న్నిక్క-మైన యెఱుకవ
ఇసుమంతయు న్దొర్పు-డెనయని దినుసు
అందరి మన్నన-లందెడి తల్లి॥

179 నిర్భేదా

వేఱుపాటెఱుఁగదు-వెలిదొరరాణి
అడియరికి న్దన-కఱలేని వేల్పు॥

180 భేదనాశనీ

నేను పైవారల-నెడు నొడుదొడుకు
నెడఁబాపి పెంద్రోవ-నిడుగట్టుపట్టి
ప్రాఁతకందటి పొత్తు-వఱలించు వేల్పు॥

181 నిర్నాశా

పోకడయెన్నఁడు-న్బొరయని వేల్పు
అడియరి నప్పన-మలరించు జేజె॥

182 మృత్యుమథనీ

తన డింగరికిఁ దుది-తప్పించువేల్పు
నీడు కోల్మగాడ-బిద్దించు జెట్టి॥

183 నిష్క్రియా

ఏపనియున్నల్పు–కెలరారు తెల్పి
మంచిచెడ్డలు రెండు–మానినయెఱుక॥
అడియని నృగడలా–గలరించు వేల్పు॥

184 నిష్పరిగ్రహా

పెండ్లి కాని ముగిత–పెలిదొరరాణి
ఇకుచె కాని కొనుట–యెఱుఁగనితల్లి
కొలుచు వారలకుఁ గోర్కులు తీర్పువేల్పు॥
అంతయు స్థానియా–నానిండు తెల్పి॥

185 నిస్తులా

ఎనయెక్కువ ల్తన–కెఱుఁగని వేల్పు
వరవుల స్దనవలె–వఱలించు జేజె॥

186 నీలచికురా

నల్లని ముంగురు–ల్నలువారు పడుచు
కప్పుమింటిన్గొప్పు–గాఁ దాల్పువేల్పు
పగడలా గనయము–వఱలెడి జేజె॥
వాలెమడియనిక్కి–బరువ మొసంగు

187 నిరపాయా

ఏయపాంత్రముఁగాన–కేపారుపడుచు
ఎన్నటికైనఁ జే–టెఱుఁగని వేల్పు
హాయిగా డింగరు–నలరించు జేజె॥

188 నిరత్యయా

హెచ్చుతగ్గులుఁగన–కింపారుతల్లి
పగడలా గప్పడు–న్వఱలెడి వేల్పు

చేటు లేకెన్నఁడు-నజలువారు పడుచు
తనడింగరికి ముప్పు-తప్పించు జేజె॥

189 దుర్లభా

పొంద వీల్కాని దా-పువ్వారుఁబోడి
డింగరు నదనలో వ-డి నల్లువేల్పు॥

190 దుర్గమా

ఒంటికానికిఁ దప్ప-నొడఁబడనిదని
తరచుగా నేరికి-నదక్క-దావేల్పు॥
అరయఁదరము కాని-దాగట్టుపట్టి
బాగెముకలవారి-పాలగు జేజె॥

191 దుర్గా

ఇడుమలోర్చినవారి-కే చిక్కు-వేల్పు
ఎప్పటికి నద్దమ్మి-దేండ్లయీడు చెలి
సమరతపర్వు ము-చ్చటలూరు పడుచు
కాల్గొ్రిక్కు-కాని ము-గతి పెట్టబొట్టె
మగవానినెఱుఁగదా-మఱదొరపిల్ల
ఆద, సేత, నుడుల-కందని యంతు
అల్మగల్లానయా-నాగట్టుపట్టి
వరపుఁ గోటవలె గా-పాడెడు వేల్పు॥

192 దుఃఖహంత్రీ

అడియరి నగచాట్ల-నణఁగార్చు వేల్పు
బంజాటమున్నాన్చు-ఁజలిమలపిల్ల॥

193 సుఖప్రదా

బోడికకెల్ల యి-మ్మౌలొసంగు వేల్పు
వసతుల కెల్లఁదా-వలముమ్మలప్పు॥

194 దుష్టదూరా

ఆకతాయులకు ద-వ్వాగట్టుపట్టి
వదరుఁబోతుల నెడఁ-బాపెడు వేల్పు॥

195 దురాచారశమనీ

డింగరు చెడునడ్వ-డిద్దిద్దు చేసె
నాలిముచ్చు పొగర-ణంచెడు వేల్పు॥

169 దోషవర్జితా

పగయుఁ గూరిమిలేని-వలిమలపిల్ల
ఏజోలికి నోర్చవ-కెలరారు నైజుక
వరవుకీడుల నెడఁ-బాపెడి వేల్పు।

197 సర్వజ్ఞా

అంతయు న్దెలిసిన-దాఁగట్టుపట్టి
బోడికకెల్ల తెల్వులలర్చు వేల్పు॥

198 సాంద్రకరుణా

గొప్పకనికరము-కుప్ప మలప్ప
నెవరుమైడింగరు-న్దిలకించు వేల్పు॥

199 సమానాధికవర్జితా

తనకీడుగాని సుం-తయు నేటుగానిఁ
గన కెప్పటికలరు-గట్రేనిపిల్ల
వరవునందఱి నెత్తి-పై నుంచు వేల్పు॥

200 సర్వశక్తిమయీ

ఎల్ల వేల్పుల చేవ-యే గట్టుపట్టి
బోడికకన్ని లా-వులలర్చు చేత॥

201 సర్వమంగళా

ఎల్ల మేలుల నిలు-వే గట్టుపట్టి
అడియని కెపుడు ల-గ్గలరించు వేల్పు॥

202 సద్గతిప్రదా

తనడింగరీం డ కెం-తయు మంచిత్రోవ
నొసంగడి వెలితిప్ప-యొడయనిరాణి
జాలిగుండెకు లగ్గొ-సంగడు వేల్పు

203 సర్వేశ్వరీ

అంతటికేలిక-యాగట్టుపట్టి
ఎల్లరి న్వరపుచే-నేలించు వేల్పు

204 సర్వమయీ

అంతయు న్దానెయా-నాగట్టుపట్టి
నింగినేలల గుండ-నినెగడ్పు వేల్పు॥

205 సర్వమంత్రస్వరూపిణీ

ఎల్ల పల్కుల నిలు-వే మలపిల్ల
అన్ని మంతరముల-యుడపొడ వేల్పు॥

206 సర్వయంత్రాత్మికా

ఎల్లమఱల చెలు-వే మలపిల్ల
మందిపన్నికల న్నిట-న్మలయు వేల్పు
బొమ్మలం దూచముట్టు తాం-బొల్చు వేల్పు॥

207 సర్వతంత్రరూపా

చదువులన్నిటి నిల్వ-చలిమలపిల్ల
డింగరు మేల్నడ్వ-డియులవు వేల్పు॥

208 మనోన్మనీ

ఎఱుకవ చవిగ్రోలు-చెపుడొప్పు వేల్పు
సుచ్చునక్రిందఁగ-నొప్పుమలకు మీఁదఁ
గల యెన్మిదవ సుడి-న్గా)లెడి తెలివి
తిన్నగా నుల్లము-న్దిద్దెడు శేజ॥

209 మాహేశ్వరి

అనయము పెంద్రోప-నలరారు తెలివి
బీదకు ముగిలిల్చి నొసఁగుతల్లి
ముచ్చోటులేలెడు-ముక్కంటిరాణి
ఎల్లఁగానరికల్మి-నేలెడి వేల్పు
వరవునకుఁ బదవి-వఱలించు శేజ॥

210 మహాదేవీ

అందరి వేల్పుల-కన్నఁ గవ్వాకు
నెలచూలితల్లి వె-న్నెలతేనెరాణి
తనడింగరీని బె-ద్దనసల్పు వేల్పు।
తోల్దాల్పు దాతోడ-న్దులకించు ముగతి।

211 మహాలక్ష్మి

హద్దుమీఱినకల్మి-నలరారుతల్లి
ఎల పదుమూడేండ్ల -యీడుఖిటారి.
తనడింగరునకుఁ బ-దవిఁగొల్పు వేల్పు।

212 మృడప్రియా

కడుక్టబుల్ప్రొసఁగు వేడి-కంటియిల్లాలు
డింగరీనికి హాయి-డెక్కల్పు వేల్పు।

213 మహారూపా

ఎంతయో సొగసైన-దేగట్టుపట్టి
పెంద్రోవ యడపొడ-వెలిదొరరాణి
నాల్గునిల్వ్యలలోన-నయము మెలప్ప
వరవుని చెల్వ్యన-వరలెడు వేల్పు

214 మహాపూజ్యా

ముగురు వేలుపుల వే-ల్పుడులందు కేజె
వరవునకందఱి-స్వ్యంగించు వేల్పు॥

215 మహాపాతకనాశనీ

అయగారియిల్లాలి-నంటుట, పాలుఁ
గూల్చుట, కోపుత్రా-గుట, జుందనంబు
దొంగిలు టీ నాల్గు-దోసఁగు లోనర్చు
వెంబరవిత్తుల-వెంటఁదిరుగుట
యనెడు నైదైవుల-నతిఁగార్చుఁదన్ను
దలఁచు డింగరులకె-ంతయు గట్టుపట్టి॥

216 మహామాయా

ఎవ్వరెఱుఁగ నేర-రే తల్లి గుట్టు
తనమలోఁబర్చు నెం-తటివారినైన
మిక్కిలిగొప్ప బూ-మియ గట్టుపట్టి॥
పారిజాలి మబ్బువు-వ్వ్యలవెల్లి వేల్పు

217 మహాసత్త్వా

మిక్కిలి యలవుమై-మించెడి శేజె
డింగరీనికిఁ జేవ-డెక్కల్పు వేల్పు॥

218 మహాశక్తిః

మిగులఁ జేవనలరు-మెట్టాడుపడుచు
డింగరీని కలవు-డీకొల్పు వేల్పు॥

219 మహారతిః

ఒంటికానిఁదగులు-నొయ్యారి పడుచు
కూటమిహాయి నె-క్కొ-వసల్పు వేల్పు॥
డింగరు న్దనవెంబ-డి న్దిప్పు జేజ॥

220 మహాభోగా

అందతి కొల్పందు-నాగట్టుపట్టి
బోడిక కెల్లయి-మ్మలలర్పు వేల్పు॥

221 మహైశ్వర్యా

గొప్ప కలిమినేలు-గుబ్బలిపట్టి
వరపులసాదరు-వఱలించు వేల్పు॥

222 మహావీర్యా

మిగులఁ జేవనలరు-మెట్టాఁడు పడుచు
డింగరీంద్రకు మగం-టిమి పెంచు వేల్పు॥

223 మహాబలా

గొప్పలా వెసఁగెడు-గుబ్బలిపట్టి
ఎట్టపోగులఁ బెక్కు-లేలెడి వేల్పు
అడియరులకు మేటి-యులవిడు జేజ॥

224 మహాబుద్ధిః

గొప్పకఱద నొప్పు-గుబ్బలిపట్టి
వరవుల కెఱుకవ-వఱలించు వేల్పు॥

225 మహాసిద్ధిః

ఎనిమిది కల్మల-నెసఁగెడి వేల్పు
డింగరుకోర్కు- లీ-డేర్చెడు జేజ॥

226 మహాయోగిశ్వరేశ్వరి

మువ్వేలుపుల నేలుఁ-బోగట్టుపట్టి
డింగరీంద్రకుఁ దన-టీకిడు వేల్పు॥

227 మహాతంత్రా

గొప్పచదువు నిల్వ-గుబ్బలిపట్టి
పెంద్రోవ యడపొడ-వెలిదొరరాణి
అన్ని నేరుపుల డి-యునికిడు వేల్పు॥

228 మహామంత్రా

పదునాఱు వ్రాలఁగ-న్పట్టు మంతరము
వల్లింప నగపట్టు-వలిగట్టుపట్టి
ఏడులెక్క-డు బుజ-లీరైదు చేర్ప
మొత్తమామంతన-ముల నిల్వ వేల్పు
డింగరు మొ్రక్కు-బ-డి న్బొల్పు జేజ॥

229 మహాయంత్రా

ముగ్గొయ్య బొమ్మయా-ముద్దులగుమ్మ
బోడిక పంచాణ-మున కచ్చుచచ్చు
అన్నిపనులనేర్పు-నచ్చాళి వేల్పు॥

230 మహాసనా

గొప్పకుర్చిమీఁదఁ- గూర్చున్నయవ్వ
నింగినేలలగద్దె-నెలకొన్న జేజ॥
పరపు నందఱనెత్తి-పై నిల్పువేల్పు॥

231 మహాయాగక్రమారాధ్యా

అణువదిపై నాలు–గంగులఁ జెలఁగు
వేలిమికై కొను–వెలిదొరరాణి
డింగరీఁడు సలిపె–డి పలుతెఱఁగుల
మ్రొక్కుల కెల్లను–పొంగెడువేల్పు॥

232 మహాభైరవపూజితా

నింగినేలలు తెగ–నిల్చు ముక్కంటి
చాగుబడికఁగొను–చలిమలపిల్ల
కోర్కులుడిగిన బీదలు–గొల్చువేల్పు
వరవులవేల్పు డ–ప్పసమందు జేజె॥

233 మహేశ్వర మహాకల్పమహాతాండవసాక్షిణీ

నింగినేల లివి బ్రమం–దించిచిందాడు
బేసికంటి కెల యా–వెలిదొరాణి
డింగరు వేడ్కనా–డించెడి వేల్పు॥

234 మహాకామేశమహిషీ

వాఁకతాలుపు రాణి–చలిమలపిల్ల
ఎల్లరి న్వరవుచే–నేలించు వేల్పు॥

235 మహాత్రిపురసుందరీ

మూఁడువీడుల నేలు–ముద్దులగుమ్మ॥
తమ్మిపుట్టువు, తఱి–దాల్పు ముక్కంటి
ముగురువేల్పుల యడ–పొడగట్టు పట్టి
డింగరీనికిఁదన–టీకిడు జేజె॥

236 చతుష్షష్ట్యుపచారాఢ్యా

అఱువదుడ్గ కొలువు-లందెడు వేల్పు
ఎల్లరి కోరికె-లీడేర్చు తల్లి
చాగుబడిక లెల్ల -జరిపించు పిల్ల
అన్నివేల్పుడు లని-ల్వై యొప్పుపడుచు
ముక్కంటియడుఁగుల-పువులు దాలుచుట
బొందితో నుసురుపై-ప్పు వ్రగులుచుట
కొఱగానిదినుసు గ్రై-కొనక విడుచుట
గొప్పడింగరి కెర-గెడు లోనరుచుట
గట్టువిలుతు వహు-ల్కయి సేయుచుంట
నెలతాల్పు నిప్పుక-న్వేల్మి సలుపుట
శాశ్రేనికుల్లము-న్గాన్క నోవఁగుట
జింకతాల్పరి యంజ-చెమ్మఁగ్రై కొంట
యీఎన్మిది కొలువు-లేలెడు జేజ॥

237 చతుష్షష్టికళామయీ : గొలుసుసీసము సీసము దండ.

మున్పటియబుసు, కే-ల్బుడు సల్పుపడికట్టు
వవాపని క్రై సేత-వాలకంబు
పాట, మాటల కూర్పు-వలపించు నేర్పు నె
త్రంబూరి పల్కు, వ్రాఁత నెఱివ్రాయ
సముజోలి, వివరము-సలుపుట. పలుకఱ
తల వంచతూరి నె-క్కొలుపు కఱద
ముకూ్కవిరి న్బట్టి-ముందుచెప్పుట, వల
నుగనుట, క్రై గీఁత-నొడవుపూస
గుఱితేరునడ, గఁడే-న్గుమెలపు, జెట్టిప
నకువ, వంట, యొరుపు-రకము వెఱవు

తావి నరచుర్మి, పాఁ-తలు, తడికాక చె
దను తెల్పు, నీళ్ళల-యరయిక తెలు
యులుఁగు, జాలు, యీ-షరి కట్టువనువు, లోఁ
గొంట. లాగుట, చొక్కుఁ-గొలువుట, పగ
పెంచుట, తూల్పు, టీ-ల్గించుట తజివాఖ్పు
పై బొఁది లోఁజొర-పడుట, పాద
కోళ్లఁగోరునెడ క-ర్గుట, యాడినటగుట,
గుడివాసి, కనుకట్టు-గొప్పకాట్క
కను మొలఁగుట, కు త్తు-కన్నెలు పెట్టుట
మణితాల్పు, తామె త్తు-మందు వేరు
కట్టెడు మేలు, దొం-గల గుత్తు పట్టుట
జాతర్మవ్రాయుట, యచ్చు-పోతజాలు
తొలుచుట, పారికుం-డులు వానునలువు కొ
య్యాలు చెక్కుట వెదుళ్ళ-యల్లి కపస
చట్టపంచాణము,-బట్టలు నేయుట,
మాయమగుట, తాల్పు-మార్పువేఁట
బేరమాడుట, కొడుకుల-న్బొంచుకొనుట
సేద్యము న్బొనరించుట-సీవి, రొడ్డు
లీ యెనిమిదెన్మదుల- తీర్ల-కెల్లనులువు
చదువులం దారితేరిన-చట్టుపట్టి॥

238 మహాచతుష్షష్టికోటియోగినీగణసేవితా
అడ్డవే తొంబది-యాఱెట్టపోగుల
గములు గొల్వఁదనరు-గట్టుపట్టి
కోటానకోట్ల వాఁ-గులనేలు, వేల్పు
అందకుండు న్లెక్క-కాయప్ప మొనలు
తనవెంగరుసకు మ-ద్దత్తగుకేజ॥

239 మనువిద్యా

పన్నెండ్రు పెద్దలు-వల్లించు చదువు
అనఘుఁడు పంచదశ-యుం డొప్ప తెల్పి
తనడింగరునకుఁ బ-దవి నిడు వేల్పు॥

240 చంద్రవిద్యా

జాబిలి తొలుతను చదివినబడిని
నిండు వెన్నెలహాయి-నెగడించుతాయి
ఎల్లరికి న్మంచి-యే మప్పు వేల్పు
మొక్కు-వారల డెంద-ము లలర్పఁజేసె॥

241 చంద్రమండలమధ్యగా

చవినించు నిరవొంది-జాబిలినడిమి
ఎల్లయిమ్ములకుఁ బు-ట్టినిల్లగు వేల్పు
నిండు నెలనడుమ-నెగడెడుపాప
అనఘుడు న్బాంటనేల ని-ల్పాయినపిల్ల
పంట పైరుల దొలనిగ్గు-పట్టుజేసె॥

242 చారురూపా

ఒయ్యారమౌ వడ-నొప్పారుపిల్ల
నిలువెల్ల మంచిగా-నెగడెడుతల్లి
హాయియౌ చూడపొడ-యగుగట్టుపట్టి
అడియరికి న్సొగ-సలరించు వేల్పు॥

243 చారుహాసా

చిఱునగ వొప్పారు-చిన్నారిపడుచు
సొగసైన నవ్వు పొ-ల్పు నలరుఁబోడి
డింగరీని కెలనా-టికిడు వేల్పు

244 చారుచంద్రకళాధరా

నెలవంపు దాగిడి-న్జాలువారు పడుచు
చల్లనిచూపు లె-సంగెడితల్లి
అడియరి బాసట-యౌ వేల్పుమిన్న.

245 చరాచరజగన్నాథా

నింగినేలల నేలు-నిడుగట్టుపట్టి
అడియరి కేల్బడి-నలరించు వేల్పు॥

246 చక్రరాజనికేతనా

నుచ్చన సుడిలోన-నూల్కొను వేల్పు
అడియరి డెందము-నలరించుతల్లి
తొమ్మిదిగిఱులఱుందున నొప్పు శేజె
నిండాగు తన్వాపై-నగడెడు పడుచు॥

247 పార్వతీ

చలిమలతొలుచూలు-సామికిదల్లి
ఎల్లడింగరుల గట్టెక్కించు వేల్పు॥

248 పద్మనయనా

పొందమ్మి చూపుల-ముక్కంటివెలంది
చల్లనిచూడ్కు లె-సంగు నల్లపిల్ల
అడియరుల న్గూర్మి-నారయు వేల్పు॥

249 పద్మరాగసమప్రభా

తమ్మిరాయి తళుకు-తనరెడు పడుచు
అడియరి నర్మిలి-నరసెడు వేల్పు॥

250 పంచప్రేతాసనాసీనా

నకనకలాడెడు-నడబడు తాత
తేవురస్థురిచీల-నెక్కెడు వేల్పు
కదలనిపదవి కిం-గురునుంచు తేజ॥

251 పంచబ్రహ్మస్వరూపిణీ

ఐదుగుర్తాతల-యడపొడ వేల్పు॥
యడియర్ల నిలువుల-నలరెడు తేజ॥

252 చిన్మయీ

ఎఱుకయంతయుదా నయి-మెఱయు పడుచు
అప్పస మగపడీ-యగపడని జిగి
తనకెడ కడలేక-తగుగట్టుపట్టి
తగు గుండనికిఁ గఱ-దయలర్చు వేల్పు॥

253 పరమానందా

మెలకువ, కల, కూర్కు-మించిమిగిలిన
నాల్గవయునికిదై-నలువారు తెలివి
అనయము న్దనుపుమై-నలరెడు తల్లి
అడియ కెల్లప్పుడి-మ్ములరించు వేల్పు॥

254 విజ్ఞానఘనరూపిణీ

ఎల్లపనుల నేరు-పే గట్టుపట్టి
అడియక న్బని పస-యలరించు వేల్పు॥

255 ధ్యానధ్యాతృధ్యేయరూపా

తలపు, తలచువాఁడు,-తలపఁబడునది
యీమూఁటి నిల్వై తా-నేయగు వేల్పు
తనడింగరీని చం-దమలరు తేజ॥

256 ధర్మాధర్మవివర్జితా

కట్టువిడుపు గలు-గని గట్టుపట్టి
మంచిచెడ్డలు రెండు-మాన్పించు నెఱుక
ఆడియారి స్వంద్రోవ-వలరించు వేల్పు॥

257 విశ్వరూపా

నింగినేలల నిల్వ-నిడుగట్టుపట్టి
అన్నిదిన్నుల నడి-యునలర్పు వేల్పు॥

258 జాగరిణీ

ఎప్పుడు న్మెలఁకువ-నెసఁగెడు పడుచు
అప్పసంబడియాని-కగపడుతల్లి
అనయంబు తన్నుఁదా-వరసెడు తెల్వి
తనకు వేఱెఱుఁగక-తనరెడు వేల్పు
నమ్మినవారి నెం-తయుఁగాచు జేజె
ఎన్నఁడైన న్బరా-కెనయని యేల్క॥

259 స్వపన్తీ

తనకనుకల కెల-కానెయా పిల్ల
కనుకుచుండియు మేలు-కొనుగట్టుపట్టి
అడియ కెఱుక, నన-యుంబిడు వేల్పు॥

260 తైజసాత్మికా

తల, పాద, యాసుకుల-స్దానమ్ము జేజె
తనువు, కూరుకు, కల-స్దానమ్ము జేజె
అమ్మపురిని యడి-యున్నల్పు వేల్పు

261 సుప్తా

కూర్కెడు నట్టుండు-గుబ్బలిపట్టి
హాయి-కూరుకు నడియకు-నిచ్చు వేల్పు॥

262 ప్రాజ్ఞాత్మికా

కూరుకు న్గను నెఱు-కువ గట్టుపట్టి
అడియకెఱుక, యన-యుంబిడు వేల్పు॥

263 తుర్యా

మెలకువ, కల, కూర్కు-మీఱినయెఱుక
యాదియొవాల్గ వయుని-కాగట్టుపట్టి
తనకు వేఱెఱుఁగక-తనరారు వేల్పు
ఎల్లడ్డ్వా తన్వైమై-నెసఁగెడుతల్లి
తనయొడయని నిల్వ-కానెయా జేజె॥

264 సర్వావస్థావివర్జితా

ఈడులెల్లఁదొలఁగి-యేపారుతల్లి
తటికిలోఁబడకిప్డు-తనరారు వేల్పు
అడియరి స్వంద్రోవ-నలరించు జేజె॥

265 సృష్టికర్త్రీ

నింగినేలలఁ బన్ను-నిడుగట్టుపట్టి
అడియకెల్ల పనుల-జూరువిడు వేల్పు॥

266 బ్రహ్మరూపా

తమ్మిచూలి నెలవు-తనరారు వేల్పు
నింగి నేలలకండ-నిడుగట్టుపట్టి
అడియనిఁ దాతగా-నలరించు జేజె॥

267 గోప్త్రీ

కొల్చెడు నడియర్ల-కొత్కాలిడేర్పు
తగువారి ననయము-న్దనుపుమలప్ప

నింగినేలలపాయి-నెగడించు వేల్పు
కొలువుకానిన్మఱిం-గునఁ గాచుతేజ।

268 గోవిందరూపిణీ

ఆడుగుచెమ్మటలాని-చూడపాడతేజ
అన్నింటిలోని ని-గ్గాగట్టుపట్టి
అడియరి స్మంబిమా-టాడించు వేల్పు
నుడువుతేని నిలువు-నూల్కొను తల్లి।

269 సంహారిణీ

డింగరియిడుముల-న్డిందించు వేల్పు
నింగినేలలు మ్రింగి-నిగిడెడి వేల్పు

270 రుద్రరూపా

అడియరి వలఁకువ-లణఁగించు మందు
అడియకు మంచిగొం-తడరించు వేల్పు।

271 తిరోధానకరీ

అన్నిదిన్నులఁదన-యందు డిందించి
కొసకు దా మాయమా-గుబ్బలిపట్టి
తనునమ్మ బోని, యే-తరిమాపుమరిడి
వరవు నెదిరి తగ-పడనీని తేజ।

272 ఈశ్వరీ

వెల్బడి వలునోళ్ల-యేవురిలోన
నోర్పు, మే, ల్పైవల-నోజమించు దణి
అడియ విచ్చలవిడి-నాడించు వేల్పు
పాడిమై వరవుగా-పాడెడితేజ।

273 సదాశివా

అడియ కెప్పుడు మేలె-యదరించు వేల్పు
జాబిలి తాలుపే-చలిగట్టుపట్టి

274 అనుగ్రహదా

అడియకు మాయమా-నాస్తి మతియిచ్చు
గుండనికెల్ల కో-ర్కెలొసంగు వేల్పు॥

275 పంచకృత్యపరాయణా

పుట్టుట, పొదలుట,-పొరిపొరి మాయ
మగుట, యగపడుట-యర్మిలిగొనుట
మైదుపనులఁ దగు-లందెడు వేల్పు
కట్టువిడుపులఁ దాఁగోరి-నట్టులుండుఁ
గాఁగలదు తలంచు నల్లెల్ల-గట్టుపట్టి॥

276 భానుమండలమధ్యస్థా

తొగసూడు గుడినడి-న్దులకించు వేల్పు
అడియ నెండదొరలా-గలరించు జేజె॥

277 భైరవి

తిప్పకాయల నెల్లఁ-దెగ్రించుముత్యాలు
అతివలందరు తానె-యగా గట్టుపట్టి
డింగరున్గొప్పపా-డించెడు కేజె
ఈరాల్ల యేండ్లయి-డెసఁగు మలప్పు॥

278 భగమాలినీ

కలిమి, కడిమి, పేరు-కళుకు తెలుకువ
విడుపు తావళముల-వెలసెటి వేల్పు
గొప్పతనంబుల-కుప్పమలప్ప

ఒడికట్ల యడపొడ-నొప్పారు జేజె
అడియని కెల్లమే-ళ్ళలరించు తల్లి.

279 పద్మాసనా

తమ్మిగద్దెపైఁ గూర్చుండు-తలిరుఁబోఁడి
కొలుచువారలకు న్గల్మిఁ-గూర్చు వేల్పు
నంజాదు బిండ్ల న-ణంచెడి దణేము॥

280 భగవతీ

తనబోఁడికకు గొప్ప-తనమిచ్చు తల్లి
పుట్టుక, పొదలిక,-పోకడ, రాక
యెఱుకువ, మఱకువ-లేలెడు వేల్పు॥

281 పద్మనాభసహోదరీ

తమ్మిపొక్కిలి వాని-తగునాఁడుతోఁడు
మంచివారల గాచు-మలదొరపిల్ల
జొడ్డసలుఁబుట్టువు సుడిలోఁ-జొల్చు వేల్పు.

282 ఉన్మేషనిమిషోత్పన్నవిపన్న భువనావలిః

ఈనింగికి నేలలె-న్నియు ఱెప్ప
పాటులోఁబుట్టించి-పరిమార్చు వేల్పు
ఎల్లయున్దానయ్యు-నేదియున్గాక
కలికి పాడిగ నాడు-కొనుగట్టుపట్టి
అడియనిఁదనవలె-నలరించు జేజె॥

283 సహస్రశీర్షవదనా

తలలు మూతులు వేల-తరబడి నెసఁగ
నింగినేలల నెల్ల-నిండినవేల్పు।

284 సహస్రాక్షీ

వేయికన్నులలరు-వేల్పు సిరాజి
అడియంద్ర డెందము-లలమిన జేజె
అడియరి నంతయు-నరయించుతల్లి.

285 సహస్రపాత్

వేయికాళ్ళొప్పారు-వేలుపుమిన్న
రివ్వున వరవు గో-రిన యెడకెల్ల
వసతిగా నడిపెడు-వలిమలపిల్ల.

286 ఆబ్రహ్మకీటజననీ

తల్లియై తాతమొ-దలు పుర్వ్వాదరకుఁ
తెలియఁ దరముకాని-తే గట్టుపట్టి।
వరవులకెల్ల చే-వ లలర్చు వేల్పు।

287 వర్ణాశ్రమవిధాయినీ

తెగలనడతలు ది-ద్దెను గట్టుపట్టి
డింగరీంద్రఁదగన-ద్వంచెడి వేల్పు।

288 నిజాజ్ఞారూపనిగమా

చదువులపనుపులొ-చలిమలపిల్ల
అడియరి న్బద్దగా-నలరించు వేల్పు।

289 పుణ్యాపుణ్యఫలప్రదా

మంచిచెడ్డలకెల్ల-మాటిచ్చు వేల్పు
వరవెట్టులున్నగా-పాడెడు జేజె।

290 శ్రుతిసీమంతసింధూరీకృతపాదాబ్జధూళికా
తొలుచదువుల తల-ల్దొరగిల్లించు
నడుగుఁ దమ్ముల తుము-రదరించు వేల్పు
ప్రాఁబల్కుల న్బున్చు-వలిమలపిల్ల
డింగరునకుఁ దన-టీకిడు జేజె॥

291 సకలాగమసందోహ శుక్తిసంపుటమౌక్తికా
వేల్పుడు కట్టడ-న్వొలిపుచ్చు చదువు
నాలిచిప్పనలరు-నాణెమీసరము
మినుకులయడపొడ-మెట్టాఁడు పడుచు
నాల్గు తెగలవార-నయమెంచు వేల్పు॥

292 పురుషార్థప్రదా
పైడి, కూటమి తమి,-పాడిపెంద్రోవ
కొల్వుకాండ్రకు సమ-కూర్చుడు జేజె॥
ఏ తెగవారు-కానీ యెట్టులేనిఁ
దనకొల్వుసల్పునం-దతి నిల్పు వేల్పు॥

293 పూర్ణా
ఏవెత్తియు న్లేని-దే గట్టుపట్టి
నరుదులే కెప్పుడే-నఁగు నిండుకుండ
ఎవ్వరేమనుకొన-నీ యోర్పుముగిత
తన డింగరులకుఁ బ-దవి నించు వేల్పు॥

294 భోగినీ
వేల్పువారలఁదని-పెడు తెలిగంటు
పాడగట్టులమ్రింగు-పాపనీమాటి
అన్నిముచ్చటలన్దీర్చు-కొన్న పడుచు
తనడింగరున కిమ్ము-తనరించు వేల్పు॥

295 భువనేశ్వరీ

నింగినేలలకేల్క-నిదు గట్టుపట్టి
ఎల్లచోట్ల వరవు-నేలించు వేల్పు।

296 అంబికా

కల్లకు నికమున-కంతకున్దల్లి
కావంచ తప్పనె-దైన హులిక్కి-
అచ్చాళి కూరుకు-హోయియా వేల్పు
వరవులకున్మంచి-వటలించు జేజె॥

297 అనాదినిధనా

పుట్టుపున్గిట్టింపె-పుడయినఁగనని
పెంద్రోవ యడియకు-న్వోలయించు వేల్పు।

298 హరిబ్రహ్మేంద్ర సేవితా

కదలి యల్లుడు, కాత,-కతిగొల్పు వేల్పు
అడియనికందతి-కంటె నెక్క-వగు
పదవి నలర్చి కా-పాడెడు జేజె॥

299 నారాయణీ

కదుమిదుకుల కేదు-గద గట్టుపట్టి
నింగినేలలకుఁ దా-నే యూఁతకోల
ఎల్లయుసురులలో-నిరవారు వేల్పు
అడియని నిలువయి-యలరారు జేజె॥

300 నాదరూపా

నిక్క-మైన ఆపలి-నిలువైన వేల్పు
అన్ని దిన్నులకు ని-గ్గా గట్టుపట్టి
వరవుల హొయిగాఁ-ఖాడించు జేజె॥

301 నామరూపవివర్జితా

పే, రడపాడలేక-వెలిఁగెడు వేల్పు।
నింగినేలలుఁగాక-నెగడెడు తేజ
వరవుల గుట్టుకా-పాడెడితల్లి
అన్నిదినుసుల నిం-డారిన మొలక
అంతట నలరుని-గ్గా గట్టువట్టి।

302 హ్రీంకారి

ఈల చెలఁగించు-నే గ్గట్టుపట్టి
పుట్టించి, పొదలించి,-పోకార్చు వేల్పు
అడియకుఁ దగినసి-గ్గలరించు తేజ॥

303 హ్రీమతీ

ఈలువు, సిబ్బితి-నింపారు పడుచు
అడఁకువ సిగ్గడి-యుకలర్చు వేల్పు।

304 హృద్యా

మంచివారల గుండెల-న్మలయు వేల్పు
అడియరి కందతి-కంటె నెక్కు-వుగఁ
బదవి నలర్చి కా-పాడెడు తేజ
అందక త్తెల కెల్ల-యమ్మలపిల్ల।

305 హేయోపాదేయవర్జితా

పట్టు, విడుపురెండు-వదలిన మొలక
నిండుతన్వి నడియు-నికెడు వేల్పు।

306 రాజరాజార్చితా

ముక్కంటిచెలి వేలు-పుడు గొను తేజ

పయిడితేని కొలుపు-పాటించుతల్లి
డింగరు మైపసిం-డి న్నల్పు వేల్పు॥

307 రాజ్ఞీ

పట్టంపు దేవేరి-వలి మిట్టపట్టి
తవడింగరికి దొర-తనమిడు వేల్పు॥

308 రమ్యా

ఎంతయు నొనగ్సైన-దే కన్నతల్లి
నమ్మినవారి కం-దమలర్చు వేల్పు॥

309 రాజీవలోచనా

ఎఱుపు తెలుపు తమ్మి-మొలచూపు పడుచు
గొప్పకన్నులలగు-గుబ్బలిపట్టి
నెమ్మినెనరు చూడ్కి-నిగుడించు తల్లి
అడియరి న్మంచియే-యరయించు వేల్పు॥

310 రంజనీ

ముక్కంటి వలపించు-ముద్దులగుమ్మ
తవడింగరీని వం-తలు తొలగించి
కడుమంచి కావించి-కాపాడు వేల్పు॥

311 రమణీ

అడియరితోనాట-లాడెడి తల్లి
ముక్కంటి యిల్లాలు-ముద్దులగుమ్మ॥

312 రస్యా

నికరము దినుసుల-న్నిట గట్టుపట్టి
అడియనెంతో చలి-నాడించు వేల్పు॥

313 రణత్కింకిణిమేఖలా

మువ్వల యొడ్డాణ-మున్నాల్బు పడుచు
లెంక గుమ్మనిగంద-లిర్పించు వేల్బు॥

314 రమా

తల్లితల్లి నిలువు- తనరారు వేల్పు
అడియరిన్కల్మి నా-టాడించు కేల॥

315 రాకేందువదనా

నిండుజాబిలి మూతి-నిడుగట్టుపట్టి
అడియని నెలవలె-వలరించు వేల్బు॥

316 రతిరూపా

నెలయుల్లు నిల్లాలి-నిలువోవ్వు పడుచు
కనికర మారోప్పి-కలలరు తల్లి
పరవున కందమ్ము-వటులించు వేల్బు॥

317 రతిప్రియా

చేరిక మక్కు-వ-న్జాలంగెడు పడుచు
నమ్మినవారల-న్గాపాడుతల్లి
డింగరు న్గూటమి-న్దీకొల్బు వేల్బు॥

318 రక్షాకరీ

తనడింగరీంద్ర నం-దఱం గాచు వేల్బు
పరవు కావలిబొట్టు-వటులించు కేల॥

319 రాక్షసఘ్ని

నంజాడు దిండుల-నమలు కాబెత్తి
అడియరి పగరగీ-టడంచు మలప్బ॥

320 రామా

అడియరిడెంద-మం-దాటాడు వేల్పు॥
అందుదెల్ల న్దానె-యై యొప్పు శేశె॥

321 రమణలంపటా

పెనిమిటి నెన్నఁడు-న్విడువని ముగిత
ముక్కంటి పొందున-మురిసెడి పడుచు
బోడికకు న్గల్వ-బుల్విదు వేల్పు॥

322 కామ్యా

కలద యన్వారి పొందఁ-గలుగు పెంద్రోవ
మంచివారల పొత్తు-మరగెడు పడుచు
అడియరి డెందమం-దలరారు వెలుఁగు
తగువారలకుఁ గోరఁ-దగిన కూడుదల.

323 కామకలారూపా

కూటమిపోయినె-క్కొలువు లేఁబడుచు
లనకొండు లేదని-తలపించు వేల్పు
అన్నియు న్దానని-యనిపించు నెఱక
బోడిక కంటునే-ర్పు న్మప్పు శేశె॥

324 కదంబకుసుమప్రియా

వేల్పుచెట్టుసకును-వ్విభ్యారుపిల్ల
అడియని కిగ్రమా-నయి తోఁచు శేశె॥

325 కల్యాణీ

కాపాడి కడుమేలు-కావించు వేల్పు
వరవుల పోయిగాఁ-బల్కించు శేశె॥

326 జగతీకందా

నింగి నేలలకుఁ దా-నే తల్లివేరు
ఎల్ల దినుస్సుల-నెలరించు దూప
ఉసురుల కన్నింటి-కోజ పునాది
కొంచెమైన నోృబలు-కొనరాని రకము
అంతటికి న్గత-మాఁగట్టుపట్టి
డింగరు న్వాసిగ-డింపించు వేల్పు॥

327 కరుణారససాగరా

కనికరపున్నిగ్గు-కడలి మలప్ప
తనుగొల్పు వారలే-తానగు వేల్పు
అడియరులకెల్లఁ దనయొడ-లప్పగించి
వెలుఁగు పెంద్రోవ నిలువు శే-శేలమిన్న॥

328 కలావతీ

ఎటుకమైన నప్పస-మెలరారుపిల్ల
ఎల్ల జగ్గులకు ని-గ్గిడు గట్టుపట్టి
బోడల యాదలఁ-బొడచూపు జేజె
నేర్పు లర్వదినాల్గు-నెగడించు వేల్పు॥

329 కలాలాపా

చదువు లర్వదినాల్గు-చాటెడు పడుచు
విన్ను నేలల చెమ్మ-వినుతిప్ప టెంకి
ఉల్లమునకుఁ బ్రాచిపనియా-పిల్ల తలపు
ముసిముసినగవుల-ముద్దులగుమ్మ
తీయని మాటల-తీగియఁబోఁడి
కొల్పువారికిఁ కెంద్రోవ-గొల్పు వేల్పు॥

330 కాంతా

కలుకు నెంతో సోయ-గంబు లేఁబద్పు
కడమ తుట్టతుదకుఁ-గ్గైడుపోయి
అడియరి న్దనలోన-నలరించువేల్పు॥

331 కాదంబరీప్రియా

విరితేనె త్రాగ ను-వ్విళ్లూరు పడుచు
చెఱకు పానకమూను-చిలుకలకొలికి
తనకొండెఱుంగక-తనరారు వేల్పు
నాల్గవయున్కి-లో-నన్మించునెఱుక
తనబోడి కజ్జవి-ద్రావించుజేజె॥

332 వరదా

కొలుచు వారలకుఁ గో-ర్కు-లొసంగువేల్పు
ఐర్పు కొసయుటు నె-త్రిలరించుజేజె॥

333 వామనయనా

కనికర మెఱుక వా-ల్గన్నులతల్లి
బోడికకుఁ దగుచూ-పులలర్చువేల్పు॥

334 వారుణీమదవిహ్వలా

కోపు చొక్కు-నఁ దూగు-గుబ్బలిపిల్ల
మంచిలో వరవు మై-మఱపించువేల్పు॥

335 విశ్వాధికా

నింగి నేలలకంటె-నేమైన తల్లి
వరవు నందరికన్నఁ-బై నిల్పువేల్పు॥

336 వేదవేద్యా

చదువులవలనఁ బో-ల్చన్బడు వేల్పు
వంచబోడికకుఁ గ-న్బట్టెడు జేజె॥

337 వింధ్యాచలనివాసినీ

తలఁపు లేకున్న యా-దన్మించు తెల్వి
నాలుగుమ్కులకుఁ బై-నల్వారు నెఱుక
అడఁకువగలయుడి-యురినేలు జేజె
ఆకతాయుల పీచ-మడఁచెడి మరిడి॥

338 విధాత్రీ

వింగినేలలఁ బన్ని-నగడించుతల్లి
మంచిసలుపు చలి-మలదొరపిల్ల
అడియరి నైస్సమా-టాడించువేల్పు
ఉసురులఁ గాపాడు-నుసిరికమందు
బోడికయుడుకుతె-వుల్మాన్పు జేజె॥

339 వేదజననీ

నలుతోలుఁబలుకుల-న్గాంచినతల్లి
వరవు నెక్కువ చదు-వరిసల్పువేల్పు॥

340 విష్ణుమాయా

విన్ను నేలల నిండు-వేలుపుచేవ
అగపడి యగపడ-కాటాడుపాడి
కనఁటుల నటమటిం-చి తునుము వేల్పు॥

341 విలాసినీ

పెంద్రోవ జందాడు-వెలితిప్పటెంకి
డింగరీనికి మేటి-టేకిడు వేల్పు॥

342 క్షేత్రస్వరూపా

ఇరువది నాల్గు క-యిపు దినసులకు
నిలువయి యలరారు-నిడుగట్టుపట్టి
అడియరి తానయై-యడరెడి వేల్పు॥

343 క్షేత్రేశీ

మఱికెల్ల యేలిక-మలదొరపిల్ల
వరవునుసురొడ లె-ప్పటికేలు వేల్పు॥

344 క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ

అడియమిడొక-డలన-యమ్మేలు వేల్పు
తనకె దుర్గనక బీ-దలఁగాచు జేజె॥

345 క్షయవృద్ధి వినిర్ముక్తా

పెఱుగదు తఱుఁగదా-వేలుపుమిన్న॥
వంచలాగడియన-ప్పసమేలు జేజే॥

346 క్షేత్రపాలసమర్చితా

మైతాల్పు వేల్పుడు-నెమ్మికొల్పు వేల్పు॥
పంటకాఁపులఁ గొల్వఁ-బడెడుగొరప్ప॥

347 విజయా

తనడింగరీనినెంతయు గెలిపించు
మేటి మొరుపు నిల్వు-మెట్టాఁడు పడుచు
అడియకుఁబనినేరు-పలరించు వేల్పు

348 విమలా

మఱకుపలేనిది-మలదొరపిల్ల॥
అడియని మఱపొడ్పు-యరువిడు వేల్పు॥

349 వంద్యా

తరతరము ప్రొక్కఁదగుగట్టుపట్టి
మంచివారి పొగడ్త-మైకొల్పు వేల్పు॥

350 వందారుజనవత్సలా

ఎఱఁగుమంది న్నెమ్మి-నేలెడు తల్లి
బోడికి న్గూర్మిమైఁ-బ్రోచెడి వేల్పు॥

351 వాగ్వాదినీ

మాటపెనుపు నిల్వు-మలదొరపిల్ల
డింగరున్బనకువ-న్దికొల్పు వేల్పు॥

352 వామకేశీ

ముక్కంటి యిల్లాలు-పొగట్టుపట్టి
కొనియాడఁదగు గొప్ప-కొప్పు సీమాటి
అందమాతల యడి-యకలర్చు వేల్పు॥

353 వహ్నిమండలవాసినీ

నిప్పుకుప్ప నడుమ-నెగడు మలప్ప
తొలిగిరి మైర్పున-దులకించు వేల్పు
నెల, యెండదొర, డిగ్గి-నెక్కను తేజె
అడియదెండము మింట-నలరారు నిగ్గు॥

354 భక్తిమత్కల్పలతికా

బోడికపాల జా-ల్మొలక మలప్ప
అడియునమ్మకము నిం-డారించు వేల్పు॥

355 పశుపాశవిమోచనీ

మఱకువన్జిక్కిన-మైకొల్పులెల్లఁ
దొడుకులే వారినం-తొబుజ్జగించి॥

బిగువుకల్లగలించి-పెంద్రోవ నడుపు
మిక్కిలి నెవరైన-మెట్టాఁడు పడుచు
అడియరి యిక్కట్టు-లాఁచెడి వేల్పు॥

356 సంహృతాశేషపాషండా

ఇరుగుపొరుగువారి-నేఁచుతుంటరుల
మట్టిమల్లార్పు వే-మూర్బెనుమారి
పెద్దలనడతకుఁ-బెడఁబడి మినుకు
లాడు టాటోటుల-నణఁచెడి మరిడి॥

357 సదాచారప్రవర్తికా

పెద్దలనడువడి-న్నేలయించు తల్లి
మంచినడత మప్పు-మలదొరపిల్ల
కనికరమెల్లైన-న్గన్బర్పు వేల్పు॥

358 తాపత్రయాగ్నిసంతప్త సమాహ్లాదన చంద్రికా

ఉల్లము మెరమెర-లాడలి తెవుళ్ళ
పిడ్గుపాటులు దొట్టి-పిమ్మట లూర్మడు
రకములవంతల-న్గాగ్రిగడు మంచి
వారికి వెన్నెల-వలెఁ గడుహాయి
వాలాయ మొసఁగించు-వలిగట్టుపట్టి
వరవుల కిమ్ములు-న్వాఅలించు వేల్పు॥

359 తరుణీ

లేయీడుదగ్గిలిన-లేమ మేల్బంతి
పదియు నాఱేండ్ల గు-బ్బలిదొరపిల్ల
అప్పనము న్బడు-చొగట్టుపట్టి
అడియరి నెప్పటి-కలరించు తల్లి॥

చిన్నారిపొన్నారి-చిరుత యొయ్యారి
ఎన్నడు న్పగడలా-గేయొప్పు పాప
తననిల్వ ముగితిగాఁ-దనరారు వేల్పు॥

360 తాపసారాధ్యా

కారులోఁ దిరిదాల్చి-కాఁక సలిపెడు
కావితాలువుఁ గొల్చు-గట్టాఁడు వడుచు
ఇరుగుపొరుగు వారి-కెప్పుడు న్మేలె
పొనరించువానివే-ల్పుడుగాను వేల్పు॥

361 తనుమధ్యా

గుప్పెడు కేఁగాను-కొమరారు జేజ
లలినడుఅవలిలీ-లన్బల్కు పడుచు
ఆటపాటలమేటి-యావిన్మటాకి
డింగరు జ్జిందులా-డించెడి వేల్పు॥

362 తమోపహా

అడియని మఱుకువ-నణఁగించి మెల్ల
కీడులమాన్పి ము-గిలినిడు వేల్పు
కొలుచువారల కెఱు-కువపెంచు జేజ॥

363 చితిః

ఎల మాఁజకెన్నఁడు-న్జాలఁగెడు తెల్వి
నింగినేలలకుఁ దా-నేపట్టుఁగొమ్మ
అనయమొదిరిఁ గాన-కలరెడి పడుచు
ఎల్ల యొడళ్ళఁ గ్రి-క్కిఆసిన యూసురు
అడియరి కెఱుకువ-నలరించు వేల్పు॥

364 తత్పదలక్ష్యార్థా

అద్దినీవగుచుంటి-వను సూఁడుసుమల
నీవనఁగరి, యది-యేకతమగుచు
నుంటివనెడు పలు-కుండు నా రెంటి
కతుకద్ది యానిక్క-మగుగట్టుపట్టి
తఱింగినేల లి-వెల్ల యున్నల్ల
తెలుపఁ దరముకాని-దే నల్లపిల్ల॥

365 చిదేకరసరూపిణీ

నిండారు వేడుక-నిలువైన పదుచు
తనయుకియారి నెవ్వ-తనియించుతల్లి॥

366 స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానందసంతతిః

తమ్మిచూలొమ్మదలు చ-దలకాఁపులెల్లఁ
బొందెడి బరవస-ము తనతనర్పు
నందులివైనఁగా-కలరెడు వేల్పు
అడియని కెపుడు త-న్పలరించు తేజ॥

367 పరా

అన్నిదిక్కుల వెలుపల-నలరు తెలివి
బొడ్డులోన, నావయిడెంద-మున, మెడమెడఁ
పలు తెఱంగుల వె-ల్వడు పల్కు-నిల్వ
వరవులన్నాయిగాఁ-బలికించు వేల్పు॥

368 ప్రత్యక్చితీరూపా

ఎలనిలువలరారు-నింతిసిరాజి
పెంద్రోవ పనిముట్టు-వెలితిప్ప టెంకి
వరవునకు ముగితి-వఱలించు వేల్పు॥

369 పశ్యన్తీ

బొడ్డుపెనుడి వినఁ-బోవని ఆవలి
తనలోనఁదాన యం-తయుఁగను వేల్పు
అడియరి న్హాయిగా-నలరించు జేజె।

370 పరదేవతా

మినుకు తెరువర్లకెల్లఁ దా-మేలుబంతి
అడియ వేడుక నోల-లాడించు వేల్పు।

371 మధ్యమా

నింగి నేలలనడి-న్జెలువారు వేల్పు
కల్మిలేముల నడ్మఁ-గ్రాలెడు జేజె
నిక్క-ముకల్ల రెం-టికి నట్టనడుము
నడిమిఅవలినుడి-న్బలికెడునులివు
సగటుగా నందతి-న్వాసకెడుతల్లి।

372 వైఖరీరూపా

నోటిమాటల నిల్వు-నోడికారపుటడ
ముతుకగా గొంతుక-న్రోగించుమార్పు
డింగరున్వ్రాడిగఁ బా-డించెడి వేల్పు।

373 భక్తమానసహంసికా

బోడికగుండె మ-ద్వ్ర తెలివులుంగు
అడియర్ల డెందము-లలరించు వేల్పు

374 కామేశ్వరప్రాణనాడీ

నింగినేలలు తన-నిల్వగుకోర్కి
తేనికట్టుసురు పా-టెడు పిల్లనరము

ముక్కంటి ముందల-ప్రోదిమలప్ప
డింగరు కోర్కె పం-డించెడి వేల్పు॥

375 కృతజ్ఞా

ఎల్లరినడతల-కెలమలపిల్ల
యొగ్గులెన్నక మంచి-కే పొంగువేల్పు
తనుగొల్చువారినెం-తయు నమ్మపడుచుఁ
పనివడి మేల్మఱ-వని కన్నతల్లి॥

376 కామపూజితా

మంచివారినొడలు-మఱపించుహాయి
దొడ్డ డింగరు గుండెలోఁ-దోఁచు మెఱపు
అప్పసముఁ దగుకోర్కె-ల-కాటపట్టు
కోర్కెలేనిబోడ న్దగు-లొక్క-నెడిపడుచు
అలరువిలుకాని వేల్పుడు-లందువేల్పు॥

377 శృంగారరససంపూర్ణా

హావణింపు చవినింపు-హారువుసీమాటి
తమఁగొల్చు వారి కం-ద మలర్చువేల్పు॥

378 జయా

సాదరు, గెల్పును-సాగించు వేల్పు
పరవు నెవ్వరికి లోఁ-బడనీని జేజ॥

379 జాలంధరస్థితా

జొడ్డుతమ్మిన్విప్పు-మూఁతలుగనక
వాలాయ మెసఁగు ఱ-వలి నిల్వువేల్పు
నింగినేలల తడి-న్నెలకొనుపిల్ల
కొలుచువారికి గొప్ప-గొంతిడుతల్లి॥

పుట్టుక, పొదలిక-పొలయికలగుచు
దాఁగిలి ప్రుచ్చుల-న్దానాడుపడుచు॥

380 ఓఢ్యాణపీఠనిలయా

కనుబొమల నడిసుడినెల-కొనినవేల్పు
నిండుతనివి డింగరువకు-నించు కేజె॥

381 బిందుమండలవాసినీ

ఉచ్చికిందిబాబిలిగుడి-నొప్పు వేల్పు
గుఱుముల నెలకొను-గుబ్బలిపిల్ల
అడియని తన్విని-ల్పైమించు కేజె॥

382 రహోయాగక్రమారాధ్యా

కవి, విని, తలఁచు ని-క్కలదిన్నలెల్ల
మెఱుకయే యనిలోన-నెంచు డింగరుని
గుట్టుచాగు బడిక-కు నలరువేల్పు॥

383 రహస్తర్పణతర్పితా

కందువ వేల్పుడు-స్నైకొను తల్లి
లోపలి వేల్మికి-లోఁబడు వేల్పు
ఆదలో ప్రొక్కు-న-ద్యనుదన్పు కేజె॥

384 సద్యఃప్రసాదినీ

తలఁచినయంతఁ జెం-తన్దోఁచు వేల్పు
అడియఱదబ్బున-నగపట్టు కేజె॥

385 విశ్వసాక్షిణీ

నింగినేలలుకరి-నిడుగట్టుపట్టి
అడియర్ల యుల్లము-లరసెడు వేల్పు॥

386 సాక్షివర్జితా

తనకెలలేనితో-ల్దాలుపురాణి
వరవులకే కను-పట్టైను వేల్పు॥

387 షడంగదేవతాయుక్తా

కన్ను, డెందమ్ము, కూ-కటి, తల, మరువు
ములుకులాటిఁటి వేలు-పులఁగూడు జేజె॥
అంతయు నెఱుఁగుట,-యాదట మొదలు
తోఁపని యెఱుక, బ్ర-తుకు విచ్చలవిడి
తేయని చేవ, తుదిఁగనని యున్కి-
యాడుపాడుల తోడ-వలరుమలప్వ॥
తొలుచదువుల నిల్వ-తోల్దాల్పు రాణి

388 షాడ్గుణ్యపరిపూరితా

ఆఱులీలల కల్మి-లలరారు వేల్పు
పొందని, కూర్పుంట,-పోకవేఱగుట,
వేడ్కోంట, మైన, లి-బ్బి తగవుపేరు,
కళు, కెల్మి, తగులమి,-కాని, యాఁజేసి
హారువులతోడ నిం-డారిన జేజె॥

389 నిత్యక్లిన్నా

నిచ్చజాలిఁ దడియా-నే సామితల్లి
డింగరు నెపుడక్క-టికఁగను వేల్పు
పదునైదు నాళ్ళక-వ్రస్నతిమారు
వచ్చు మూఁడవపూఁట-వలిమలపిల్ల॥

390 నిరుపమా

సాటువలేని డా-చలిమలపిల్ల
అడియానీడు గనని-కలరించు వేల్పు॥

391 నిర్వాణసుఖదాయినీ

ఎల్లలేని పెంద్రోవ యి-మ్మిడెడు వేల్పు
ముమ్మేను లెడలించి-ముగితిచ్చు జేజె॥

392 నిత్యాషోడశికారూపా

వాలాయము పదాఱు-వంతుల నిలువు
విడి పదునాఱవ-వేల్మిమలప్ప
అడియని నెలవలె-నలరించు వేల్పు
అనయము న్గలతెఱం-గాగట్టుపట్టి
కన్నతల్లి నిజమ్ము-కడ మెల్లవాళ్ళి॥

393 శ్రీకంఠార్ధశరీరిణీ

పంతుకు త్తుక కందు-వానివంతు మెఱు
యెఱుకువ, మఱకువ-కెత్తువకెత్తు
కుడి తెల్పెడ మనల్పు-కొమరారు వేల్పు
చీఁకటివెత్తురు-ల్క్యోతివంతు పల్పి
హెచ్చుతగ్గుల నెన్న-కేలెడు జేజె॥
వ్రాల మొదటి వ్రాయి-పలిమలపిల్ల॥

394 ప్రభావతీ

ఎనిమిది కల్మ్మల-నలరించు మినుకు
వెలుఁగుల నన్నిటి-న్వెలిగించు తెల్వి
మిలమిలలాడెడు-మొత్తాఁడు పడుచు
అడియని న్నళతళ-నలరించు వేల్పు॥

395 ప్రభారూపా

ఒడ్డు, తోలెము, పూట-ములకన, రొందువు
పదవి, తొల్పడి, యగ-పదసల్పుకొన్నట

మొనిమిదినిగ్గుల-నెసఁగెడి వేల్పు
విన్నునేలల మేలు-పించెదు తేజ॥

396 ప్రసిద్ధా

పేనను నుడి వాసి-కెక్కిన వేల్పు
ఎల్ల రెఱింగిన-దే కన్నతల్లి॥

398 పరమేశ్వరీ

ఎక్కువ పాదిషా-హి కరువపిల్ల
ఎల్లరి న్వరవుచే-నేలించు వేల్పు॥

398 మూలప్రకృతిః

నింగినేలలకుఁదా-నే తల్లివేరు
అన్నిటి కాటప-ట్టా గట్టుపట్టి
వరవుల పదుగుల-వఱలించు వేల్పు॥

399 అవ్యక్తా

అడపొడ యున్నింటి-కగుతల్లి వేరు
నింగినేలలకుఁదా-నెకతమా వేల్పు
అడియము స్దక్కఁదె-ల్యఁబడని తేజ॥

400 వ్యక్తావ్యక్త స్వరూపిణీ

అగపడీ యగపడ-దాగట్టుపట్టి
అడియతో దొంగాట-లాడెడు వేల్పు
కొద్దిగొప్పల నిల్వ-గుబ్బలిపిల్ల

401 వ్యాపినీ

నింగినేలల నెల్ల-నిండారు వేల్పు
అడియుని గుండియ-నలరెడు తేజ॥

402 వివిధాకారా

పెక్కు-నిల్వులనొప్పు-వెలితిప్ప టెంకి
అడియకుఁ బలుతీర్ల-నగపడు వేల్పు॥

403 విద్యాఽవిద్యాస్వరూపిణీ

నికము కల్లలరెంటి-నిలువు మలవ్వ
ఎఱుకువ, మఱకువ-మెలగట్టుపట్టి
బోడికకెల్ల యి-మ్మ్ములలర్చు వేల్పు॥

404 మహాకామేశనయనకుముదాహ్లాదకౌముదీ

ముక్కంటి కన్దొగ-ముదురుజాబిల్లి
దొడ్డవారల చూపు-దొవకు రేయెండ
చల్లనితల్లి యా-చలిమలపిల్ల॥

405 భక్తహార్దతమోభేదభానుమద్భానుసంతతిః

బోడిక గుండెక-ప్పొద్దులుచ్చ కగటి
వేల్పు, మిన్కులగమి-వెలితిప్ప టెంకి
అడియని మఱకువ-వణఁగించు కేజె॥

406 శివదూతీ

మగని గల్పిన చలి-మలదొరపిల్ల
దొడ్డవారలకుఁ బెం-ద్రోవ తారువుది
అడియనికి న్మేటి-యరువిడు వేల్పు॥

407 శివారాధ్యా

కణు, కెండదొర, నెల-కన్నుల వేల్పు
వేల్పుడు సల్పెడు-వెలిదొరరాణి
ఢింగరుఛాగు బ-డిక గొనుకేజె॥

408 శివమూర్తిః

నెలతాల్పుటడపొడ-నిడుగట్టుపట్టి
ఎల్లెడన్మించి ని-ర్వ్యాకొల్పువేల్పు॥

409 శివంకరీ

అడియని కెవుఱు మే-లలరించు వేల్పు
చల్లన నిలువప్ప-సంబు మలప్ప॥

410 శివప్రియా

ముక్కంటిపై వల-పున్గొన్నపడుచు
గట్టువిల్తునకు వే-ఱ్కాదు మలప్ప
ఎల్లవారలకు మే-లె కోరువేల్పు॥

411 శివపరా

ముక్కంటి యెఱుకువ-న్మదలించు తెలివి
ఎఱుగ నలవికాని-దే సామితల్లి
అడియకు మేల్సల్ప-నలవడు చేజె॥
నెలతాల్పుపై నాడు-నిడుగట్టుపట్టి

412 శిష్టేష్టా

తమతమ తెగనడ-తన్దప్పకుండు
వారిబాగుబడిక-పండించు వేల్పు
అడియని పొంద న-యముసల్పు చేజె॥

413 శిష్టపూజితా

గొప్పవారల కొల్పు-గొనెడు మలప్ప
ఢింగరు బాగుబ-డిక గనువేల్పు

414 అప్రమేయా

ఆపెకున్న యెల్ల నెన్న-నైతికానిదేరికిన్
అంతటన్నిండి పెం-పారెడు వెలుఁగు
అడియునెంతోపోయి-వలరించు వేల్పు।

415 స్వప్రకాశా

తనయంతనలరు నెం-తయుగట్టువట్టి
పుట్టుకతో వర-వునలర్చు వేల్పు।

416 మనోవాచామగోచరా

ఆదకున్నబల్కు-న-కందని వేల్పు
వరవునకే యగ-వట్టినుకెజ
తనడెంగరుని నిల్వ-తానగు తల్లి॥

417 చిచ్ఛక్తిః

అలవున యుసురులఁ-కెలఁగించుచేవ
అనయము మఱకువ-నణఁగించునెఱుక
తనకు వేత్తానక-తనరారు తెలివి
తనుగొల్చువారలఁ-దనిపెడు వేల్పు
పగడలాగే మెప్డ-పరఁగెడి కెజ।

418 చేతనారూపా

కదువడిమ్రోఁగద-ల్చెడి విదుకంద
మందలనిలువయి-మయినడ్పు తెల్వి
నింగినేలల నెల్ల-నిండారు వేల్పు।

419 జడశక్తిః

సహకట్టి పుట్టించి-సమయించు చేవ
తెక్కింపఁ దుదకుఁ దే-లినయెదో నిగ్గు
వరవులవోయిగా-బ్రదికించు వేల్పు।

420 జడాత్మికా

ఉన్నది లేనిది-యు నయిన బూమె।
తెలివిలేనట్లు తో-తెంచెడు పిల్ల
అన్నిదిస్సులు తానె-యగా గట్టుపట్టి
నిక్కమున్నల్ల తా-నే యగు వేల్పు
మఱకువ మెఱుకువ-మైందోచు జేజె॥

421 గాయత్రీ

తొలిచదువుల కడగల నికరంబు
పాటకాని గదుగా-పాడు మలప్పు
గొండ్లి మనువు తన-కొఱయగు వేల్పు
చదువర్ల నెప్పుడు-న్నా కెడుతల్లి
దొడ్డవారలను బెం-ద్రోవలో నుంచు
టీకపలుకుబడి-టీకొప్పు జేజె॥

422 వ్యాహృతిః

ముచ్చోటుల నుడుల-మొరయించు వేల్పు
లెంకలమాట చె-ల్లించు జేజె॥

423 సంధ్యా

పుకటవేల్పుదున కొ-ప్పొంగెడు వేల్పు
నిాదుక్రిందులతుకు-మెట్టాదువడుచు
అన్ని పనులనంటి-యుంటని జేజె
వంచయేడీడు చె-ల్వములరుపాప॥

424 ద్విజబృందనిషేవితా

పాఱులగమికొల్చు-వలిమలపిల్ల
పరవులనెల్లగా-పాడెడు వేల్పు॥

425 తత్త్వానసా

నింగినేలల నెల్ల-నిండారు తెల్వి
పదునాలు నూర్వుల-పాడులెన్మిదియుఁ
గుర్చిలు గావించి-కూర్చుండు పడుచు
తనుగొల్చువారి చెం-తన్జేర్చుతల్లి
అన్నిట నుసురని-ట్వా గట్టుపట్టి
ముక్కంటిదొట్టి పే-ల్పుల కూఁతకోల
పరవు గుండియ నిర-వాలెడు జేజె।

426 తత్

ఎల్లరెత్తింగిన-దే గట్టుపట్టి
తానె నిక్కువమయి-తనరారుపిల్ల
అంకకు లోఁబడ-కాటాడుపడుచు
కలతెలింగయి తా నె-గడుమలప్పు
ఎప్పుడు న్నగడమే-లేసల్పుతల్లి
తనకంటె మటివేరు-తలఁపనిపాప
అడియనికి ముగిలి-నలరించు జేజె
ఉన్కి-నిగ్గలరుల-యోజయా వేల్పు
పాడు లిర్వదినాల్గు-వఱలించు వేల్పు।

427 త్వమ్

నీవనునుడి వాసి-నెగడిన వేల్పు।

428 అయి

పిల్వబనున్నెరు-పెట్టకా వేల్పు
పిల్ల చేఁ దల్లి పి-ల్పించుకొను నుడి
తనడెంగరులకు మే-ల్గనరించు వేల్పు।

429 పంచకోశాంతరస్థితా

బొందులందన్నిట-బువ్వ, యుసురు, గుండె
యెరువు, పొంగుల యెడ,-లైదసివములు
తెమల కొండొంటిలో-నిమిడి యున్నవి మాత్రి
లీరెండు మూడగు-సీరు, లావు
కలన మేనులు ముచ్చ-గా నలరారెడు
దినుసులన్నిటిలోన-నవగి పెనగి
నిగ్గునిలువయి యే-నింటికిఁ దగునట్లు
చేవనొసంగుచుఁ-జెల్వమీఱు

అయిదురెళ్లలోఁ దిత్తుల-యందలినడి
నొంటికాండ్రకుఁ దక్క-నొం-డొరులచేతఁ
దలఁపఁదరము కాకొప్ప డెం-దంపుటొండ
గాలితంత్రియు రెవ్వమించు-గట్టుపట్టి
వరవుమై మిక్కిల-వఱలించు వేల్పు॥

430 నిస్సీమమహిమా

అడితురి వందత-కంటె మెప్పించి
హద్దుమీఱిన గొప్ప-నలరు మలప్ప॥

431 నిత్యయౌవనా

ఎప్పటికిన్నిదు-చే గట్టుపట్టి
వాలాయ మడియరి-స్వర్వమైనుంచు॥
నెల్లరికంటె నం-తే గొప్పవేల్పు

432 మదశాలినీ

అప్పసంబు ద్దన-ర్పలరెడి వేల్పు
అతియురి పడ్డులే-కాడించు వేళ॥

433 మదఘూర్ణితరక్తాక్షి

కోపుమై దిగుగు కెం-గొప్పకనుల దుండి
తులువల జెండాడ-దూకెడు మారి
డింగరు లాహిరి-న్దికొల్పు వేల్పు॥

434 మదపాటలగండభూః

చెందెల్పుడా ల్చె-సిన బుగ్గలలరు
పదునాలుగేండ్ల గు-బ్బలిదొరపిల్ల
ఎలయీా డడియరుల-కెలరించు వేల్పు॥

435 చందనద్రవదిగ్ధాంగీ

దట్టంపుటగలు పూం-తమెయి మలప్ప
విరికమ్మతావుల-వెదచల్లు పిల్ల
పగడమేలేసల్పు-వలిగట్టుబొట్ట
డింగరికెంతయొా-టీకిదు వేల్పు॥

436 చాంపేయకుసుమప్రియా

బంగరుపువ్వుల-న్వాలచెడి దుండి
ఎంగిలికానిది-న్నకోరు జెజె॥
తపయుడియకుం బైడి-తళ్కు-దు వేల్పు॥

437 కుశలా

కోలు పనులెల్ల నేర్చిన-కొల్పుతల్లి
నింగినేలలు పన్ను-నేరుపుకత్తె
అడియారి పనుపరి-నలరించు వేల్పు॥

438 కోమలాకారా

న్నారైన నిలువుతో-నలువారు పడుచు
డింగరు న్బాలిగుం-డె న్నల్పు వేల్పు॥

439 కురుకుల్లా

కోషకెల్ల యుసురుల-కునడల మప్పు
దుండగీంద్రన్మ్రంచి-త్రోవలోఁబెట్టి
మెల్లరికిన్గట్టు-లేర్పర్చు వేల్పు॥

440 కులేశ్వరీ

కూడు, కూటమి, కూరు-కుఅమూటి కేల్క-
తెలివి, తెలియువాఁడు-తెలుపఁబడునది
యీమూడిఁటి గుదితా-ల్పెలెడి వేల్పు॥

441 కులకుండాలయా

కట్టియనరముల-కు న్బుట్టినిల్లు
నింగినేలల నిట్ట-నిల్పు మారాకు
అన్నిటి కండమై-యలరెడి వేల్పు॥

442 కౌలమార్గతత్పరసేవితా

పదాగులన్బట్టి కో-ల్వాంబడు పడుచు
కొల్పెటులుఁన్నఁ గై-కొనుగట్టుపట్టి
వవేల్పుఁడునకైన-నెలరెడు వేల్పు
జాలిగుండెల నప్ప-సముఁద్రోనుతల్లి
అడఁకువగల యడి-యున్నాచు కేశె॥

443 కుమారగణనాథాంబా

జెల్లుచూలు, పిల్లారుల-జేఁచు తల్లి
కాఁక చదువులఁదాఁ-గనిపెంచుతాయి
కడుఁదిర్గుఁ బోతుల-నడపు రాబెట్టి॥

444 తుష్టిః

తుదకు యుందతిలోని-దోలన్ని నిల్పు
ఎల్లరికి త్తను-పెసఁగించు వేల్పు॥

445 పుష్టిః

కొల్వువారిఁజొదలు-కొల్పించు తల్లి
ఎల్లవారలకు లా-వెసఁగించు వేల్పు॥

446 మతిః

అడియరికిఁ దెలివి-యలరించు వేల్పు
బాగోగు లేర్పర్పు-వలిమలపిల్ల॥

447 ధృతిః

ఎల్లర స్దీమస-మెలరించు వేల్పు
అందరి న్దన్వైమై-నలరించు జేజె॥
బరవసము నిలువు-వలిమలపిల్ల॥

448 శాంతిః

ఎల్లయుసురుల యం-దే పారుశాల్మి
అడియరి కడకర-నలరించు వేల్పు
మిడుకువి త్తనముగా-మిగిలినయూర్పు॥

449 స్వస్తిమతీ

ఒప్పారుచున్న దె-ట్లో గట్టువట్టి
బోడికకెల్ల మే-లొనరించు వేల్పు॥

450 కాంతిః

కడపయుసురుఁ దెల్పు-కట్టాణి తళుకు
కడిమిడెందముతమ్మి-కడచుట్టు మెఱపు
కడిది కళుకు నిల్వు-గా నొప్పువేల్పు॥
అడియరులకు వెలుఁ-గ్గై తోఁచు జేజె

తఱుగు విఱుగు లేని-తళతళనిలువు
మైఁజెలువారెడి-మలదొరపిల్ల॥

451 నందిని

నిండారిన తనర్పు-నిలువైన తల్లి
అప్పస మహిమరి-నలరించు వేల్పు
ఎఱుకవ నిల్వాయి-మొలరెడు తేజె
లావగునివిప-ట్ల వెలుగు తేజె
పెంద్రోవ తానెయా-వెలిదొరరాణి
మిన్నేటియుదపొడ-న్మించు మలప్ప॥

452 విఘ్ననాశనీ

బోడికె కాటంక-ముల బాపు తేజె
తనకోరి నట్టులం-తయు సల్పు వేల్పు॥

453 తేజోవతీ

వేడివేల్పునకు జా-బిలికిఁ, జుక్కలకు
టీవిగా మెఱుఁగుపె-ట్టెడు గట్టుపట్టి॥

454 త్రినయనా

మూఁడు కన్నులలరు-ముక్కంటివెలఁది
గడచినయద్ది, రాఁ-గలది, యిప్పటిది
యంతయు న్దెలిసిన-దాసామి తల్లి
ముగిలి, కుడి, యెడమ-ముత్రోవకనుల
నప్పసము న్జెలు-వారెడు వేల్పు॥

455 లోలాక్షీకామరూపిణీ

కోమలికూటమి-కోరిక నిలుపు
కోఁడికకుఁ దమిచూ-పులలర్పు వేల్పు॥

456 మాలినీ హంసినీ

విన్నాణి నిలువున-వెలసెను వేల్పు
మేనితాల్పుల యూర్పు-మెలపెడి జేజె॥

457 మాతా

నింగినేలలకుఁ దా-నే కొలబద్ద
తాఁదల్లితల్లియై-తనరారు వేల్పు
ఎల్లదిన్నుల హద్దు-లేర్పర్చు జేజె॥

458 మలయాచలవాసినీ

నిడుపూఁతగుబ్బలి-న్నెలకొను వేల్పు
బోడిక జల్లగాఁ-బొఁరిచెడి జేజె॥

459 సుముఖీ

అనయము నగుమోతి-నలరారుతల్లి
అడియరుల న్నెమ్మి-నలరించువేల్పు॥

460 నలినీ

కైౕ, లడుగులుం, వాయి,-కన్గవతమ్మి
లట్లొంటనసలుఁబు-ట్టనఁదగు వేల్పు
పండ్రెండు పేర్లతోఁ-బరగుమిన్నెలు
నిలువుగా నలరారు-నిడుగట్టుపట్టి
అన్నియందము లడి-యనికిడు జేజె॥

461 సుభ్రూః

పొగడఁదగిన కన్ను-బొమల మలప్పు
అడియ నర్మిలితోడ-నలరించు వేల్పు॥

462 శోభనా

ఎంతయో సొగసైన-దే గట్టుపట్టి
కడు నడియరి నంద-గాని గావించి
చదువరిగాఁ గొన-సాగించు వేల్పు॥

463 సురనాయికా

చదలకాఁపులనవ్వు-చలిమలపిల్ల
బోడికన్నంచి తె-ర్వ్వనఁ ద్రిప్పు వేల్పు॥

464 కాలకంఠీ

కప్పుకలటు లొప్పు కుత్తు-క కడువల్పు
నింగి కప్పటు లాపె-నిలువు హళిక్క
ఒరుల మంచికయి తా-నోర్చెదు నిడుమ
ముక్కంటి నిల్వ్వనఁ-జూడకట్టు వేల్పు
వరవులఁ దీయఁగా-బల్కంచు కేజె
లెంకకుఁగీసు దు-ల్చెదు గట్టుపట్టి॥

465 కాంతిమతీ

కళ్కు-కడాని తళుకు-గలచిన్నపిల్ల
తొల్కరి మెఱపుడా-ల్తులకించు పడుచు
అడియరి నెల్లపు-డలరించు తల్లి॥

466 క్షోభిణీ

కదలని ముక్కంటిఁ-గదలించు ముగతి
తనవంటి చెలుల నా-దన్గన్న కేజె
తాటోట్లఁ జెల్లాచె-దరు సల్పుమారి॥

467 సూక్ష్మరూపిణీ

మిక్కిలి సైకము-మెట్ట తోల్యాలు
ఎఱుగరా కెట్టులో-మెలరారు వేల్పు
డింగరు న్దనలోన-డిందించు వేల్పు॥

468 వజ్రేశ్వరీ

ముమ్మూల ముగురవే-ల్పుల నేలు జేజె
పొలుపారు ముచ్చదు-వులకుఁ బుట్టిల్లు
వరవులమగరాల-వలెసల్పు తల్లి।

469 వామదేవీ

గట్టువిల్కాఁడంద-కాఁడా ముదియని
మినుకొప్పుడామేను-మెట్టాఁడు పాఱ
పైడలులన్గూడ- వలపించు పడుచు॥

470 వయోఽవస్థావివర్జితా

ఈడున్కి యొడుదొడు-కెడఁబడు వేల్పు
అడియరి నప్పన-మలరించు జేజె॥

471 సిద్ధేశ్వరీ

బీదలనేలెడి-వెలిదొరరాణి
అడియన్ల కోరికలెల్ల-నలరించు వేల్పు॥

472 సిద్ధవిద్యా

ఓజనబ్బిన చదు-వొప్పారు పడుచు
పదునేను, పదియాఱు-వ్రాలపల్కు-బడి
గొణఁగెడి డింగరు-కొల్పెన్ను వేల్పు॥

473 సిద్ధమాతా

తలఁచినట్టులఁ జేయఁ-దగు బీదతల్లి
బోడికకెల్ల యిమ్ములఁగూర్చు వేల్పు॥

474 యశస్వినీ

ఎల్లెడ న్బెద్దపే-రెక్కిన వేల్పు
బోడికవంతట-న్బొగిడించు జేజ॥

475 విశుద్ధిచక్రనిలయా

కుట్టెమొదలు తల-కొసముట్టునుచ్చి
వఱకేడుసుడులలో-పల నిరవొంది
తానింగినేలలఁ-దనరారు వేల్పు
మడిగిఱిన్నెలకొను-మలదొరపిల్ల
తనుఁగొల్చువాని డెం-దమలర్చు జేజ
కోడలుకాకున్న-క్రొత్తడిమిన్న
అత్తమామలులేని-దా సామితల్లి
పుట్టుకలేని-వేల్పునకుఁ బెండ్లాము
కలయికలేక మ-గలఁగను పడుచు॥

476 ఆరక్తవర్ణా

తెలుపుమించిన యెఱుపుడా-లలరుపడుచు
కడుమంచివారల-న్గరముగాపాడి
చెడుగుల న్మొందుగాఁ-జెండాడు మరిడి
ఇమ్మిక వరవుల-కెసఁగించు వేల్పు॥

477 త్రిలోచనా

క్రాలెడు న్మూఁడుకన్నుల-గట్టుపట్టి
కొల్పు, తెల్వి, మిడుకెడు-గొప్పవేల్పు
అడియరి న్మత్తఱు-లరయించు జేజ॥

478 ఖట్వాంగాఽదిప్రహరణా

కైదువులన్నియు-న్గైదాల్పు వేల్పు
నాలిముచ్చుల ద్రుళ్ళ-ణంచెడుమారి
బోడికనోర్బటరి-న్బ్రోవరించు శేజె॥

479 వదనైకసమన్వితా

వంచనోరొప్పు గు-బ్బలిదొరబిడ్డ
మాటతప్పని వలి-మలయాఁడుపడుచు
డింగరుద్దప్ప నా-డించని వేల్పు॥

480 పాయసాన్నప్రియా

పాడిబువ్వ న్దిన-వలచెడు వేల్పు
కొలువరికిఁ బోసనాలకూ-డ్గడుప్ప వేల్పు॥

481 త్వక్స్థా

అంటలో నుసురయి-యులరారు వేల్పు
అంతకు స్వామిడు-కౌగట్టు పట్టి
అడియంద్ర నెమ్మేను-లలరించు శేజె॥

482 పశులోకభయంకరీ

వెంబరవిత్తుల-న్వెఱపించుమారి
ఎడమవడతవారి-నెద్రుచునూకాలు॥

483 అమృతాదిమహాశక్తిసంవృతా

అవరుస బదు-నాఱురేకుల
తలకట్టు దిగు-దలఱవళ్ళు
నచ్చనల మొదలు వ-దారుపేర్ల
డెందము గిటె నేలె-కి వెల్తురు
వరపుగుండియు కాట-పట్టగు వేల్పు॥

484 డాకినీశ్వరి

ఎల్లదగరలఁ దా-నేలెడు దుండి
చెడుగోట్ల పొగరు దు-ల్చెడు మొగదాక
బోడికకీడుల-న్నోఁబనూడ్చు శేజె॥

485 అనాహతాబ్జనిలయా

రెండాఱుల తేకులొప్ప
నాదతమ్మి న్వింతపేర
నెలకొను! జోగురాలు
అంతయు న్దానయ్యె-యలరారు శేజె
ఆడియని యుల్లము-నలరించు వేల్పు॥

486 శ్యామాభా

పదియున్నాతోడ్ల ప-ర్వము గట్టుపట్టి
ఆకుపచ్చరువాణ-మల రారుపడుచు॥
కల్లచదలుడాలు-గా నల్లపిల్ల
ప్రాఁతకెపుకు పరు-వములర్చు వేల్పు॥

487 వదనద్వయా

రెండుమూతుల విను-ద్రిమ్మరి మిన్న
క్రిందుమీదులఁ గ్రిక్కి-రియ గట్టుపట్టి
ముందువెనక- నడియఁ-బ్రోచెడి వేల్పు॥

488 దంష్ట్రోజ్జ్వలా

పందికోరలపంటి-పండ్లొప్ప మారి
గుండు కొయ్యలఁగొఱు-కు పయిడితల్లి॥

489 అక్షమాలాదిధరా

అనయమూసునకై యాట-లాడుకొనెడు
నింగిశేలల పొగటాళ్ళ-యిం గడించి

తనదుకొల్పునకై జోగు-దండి బ్రతుకు
మంచివారల పేర్లు లె-క్కించుకొనుచు
తుందుడుకులఁ జెండాడు కై-దువులు నాలు
గడ్డకేలులఁదాల్చు నొ-య్యారి వేల్పు॥

490 రుధిరసంస్థితా

నెత్తుట నిలఁబడు-న్నిడుగట్టుపట్టి
డింగరీనికి నెత్రు-డొక్కల్పు వేల్పు॥

491 కాలరాత్ర్యాదిశక్త్యౌఘవృతా

పదిరెండెఱకలతోఁ-బరగు పోలేరు
జోగురాండ్రఁ బన్నిరువుర-న్దోఁగుపైడి
పండ్రెండు పదనుకు-ప్పలనొప్పువేల్పు
తఱితనమేనుగాఁ-దనరారు పిల్ల
ఈరారుకొమ్ముల-నే పొందుతల్లి
తనకొల్పుసల్పు నం-దఱిసీల్గు, ముదిమి॥
యిదుమరానీక హా-యిగఁ బ్రోఁచు తేజ॥

492 స్నిగ్ధౌదనప్రియా

వాలెమునెయ్యి బు-వ్వన్గోరుపిల్ల
అడియగుల న్జము-రానించు తల్లి॥

493 మహావీరేంద్రవరదా

గొప్పశేఁకలకుఁ గో-ర్కులొసంగుతల్లి
ఎక్కుడు పేదలా-నింతికొపుంజు
పొన్నాబన్ను తొలిపట్టి-పోరునూతేండ్లు
పొవరింపవారలి-ద్వారికిఁ దాబొందు
సలిపికోరికలిడు-చలిమలపిల్ల॥

మెలఁకువ, కల, కూర్కు-మించిన యునికిఁ
దనరు మాస్టిని మ-ద్దత్తగు వేల్పు
వేల్మిగంటె చవిద్రా-వించెడి తేజ॥

494 రాకిన్యాంబాస్వరూపిణీ

పొక్కిలిసుడియలి-వు నిలువు వేల్పు
అడియరి న్బెంద్రోవ-నలరించు తేజ॥

495 మణిపూరాబ్జనిలయా

పొక్కిలిపై తమ్మిఁ-బొల్చెడు వేల్పు
పెంబరస్బిల్చి పి-ప్పిసలుపు మారి
అడియరి న్దనలోన-నలరించు తేజ॥

496 వదనత్రయసంయుతా

మూఁడు మూతులతోడఁ-బొల్పారు వేల్పు
పుట్టుక, పొదలిక,-పొలయిక నిల్వు
ప్రాఁతకు ముచ్చోట్ల-వలనిడు తేజ॥

497 వజ్రాదికాయుధోపేతా

మగటాయి కైదువం-బట్టిన లెంక
అడియకు గురుజాల-యడనిడు వేల్పు॥

498 డామర్యాదిభిరావృతా

గిడియ ప్రోఁగుడుల కూఁ-గెడు పైతల్లి
బండకుఁ జిల్లింగి-పరవుకాచెట్టి
పదుగురదగరలఁ-బరఁగు పోలేరు॥

499 రక్తవర్ణా

లాలుడాలలరారు-లావరి వేల్పు
అడియ కప్పసము చె-న్నలరించు తేజ॥

500 మాంసనిష్ఠా

సంజుడులోనిల్చు-నల్లని రకము
డింగరీని కరుచి-డెక్కొల్పు వేల్పు॥

501 గుడాన్నప్రీతమానసా

బెల్లము బువ్వకు-వ్విఘ్నూరు పిల్ల
తగువారి కొనియాటఁ-దగిలెడి పద్బు
తిన్నని వారల-న్దీవించు తల్లి
తనుఁగొల్చు నడియరి-న్దనియించు వేల్పు॥

502 సమస్తభక్తసుఖదా

ఎల్ల డింగరులకి-మ్మడు గట్టుపట్టి
బోడిక నలరించు-ముక్కంటి దుండి॥

503 లాకిన్యంబాస్వరూపిణీ

ఊచ్చిలోనలరెడి-రొుప్పులకుప్ప
అడియరి న్బ్రాండోవ-నలరించు వేల్పు॥

504 స్వాధిష్ఠానాంబుజగతా

కోలయం దాలురే-కులతమ్మినలరు
వాలె మెలుకయడ-న్వలిమలపిల్ల
చేరిక బోడిమి-న్జెలఁగించు వేల్పు॥

505 చతుర్వక్త్రమనోహరా

నాలుగు మూతుల-నలువారుపిల్ల
మం, చీగి, వేతిమి-మాటాటనాల్గు
వెరవులనోళ్లతో-వెలుఁగొందుపోలి
నలువాయి యడిదము-నన్దగు వేల్పు
బోడిక నుడ్డపై-పులగాచు జేజె॥

506 శూలాద్యాయుధసంపన్నా

నడిదోనలుగు దొట్టి-నటుపుకై దువల
దాలుచు వలినేల-తాల్పుతోల్పూలు
దుండగీంద్ర నడంచు-త్రోవలెన్నని
గనిపెట్టు జెట్టి యా-కట్టికాపెట్టీ॥

507 పీతవర్ణా

పసపుడా లెసఁగు గు-బ్బలిదొరపిల్ల
నిబ్బరికము చట్టి-నిదుగట్టుపట్టి
మంచికిఁ జల్లన-మైకొల్పు వేల్పు॥

508 అతిగర్వితా

అప్పసము తన కొం-డరయుని వేల్పు
టింగరు న్దొళ్ళియా-డించెడి జేజే॥

509 మేదోనిష్ఠా

తలలోని క్రొవ్వులోఁ-దనరెడి తెల్వి
అడియునికి నైక్కి-యమలర్చు వేల్పు॥

510 మధుప్రీతా

తరుజుపై మిగులమ-క్కు-వఁగొను వేల్పు
ఆడియరి నైపున-నలరించు జేజె॥

511 బందిన్యాది సమన్వితా

అంతు లార్గురి తోడ-నలరెడు వేల్పు
తగులు, కినుక, పిసిడి-తనము, వలపు, క్రొవ్వు,
చలములార్గింకంట్ల౯-జదువు జేజె॥

513 దధ్యన్నాసక్తహృదయా

పెరుఁగు బువ్వఁడిన సు-వ్వీఖ్యారు పిల్ల
కనిపెంచు కోర్కె న-గ్గలముగుతల్లి
పొగచిన వంటక-ములఁగోరు పద్దు
బోడికకు న్గింజ-పొదలించు వేల్పు
అసలుమూర్చినకూడు-నానెడి పాప॥

513 కాకినీరూపధారిణీ

కల, మెలకువ, యొడ-ల్గానని కూర్కు
కాని నాల్గవ యున్కిఁ-గ్రాలెడు వేల్పు
ఎల్లనిఁ దెల్పవీ-లే కాని తేజ
ఎవరికివారు తా-మే కనుజాడ
ఒంటరిక త్రైమై-యొప్పెడి పడుచు
ఉన్నదిగాని యె-ట్లుండునో యప్ప
అలవికాదు తెలియ-నాకన్నతల్లి
ఉల్లమందెట్టులో-యొప్పారు తేజ॥

514 మూలాధారాంబుజారూఢా

కుట్టియ సుడికమ్మిఁ-గూర్చున్న వేల్పు
గుండని నరముల-కుబిగిదు తేజ।

515 పంచవక్త్రా

అయిదునోళ్ళలరారు-నాగట్టుపట్టి
అడియని వైదైపు-లణఁచెడి వేల్పు।

516 అస్థిసంస్థితా

అన్నిదిస్సులనెమ్ము-లందలి యూట
నింగినేలల దినుసుల-న్నింటి నిగ్గు
బోడిక బొమికల-నొబ్బదలించు వేల్పు।

517 అంకుశాది ప్రహరణా

సిడిదొట్టికై దువ-ల్విప్మెడి మారి
ఆకతాయిలఁ దును-మాడుశాలేటి
కొలుచువారల మఱ-కువ మాన్పవేల్పు॥

518 వరదాదినిషేవితా

కోర్కెడు జక్కి-ణు-లొలిచెడి జేజె
నలువురు జోగురాం-డ్రు కొలుచువేల్పు॥

519 ముద్గౌదనాసక్తచిత్తా

పులగముతిను కోర్కె-పొదలు పోలేరు
అడియరి న్బెసరకూ-డానించు నెల్ల॥

520 సాకిన్యంబా స్వరూపిణీ

నుచ్చెన సుడియడ-నోములపంట
గుండని యుచ్చిని-గ్గు నిలువు వేల్పు

521 అజ్ఞాచక్రాబ్జనిలయా

కనుబొమలనడుమ-గ్రాలెడు రెండు
రేకులతమ్మిఁ దిం-డ్రించెడి వేల్పు
కన్నులమ్మాసికొనఁ జూడ-కట్టు జేజె॥

522 శుక్లవర్ణా

ఊదిన వెండిడా-లొప్పారు పిల్ల
మచ్చపడని కడు-మంచియిల్లాలు
డింగరీని కయిపం-టింపని వేల్పు॥

523 షడాననా

ఆఱుమూతుల వల-రారెడు వేల్పు

నన తతి, పెట్ట, వా–న, జలుబు, మంచు
చూర్చేవు వాతుల-సాంపిల్లు జేజె॥

524 మజ్జాసంస్థా

ఎమ్ము మాటమై వాలె-మెలరారు దినుసు
ఎల్ల రకములని-గ్గే గట్టుపట్టి
ఎప్పటికి నైజ-కెసంగెడి యెఱుక
వరవులకన్ని చే-వలోసంగు వేల్పు॥

525 హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా

ఎక్కువ చేవతో-నెనసిన వేల్పు
డింగరు నలవుగ-డింపించు జేజె॥

526 హరిద్రాన్నైకరసికా

పసుపు బువ్వకు మక్కు-వన్గొను వేల్పు
గుండనికి న్బలి-కూడిడు జేజె
వరవునకు నెనరు-వఱలించు తల్లి॥

527 హాకినీరూపధారిణీ

పొక్కిలిసుడియేల్క—పొడఁబాల్చు వేల్పు
వరవు నెల్లప్పుడు-న్బ్రతికించు జేజె॥

528 సహస్రదళపద్మస్థా

వేయి రేకుల తమ్మి-వెలసిన వేల్పు
వరవునకు ముగిలి-వఱలించు జేజె
ఔదల నోబ్బెడిక-కగపట్టు తెలివి॥

529 సర్వవర్ణోపశోభితా

ఎల్లపోసనముల-నెలరారు వేల్పు
అన్ని తెగలు తాన-యాగట్టుపట్టి

ఏబది వ్రాలని-శ్వోపారు జేజె
అందరి పాత్రడియు-కలద్పు తల్లి॥

530 సర్వాయుధధరా

తగుకై దువులనల్ల-దాల్చిన వేల్పు
అడియుచే నడిదము-లన్ని తాల్పించి తా
కంటులనందఱి-న్గడపించు జేజె॥

531 శుక్లసంస్థితా

విత్తునందు నిలుచు-వెలితిప్ప బెంకి
డింగరు గింజగ-ట్టి న్సల్పు వేల్పు॥

532 సర్వతోముఖీ

ఎల్లెడల న్మ్రొతు-లెలరారు వేల్పు
బోడిక న్వాయినోళ్ళఁ-బొగడించు జేజె॥

533 సర్వౌదన ప్రీతిచిత్తా

పాదములన్నియు-న్జవిఁగొను వేల్పు
కూళ్ళెల్ల నడియకు-న్గుడ్పించు జేజె॥

534 యాకిన్యంబా స్వరూపిణీ

పగడలీత సుడిఁగ-న్బట్టు మలప్ప
ఎఱుకవ న్బరికొల్పు-నేలిక నిలువు
అడియునికిఁ గఱవ-నలరించు వేల్పు॥

535 స్వాహా

వినుద్రిమ్మరుల పిల్పు-వెలితిప్ప బెంకి
నిప్పునిశ్వో సామి-నిగ్గన్న తల్లి
వేల్పుల న్వరవుచే-వేడించు జేజె॥

536 స్వధా

ఏడుడివేల్మిపి-ల్పే గట్టుపట్టి
పితరుల నశియాలు-పేర్కొను నుడువు॥

537 అమతిః

మేటిదిన్నుల కన్నింటి-కాటపట్టు
ఎల్ల నింగినేలల కెల్ల-తల్లి వేరు
అడియరి న్మఱకువ-నలరించు వేల్పు॥

528 మేధా

నిండు కఱద నిల్వ-నిడుగట్టుపట్టి
అడియని కెఱుకువ-నలరించు వేల్పు॥

539 శ్రుతిః

చదువుల యడపాడ-చలిగట్టుపట్టి
గొప్పపాట వినుచు-క్రొంజవి తిత్తి
తొలుఁబల్కు లడియ కెం-తో మప్పు వేల్పు॥

540 స్మృతిః

పాడిచదువు నిల్వ-వలిమలపిల్ల
అడియరి స్మత్తఱు-లరయించు వేల్పు॥

541 అనుత్తమా

ఆయుమయె వేలుపుల-కందఱికి నేటు
పాడిమైఁ గల్మి, కఱదల-న్బరఁగు కేజె
బోడిక కెఱుకువ-పొదలించు తల్లి॥

542 పుణ్యకీర్తిః

మంచి పేర్గొను మంచు-మలదొరపిల్ల
తనడింగరికిఁ బొగ-డ్త నలర్చు వేల్పు॥

543 పుణ్యలభ్యా

మంచివారలకే స-మకూరు మలప్ప
నిట్ట పంట నడచు-విన్ప్రోచు వేల్పు॥

544 పుణ్యశ్రవణకీర్తనా

తనవిన్కి పొగడు నం-దఱంగాంచు వేల్పు
డింగరు నాడిపా-డించెడి తేజ
బోడిక నెల్లెడ-నొబ్బగిడించు తల్లి॥

545 పులోమజార్చితా

వేల్పుతేనివెలంది-వేల్పుదు బొమ్మ
ముగతుల మగలతోఁ-బొందించు తేజ॥

546 బంధమోచనీ

కట్టుల న్విడిపించు-గట్టాఁడు పడుచు
బోడిక మఱకువ-నోర్పడుల్చు వేల్పు॥

547 బర్బరాలకా (బంధురాలకా)

ఉంగ్రాల ముంగురు-లొప్పు పో్రియాలు
అందమా కొప్పడి-యుకలర్చు వేల్పు
విరియఁబోసిన బిర్సు-వేనలి తేజ॥

548 విమర్శరూపిణీ

అరయిక యడపొడ-నలరు మలప్ప
దింగరీనికిఁ దెల్పెడి నలర్చు వేల్పు

549 విద్యా

ముగితినిడు తెలివి-పొడగట్టుపట్టి
అర్థియని పెంద్రోవ-నలరించు తేజ॥

(గంగా, భవానీ, గాయత్రీ, కాళీ, లక్ష్మి, స్వరస్వతి, రాజరాజేశ్వరీ, బాలా, శ్యామలా, లలితా, దశ.)

అడుగు చెమ్మట లాని–యుంజ, ముక్కంటి
గొత్తడి, ప్రామిను–కల కన్నతల్లి!,
కట్టి, కలిమిచెలి,–కయ్యవుఁదిండి
తాయి, పయిఁడిజేని–దణి, తొమ్మిదేండ్ల
పిల్ల, పసరుడాలు–వేల్పు, మలప్ప
కావేరి, యుంకాలు,–గంగాన, మారి,
యెల్లప్ప, పైడప్ప,–యెట్టిపోతప్ప
మొగదార నూకాలు–పోలేరను పది
పేరు లొండొంటికి–వెయ్యేసి పేర్ల
వరుస నొప్పారు గు–బ్బలిజేనికూఁతు॥

550 వియదాది జగత్ప్రసూః

ఓజమై విను దొట్టి–యుడ్డయిరువది
సరకులకు న్దల్లి–చలిమలపిల్ల
అన్నిదిన్సుల నడి–యనలర్చు వేల్పు॥

551 సర్వవ్యాధిప్రశమనీ

నలఁకువలన్నియు–న్మాన్పు మలప్ప
అడియ నెవుడు పోయి–నలరించు వేల్పు॥

552 సర్వమృత్యునివారిణీ

చాలియుక లన్నియు–నొబ్బుడుల్పు వేల్పు
వాలెము డింగరు–బ్రదికించు చేడె॥

553 అగ్రగణ్యా

అంకులందరి లెక్క–కందు తొలివేల్పు
డింగరు న్దొలిఁ బాగ–డింపించు చేడె॥

554 అచింత్యరూపా

ఆపసొబగు యందఁబోవ-దాదకెట్టు లేనియున్
వరవు నెవ్వరికిఁ దెల్పకదా-చు వేల్పు॥

555 కలికల్మషనాశనీ

తనయడియనితప్పి-దముగాఁచు వేల్పు
తలఁచినంతఁ బిదప-తరి తప్పాదుల్పు
నిబ్బరికము పుట్టి-నిదు గట్టుపట్టి
బిళరుల నెన్నని-యొప్పాలకువ్వు॥

556 కాత్యాయనీ

ఎల్లవేలుపులని-గ్గే సామితల్లి!
గట్టుపట్టి న్మించు-గట్టి వేల్పది
వెలుఁగుల నన్నిఁటి-న్వెలిగించు పంజ
ఈనింగినేలల-నేలెడు దణియ
తన కేలఁ జెంద్రోవఁ-దాల్చిన జేజ
ఎనుపోతు సోఁకుడు-నీల్గించు జెట్టి।

557 కాలహంత్రీ

కడిమిమైఁ దటిని ను-క్కడచినవేల్పు
అడియని పొలియిక-నడ్డెడి జేజ।

558 కమలాక్షనిషేవితా

తమ్మికంటి కొలుచు-తలిరుఁబోడి
గొప్పవారు మెచ్చు-కొనెడి వేల్పు॥

559 తాంబూలపూరితముఖీ

తమ్మనిండిన నోరు-తనరు నొయారి
వళిజాడు దిండుల-నమలు నంకాల్పు

కెంపుమోవిని నులి-కెడు ముద్దులాఁడి
నల్తావి డింగరీ-నికి నించు వేల్పు॥

560 దాడిమీకుసుమప్రభా

అడియరుల కెల యీ-డలరించు జేజె
హొంబంతిపువ్వనె-న్నొప్పు మలప్ప॥

561 మృగాక్షీ

లేలేడిచూపు వ-లిమలతొల్పాలు
అనయము వరవుల-నారయు వేల్పు॥

562 మోహినీ

తగులములోఁ జం-దతి ముంచు వేల్పు
వరవు నల్లరిచేత-వలపించు జేజె॥

563 ముఖ్యా

నింగిసేలలకు ము-న్నే యొప్పు వేల్పు
ఆడియకు ముందుగా-నగపట్టు జేజె॥

564 మృడానీ

వసతి నొనర్పు గు-బ్బలి విల్తురాణి
బోడిక కెల్ల యి-మ్ములొసంగు వేల్పు॥

565 మిత్రరూపిణీ

ఎండదొలి పొడయు-యితనరు వేల్పు
బోడిక కనుఁగు చె-ల్వావఁ దోఁచు జేజె॥

566 నిత్యతృప్తా

నిలువప్పసము తన్వి-నిండారు వేల్పు
తనుగొల్చు వారల-న్దనియించు జేజె॥

567 భక్తనిధిః

తనడింగరీని పా-తఁగట్టుపట్టి
డింగరు కోత్కలీ-డేర్పడి జేజ॥

568 నియంత్రీ

నింగినేలలఁ బన్ను-నిడుగట్టుపట్టి
నలువుగా డింగరు-న్నడిపించు వేల్పు॥

569 నిఖిలేశ్వరీ

నింగినేలల కేల్క-నిడుగట్టుపట్టి
ఎల్లరి నడియచే-నేలించు వేల్పు॥

570 మైత్ర్యాదివాసనాలభ్యా

ఇమ్ముగ న్నవారితో-నెవ్వాడు నెయ్మి
యొందిళ్ళపట్ల నం-తో కనికరము
కడునోచు వారల-కడఁ బరువసము
టాటోటుకాండ్రయె-డల నెఁవోక
చేఁలగు డింగరులకుఁ-జిక్కెడు వేల్పు॥

571 మహాప్రళయసాక్షిణీ

నింగినేలల నీరు-నెమ్మేనఁబూసి
యెగిరెడు ముక్కంటి-కెలగట్టుపట్టి
పెంద్రోవకు న్గరి-వెలితిప్పు బెంకి
కూరుకు కల మెలఁ-కువలకు సాకె
జరుగుపనులకెల్ల-సాకిరి వేల్పు॥

572 పరాశక్తిః

తాట, నెత్తురు, చిఱ్ఱు, యె-మ్ముక్కాట నెమ్ము
విత్తన, మెముక నెయ్యి, యూ-పిరి, యుంగమ్ము

నిగ్గులను పదిదిన్నుల-నిల్చులొప్ప
వనయముఁ దనకొండర-యనిమలప్ప
ఆయాయిరకములు-యులవైన వేల్పు॥

573 పరానిష్ఠా

కల, మెలకువ కూర్కు-కాని యున్కి- యుడ
వుంజీ యునికి యుడ-పొడ గరగరిక
అంతయు న్దానెమై-యులరారు వేల్పు॥

574 ప్రజ్ఞానఘనరూపిణీ

కల, మెలకువ, కూర్కు-కనిపెట్టు తెలివి
అయిదవయునికియై-యులలారు వేల్పు
తనకు వేఱుదినుసు-తలఁపనియొఱుక
అడియరి స్నెంద్రోవ-నలరించు వేల్పు॥

575 మాధ్వీపానాలసా

కోపాని తూఁగాడు-గుబ్బలిపిల్ల
అదటున డింగరు-నాడించు వేల్పు
తనువునిల్వైయెప్డు-తనరారు జేజె॥

576 మత్తా

అంతయు న్దానయుం-చడరెడు వడంచు
బోడికకు న్మేలే-పొనరించు వేల్పు॥

577 మాతృకావర్ణరూపిణీ

వాగ్రియసము నిలువు-వలిమలపిల్ల
మిన్ను నేలపొడసా-మిన్గవ్న తల్లి
వరవుని బల్కుచదు-వరి సల్పు వేల్పు॥

578 మహాకైలాసనిలయా

బలుగొప్ప వెలితిప్ప-వఱలు మలప్ప
నిబ్బరికపుగుండె-నెలకొను జేజె
నచ్చిన సుడినడి-న్బొలుపారు తెలివి॥

579 మృణాళమృదుదోర్లతా

కెందూఁడు జబ్బతీ-గెల గట్టుపట్టి
వంచ రెండను కొను-వారి యెగ్గడంచు
గుండని సందిట-న్గొని కాచు వేల్పు।

580 మహనీయా

ముదియనివారి వే-ల్పుడు గొల్పువేల్పుఁ
డింగరు చాగుబ-డికగొను జేజె॥

581 దయామూర్తిః

అక్కటిక తనని-ల్వ గట్టుపట్టి
బోడిక న్గనికర-మున గాంచువేల్పు॥

582 మహాసామ్రాజ్యశాలినీ

గొప్పయేలుబడి నె-క్కొను గట్టుపట్టి
అడియ నెక్కువ యొడ-యిని సల్పు వేల్పు।

583 ఆత్మవిద్యా

ఆదను తన కొం-దరయని యెఱుక
బోడిక న్విన్నాణిఁ-జొనరించు వేల్పు
వరవు తన్దా నెఱ్గు-వలనిడు జేజె॥

584 మహావిద్యా

గొప్పచదువు నిల్వ-గుబ్బలిపిల్ల
పాఱు వేలిమియడ-వలిగట్టుపట్టి

పెంద్రోవము స్త్రరు-వెలితిప్పవెంక।
వరవు నెక్కువ చదు-వరి సల్పు వేల్పు।

585 శ్రీవిద్యా

ఎల్లరిమొద మంచి-యొసఁగించు చదువు
పదియేను పదునాఱు-వంచ వ్రాలరహి
ఆడియంద్రఁ బెంద్రోవ-నలరించు వేల్పు।

586 కామసేవితా

కడచన్న తనమేను-కలుగనికంతు
వలనఁగూడ న్జాగు-బడిక గైకొనెడు
కొల్చువాని న్దగు-లొల్కను ముద్దులాఁడి
మైమరచిన బోడ-మరగెడు పడుచు
మంచివారల కొల్పు-మైకొల్పు వేల్పు।

587 శ్రీషోడశాక్షరీవిద్యా

పదునాఱు వ్రాలఁదె-ల్పన్బడు వేల్పు
పదియాఱు అవలుల-పాట పుట్టిల్లు
నెలపదార్వంతులం-టిన తెలిగంటి
తను వేడుకొనెడు నం-దటి నేలు జేజ॥

౫౮౮ త్రికూటా

ముప్పోకలం బోవు-ముద్దులగుమ్మ
ముక్కాఁకల న్దేరు-పువ్వారుఁబోఁడి
ముప్పన్ను గడలేలు-బోటికన్నారు
ముప్వాదులన్నదు-పొలఁతి సిరాజి
మూఁడు సరభద్దులఁ-జొడ తెంచు పడుచు॥

ముప్పొ్రిలులందుండు-ప్రోయాలుమిన్న
అడియాని ముచ్చేత-లందొప్పు తేజ
మూఁడు పొష్పములకాఁ,-పుడు క్రాలుఁగంటి
ముచ్చివరల మినుా-ముట్టిన వేల్పు॥

589 కామకోటికా

తలిదండ్రు లిరువురు-న్దానియా వేల్పు
కలయికకు న్మద్ధ-గానొప్పు తెలివి
కూటమికి న్గొట్ట-కొసయుంచు మించు
అడియాఁగూడిక నోల-లాడించు తేజ॥

590 కటాక్షకింకరీభూతకమలాకోటిసేవితా

లోఁగి తొప్పలు దొర-లు కలిమిచెలులు
తను నవ్వసముఁ గొల్వఁ-దనరారు దణియు
తనకొల్పు నల్పునం-దఱి కోర్కె-దీర
గొబ్బునఁ గల్మల-న్గురియించు వేల్పు॥

591 శిరస్థితా

ఉసురుల యూడల-నొప్పారు తెలివి
ఎల్ల వేల్పుల తల-కెక్కిన తేజ
అడియానందరి నెత్తు-లందుంచు తల్లి॥

592 చంద్రనిభా

పరుదునిండు నెలటు-చల్లని వేల్పు
చిఱునగ వలరెడు-చిన్నారికుడుచు
తనుగొల్చువారల-న్దనుపు మలప్ప
ఉచ్చియడుగు నెల-నొప్పారు తేజ॥

593 ఫాలస్థా (భాలస్థా)

నుదుటివాకియసమున-నూల్గొను వేల్పు
పరవు నెన్నొసట వ-ప్పుస మెప్పు జేజె॥

594 ఇంద్రధనుఃప్రభా

ఎండజల్లులనుండు-యింతికావుంజు
విలువలెం గళ్కు-ల-స్వాలింగెడు వేల్పు
నింగినేలలు తన-విలువగు జేజె
పరవు లేనెలవలె-వఱలించు తల్లి॥

595 హృదయస్థా

గుండియలోనుండు-గుబ్బలిపట్టి
నింగినేలలకుం దా-నే తల్లివేరు
ఆడియని యుల్లము-నలరించు వేల్పు॥

596 రవిప్రఖ్యా

ఎట్టనివేల్పు జ-గ్గలరించు జేజె
తమ్మిదొరవలెం బ్రాం-త నలర్చు తల్లి॥

597 త్రికోణాంతరదీపికా

నెల, నెండ దొర, డిగ్గి-నెగడించు వంజు
ములు, గుండె, తల సుద్దుం-జొలుపారు తెల్వి
ముమ్మొనల నడుమం-జొల్చు నిలాయి
పరవు మఱవు టిరు-ల్వాపుజుంజాము॥

598 దాక్షాయణీ

పాఱుల కెకిమీని-పరువైన పిల్ల
నలువారుచున్న వం-ట వలంతి నిలువు

జాబిలిరాణి వం-చము బండిచుక్క-
డింగరు కోర్కె లీ-డేర్చెడి వేల్పు॥

599 దైత్యహంత్రీ

ఎఱచిదిండ్లనపు-యించెడి మారి
గుండగొయ్యల నేల-గూల్చు పోలేరు
పాడెగట్టులఁ గాలఁ-బ్రామువాకిటి
నాలిముచ్చుల ద్రుళ్ళ-ణంచు నూకాలు
డింగరు పగఱ నూ-డ్చెడు మొగదార॥

600 దక్షయజ్ఞవినాశనీ

ముక్కంటి కంటువే-ల్పు లడంచు వేల్పు
చిల్లింగి ముచ్చులఁ-జెండు పోలేరు॥

601 దరాందోళితదీర్ఘాక్షీ

సుంత బెళుకువాలు-చూపుల పడుచు
వరవుల వెఱపెడఁ-బాపెడు వేల్పు
నింగినేలల నెల్ల-నిండారు తేజ॥

602 దరహాసోజ్జ్వలన్ముఖీ

చిఱునవ్వు నోరుఁ జూ-ల్చెడి ముద్దులాఁడి
నగుమూతి డింగరు-న్గాచెడు వేల్పు॥

603 గురుమూర్తిః

అయ్యగారి నిలువున-నలరు మలప్ప
వరవుల చదువుల-పంతులౌ వేల్పు॥

604 గుణనిధిః

తగునడువళ్ళ పాఁ-లెఱ నిల్వపడుచు
కడుమంచివారల-న్గాపాడుతల్లి

పాడి ముప్పోకల-న్వరఁగాడి పిల్ల
తనవరవుల నడ-తలకు మేల్బంతి
గుండని బ్రతుకు జో-గున్నిల్చు వేల్పు॥

605 గోమాతా

గుబ్బలిపిల్ల యాల-కు గ్గన్నతల్లి
ఎల్లవల్కు-లకుఁ బు-ట్టిల్లగు పిల్ల
దొడ్డవారలకుఁ బెం-ద్రోవిడు వేల్పు॥

606 గుహజన్మభూః

వేలువులమూఁక పేరిటి-వెలఁదిమగని
నన్నిరెూ నోములోనరించి-కన్నతల్లి
కాఁక సల్పెడు మొణకరి-గ్గాచు వేల్పు
ఉసురుల గ్దననుండి-యొదవించు జేజె॥

607 దేవేశీ

తెఱగంటుకా మింటి-తెరువర్ణ మేటి
అడియని సొంపుగా-నాడించు వేల్పు॥

608 దండనీతిస్థా

చెడుగులడఁచి మంచి-చెలఁగించు వేల్పు
కట్టుపాటుల నిల్పు ము-క్కంటి వెలఁది॥

609 దహరాకాశరూపిణీ

ఆదచదలు నిలు-వొగట్టుపట్టి
అడియని డెందము-నందొప్పు వేల్పు॥

610 ప్రతిపన్ముఖ్యరాకాంతతిథిమండలపూజితా

పదియేనునాళ్ళ తి-ప్పుకి నెల దనుకఁ
జాగుబడికగొను-చలిమలపిల్ల॥

611 కలాత్మికా

అఱువదినాల్గు వ్రా-లడచుగు వేల్పు
నిప్పుకే నూటయె-నిమిది, జాబిల్లి
వందముప్పదియాఱు-పగలింటిజేని
నూటపదాఱును-న్మొత్తము మినుకు
లేడాది పూటలై-యెలరారు వేల్పు
అనయము వెలుఁగున్మై-వలరెడు జేజ॥

612 కలానాథా

అన్నిఋనుల నేలు-నందక త్తె
నెలపజాఱవ వంతు-నిండించు వేల్పు
అసలు మొదటి తేమానము-నొసఁగు జేజే
పంపకము నల్వ వీల్కా-ని-పాలుపంపు
వీలెడు ముట్టుప-ట్టెట్టపోతప్ప
పదియాఱుకళలఁ గా-పాడు గంగాన
ఎల్ల చదువుల కాట ప-ట్టే మలప్ప
వెలుఁగుజెట్టు మొదటఁబెట్టు-పిల్లరెమ్మ
అగపడీ యగపడ-కాదు నల్లప్ప
ఎవరికి నైలిజురా-దే సామితల్లి॥

613 కావ్యాలాపవినోదినీ

కొలఁగి యాపుట్టచూలు మొ-దలగు మాట
లల్లువాఱలనుకువుల-కెలరు వేల్పు
పలు తెఱఁగుల చాగు-బడికల కంటి
మంచిమాటలకు వే-పుణుబుకు జేజ॥

614 సచామరరమావాణీ సవ్యదక్షిణ సేవితా

వల పైఁడినెలఁత డా-పలఁ బలుకుబెలి

పిచోపుల సృష్టి-విసరెడు వేల్పు
కలిమి, చదువులు డిం-గరికిడు తేజ॥

615 ఆదిశక్తిః

అలవు మొదటి చేవ-యైన వేల్పు
ఓజ నలవడియు-కొదవించు తేజ॥

616 అమేయా

కొలఁది తెల్పరాని-గొప్ప వేల్పు
డింగరు నరిదిగ-డింపించు తేజ॥

617 ఆత్మా

ఆద తాను సురయి-యలరెడు వేల్పు
బోడిక చెలువునఁ-బొల్పారు తేజ॥

618 పరమా

కల తెఱంగులు నాల్గు-కలవందులోన
నికరమా దిన్ను తా-నేయైన వేల్పు
నింగినేలలకుఁ బైఁనెగడు మలప్ప
అడియునందటి పయి-నాడించు తేజ॥

619 పావనాకృతిః
మడి యడపొడగడ్డ-మలదొరబిడ్డ
అడియులకు స్నంచి-యలరించు వేల్పు॥

620 అనేకకోటిబ్రహ్మాండజననీ
కోటానుఁకోట్ల తా-తిల గ్రుడ్ల తల్లి
ఈనింగినేలల-కెల్ల మొత్తవ్వ
అన్నిదినుసులఁ దనయుంతఁ-గన్నతాయి
డింగరు పేరు గ-డింపించు వేల్పు॥

621 దివ్యవిగ్రహా

పెంద్రోవబొంది సొం-పిల్లు మలప్ప
కనుపట్ట కడియంద్ర-కంట్ల నడంపఁ
జడల నిల్పడి పోరు-సల్పెడి వేల్పు
అడియరి నొసగసుకాఁ-డనిపించు జేజ॥

622 క్లీంకారి

లిబ్బిడుతల్లి త-ల్లి కటి వేల్పుకవ
అన్నిపనుల కత-మా గట్టుపట్టి
కొసకు ముక్కంటి యే-గుబ్బలిపిల్ల
వరవు కూడిక వేడ్క-వటలించు వేల్పు॥

623 కేవలా

అంతయు న్దానయై-యలరారు తల్లి
తనకొండు గానక-తనరెడి పడుచు
ఒంటిగా నెల్లపు-డొప్పు లేలేమ
అడియనిఁ బెంద్రోవ-నలరించు వేల్పు॥

624 గుహ్యా

గుండని గవినడుమ-గుల్కెడు పడుచు
ఒంటిగా డింగరుఁ-డోముదు వేల్పు
పగడ బోడలకె క-న్పట్టెదు జేజ॥

625 కైవల్యపదదాయినీ

పెంద్రోవ నొసఁగెడు-వెలితిప్పు లింకి
ఎల్లవారలకు మే-లే సల్పుతల్లి
అడియరి న్దనలోన-నలరించు వేల్పు
తనడింగరుల నెల్లఁ-దాఁ గొల్పు జేజ॥

626 త్రిపురా

ముచ్చేలుపులకన్న-ముందొప్పు జేజె
పరవు ముబ్బాందుల-న్యాజిలించు వేల్పు॥

627 త్రిజగద్వంద్యా

మీఁద, నడుమ, క్రింద-మెలఁగును సురుల
చాగుబడిక గను-చలిమలపిల్ల
డింగరింద్రదవు దుగ్గ-డించెడి వేల్పు॥

628 త్రిమూర్తిః

ముచ్చేలుపుల నిల్వో-పొ గట్టుపట్టి
మూఁడేండ్ల యీడునఁ-బొల్పారు పిల్ల
ముగురు జేజేలమూ-పునఁ గల్గుతల్లి॥

629 త్రిదశేశ్వరీ

ముదియనివారలు-మొ్రొక్కెడివేల్పు
బాసవాలులనేలు-చలిమలపిల్ల
ముప్పదేండ్ల పరువ-మునఁ బొల్చుజేజె॥

630 త్ర్యక్షరీ

మూఁడువ్రాల నికర-ము నిలువువేల్పు
పుట్టుక, పొదలిక,-పొలయికల్మిచ్చు
తానయై యనయము-తనరారుజేజె
ముబ్రాయిడెందము-పొడ నొప్పు తెలివి॥

631 దివ్యగంధాఢ్యా

కమ్మని పూఁతమైఁ-గ్రాలుమలప్పు
అడియ నల్లెడవాసి-నలరించు వేల్పు
వినుపల్కడియనికి-వినిపించుజేజె॥

632 సిందూరతిలకాంచితా

జేగుఱు బొట్టుతోఁ-జెన్నారుపడుచు
కల్లరి నెత్రిచు-క్కన్దాల్పుహారి
క్రొత్తడి వేల్పదె-క్కుడు సల్పువేల్పు॥

633 ఉమా

ఉడుగు వల్దనుచుండ-నొషరించుఁగాఁక
మైమఱచినటు కుత్రి-మ్మారెడి మలప్ప
వాఁకశాలుపురాణి-వలిమలపిల్ల
అప్పస మెఱుకమై-నలరెడి వేల్పు
పసపుడాలొవ్వు గు-బ్బలిదొరపట్టి
కోరిక నిలువునఁ-గొమరారుజేజె
ఇరు మూళ్ల యేండ్ల యీ-డెలరుచిన్నారి॥

634 శైలేంద్రతనయా

చలువలమలపిల్ల-చల్లని వేల్పు
ఒడలెఱుఁగని యున్కి-నొదవుతనప్పు
వరవుల హాయిగా-పాడెడిజేజె॥

635 గౌరి

కడు నిండునెలడా-లుగల గట్టుపట్టి
మఱకువ మెఱుకువ-మైమాఱు పడుతు
కాఁకయే తన నిల్కా-గా నొప్పుపిల్ల
పదియేండ్లయీడు చె-ల్వమలరుపడ్చు
వాలెము వరవుగా-పాడెడువేల్పు॥

636 గంధర్వసేవితా

కయ్యపుఁడిండి పొ-గడు గట్టుపట్టి
ఖయకాండ్రచేతఁ గొ-ల్వంబడు పడుచు

తత్తడి పౌఁజుతోఁ-దనరెడు వేల్పు
కమ్మని తావుల-న్గ్రిమ్ము మలప్ప
డింగరు మ్రొక్కు-బ-డిన్గొను జేజె॥

637 విశ్వగర్భా

మినునేల చూఁడి ని-మిడ్చిన వేల్పు
అడియడు తానెయై-యలరారు జేజె।

638 స్వర్ణగర్భా

బంగారు చూలు గు-బ్బలి విల్తురాణి
డింగరు తగుపాఁగ-డికగొను వేల్పు॥

639 అవరదా

అలవుమైనోఁకుల-వణగార్చు వేల్పు
సువ్వాణి పల్బాలు-సొంపారు పడుచు
డింగరికి వెనుక-టి బిగిడు జేజె।

640 వాగధీశ్వరీ

మంచి మాటల నేలు-మలదొరపిల్ల
వరవుల నింపుగాఁ-బల్కించు వేల్పు॥

641 ధ్యానగమ్యా

తగులము లేనిడెం-దము చేరు వేల్పు
నిలుకడఁగలదూద-నెలకొను జేజె॥

642 అపరిచ్ఛేద్యా

ఆయాయి కొలతల-కందని వేల్పు
వరవుల గుట్టు దె-ల్ప దెవరికైన॥

643 జ్ఞానదా

కొల్చువారల కెఱు-కువనిడు జేజె॥
బోడికమఱకువ-నొబ్బగొట్టు వేల్పు
డింగరునకుఁగూ-డిడెడు తెఱఁగంటు॥

644 జ్ఞానవిగ్రహా

ఎఱుక నెమ్మేనుగా-నెలరారు వేల్పు
వరవుల నెఱుకువ-న్వఱలించు జేజె॥

645 సర్వవేదాంతసంవేద్యా

తొలుఁబల్కుల తలలఁ-దోఁతెంచు వేల్పు॥
అసియనికిఁదనంత-నగపడు జేజె॥

646 సత్యానందస్వరూపిణీ

అప్పసంబు తనరు-పలరారు వేల్పు
అడియని కెపుడు బు-ల్వడరించు జేజె॥

647 లోపాముద్రార్చితా

క్రొత్తడి వేల్పుడు-గొనిపొంగు వేల్పు
డింగరు చాగుబ-డికగను జేజె॥

648 లీలాక్లృప్త బ్రహ్మాండమండలా

అన్నియు న్బన్నడు-నాటక్కై జేజె॥
తన తోఁచి నట్టుబం-తఁపు సల్పు వేల్పు॥

649 అదృశ్యా

అలవుచూరనెల్ల నెల్ల నిండి-యైనఁ దోఁపకుండెడున్
వంచడింగరి కగ-పట్టెడు జేజె॥

650 దృశ్యరహితా

ఈడెన్నటికి చూడ-దేదినున్నైన
తనకు వేఱరయక-తనరారు వేల్పు
అడియడేతానయి-యలరెడు జేజ॥

651 విజ్ఞాత్రీ

ఎఱుకువయడపొడ-యే గట్టుపట్టి
తాఁదనవరవయి-తనరారు వేల్పు
బండ్ల కెఱుఁగఁబడ-కొప్పెడి జేజ॥

652 వేద్యవర్జితా

అంతయున్దెలిసిన-దామెట్టబొట్టె
గట్టాడుపడు నెఱుం-గనిదియేలేదు
ఈ నింగి నేలలి-వెల్ల మలప్ప
చవి చూచియు మిసిన-చప్పని పిప్పి
బోడికన్గాచు న-న్వోన్గను వేల్పు॥

653 యోగినీ

ఒడల మూఁడియ మొద-లుచ్చి యండాక
చెలఁగు నేడుసుదుల-చేవలనేలు
వేల్పులయడపొడ-వెలితిప్పటెంకి
తలఁపులఁ దోఁఱఁగు డెం-దంపు తనప్పు
వాలాయము న్బొందు-పలిగట్టుపట్టి
తనడింగరీంద్ర కం-దటికిఁ బెంద్రోవ
వసతి నెసంగించు-వడిగ మలప్ప
ఐదు మైదినుసుల--నాదతోఁగూడ
నడఁగించి మెఱుకువ-నలరారు జేజ॥

654 యోగదా

పెంద్రోవ సమకూర్చు-వేల్పుసిరాజి
బోడికకెల్ల యి-మ్ములొసంగు జేజె॥

655 యోగ్యా

తనడింగరీంద్ర కం-దఱి కనయుంబు
నిండారు తనరుపు- నెగడించు వేల్పు
వాలాయమెల్ల చే-వలనొప్పు జేజె॥

656 యోగానందా

పెంద్రోవ హాయి సొం-పిల్లు మలప్ప
అడ్డయున్కల తన-ర్పడియు కలర్పు॥

657 యుగంధరా

నింగినేలల యుండ-నెగడించు చీల
కాన యాల్మగల జ-తయయిన వేల్పు
అడ్డతీరుల తఱి-యొదపొడ జేజే
డింగరు బ్రతుకు బం-డినడుపు గులప॥

658 ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ
పట్టింపు నేరుపు-పని చేవ లెసంగ
నింగినేలల పొడి-నెఱవేర్చు వేల్పు
పుట్టుక, పొదలిక-పొలియక ల్నెరపు
ముత్తెఱంగుల చేగ-పొడమించు జేజె॥

659 సర్వాధారా

ఈ నింగినేలల-కెల్ల నూఁతమ్ము
అడియల కందఱి-కాసరా వేల్పు॥

660 సుప్రతిష్ఠా

గొప్ప పేరలరారు-గుబ్బలి పట్టి
నింగినేలల నిట్టనిలిపెడు వేల్పు॥

661 సదసద్రూపధారిణీ

లేమి కల్మి యడదా-ల్చిన గట్టుపట్టి
నిరము హులిక్కి-రెం-టినిలువు వేల్పు॥

662 అష్టమూర్తిః

కల్మి, నెఱి, గట్టి, లావు, నూగు వే-ట్క తళ్కు- చేవ
లీయెనిమిది మేనుల-నింపాగు వేల్పు మేల్బంతి
మంచియే తనకొడలుగా-మించు జేజ॥
జాలరి, కబ్బిలి, సానియాసాది
కీలారి, యోజు, చా-కేత, నసగూటి
యెనమండ్ర లాగున-నెలరారు నంక॥

663 అజాజైత్రీ

అలవున తాగెల్పు-నవ్వారి యోజ
బోడిక మఱకువ-నోర్చుదుల్పు వేల్పు॥

664 లోకయాత్రావిధాయినీ

ఊసునకై పను-లోజగావించు
నింగినేలల సవరించు-నిట్టపంట
టీకుగావరవు న-డ్పించెడి వేల్పు॥

665 ఏకాకినీ

అప్పనమొంటిగా-నాటాడువేల్పు
తనడింగరు న్వంచ-దనరించు జేజ॥

666 ధూమరూపా

కూరుకు, కల, మెలఁ-కువల పైమించు
నుడ్డ నిల్వై పోయి-నొప్పారు నెఱుక
తనకు వేఱౌఁగ-తవరారు తెల్వి
నింగినేలల నడ్మ-ని దవరు వేల్పు॥

667 నిర్ద్వైతా

ఇరుదిన్ను తనకు లే-కెలరారు తెల్వి
అడియరి నిలువున-నలరారు వేల్పు
అడియని మాఱులే-కలరించు జేజ॥

668 ద్వైతవర్జితా

తనకొండు తలఁపని-తల్లితల్లి చెలి
నింగినేల లివి తా-నేయగు వేల్పు
తనకంటె మాఱుసుం-డలలేని జేజ
వేఱుపాటెఱుఁగని-వెలితిప్పటొకి॥

669 అన్నదా

అనయము కూడిడు-నందతికెపుడు
ఉసురుల కొండొండ-నొసఁగెడున్దన్వి
తనలెంక ప్రాణమై-తనరారు వేల్పు॥

670 వసుధా

తనడింగరునకు సొ-దరొసంగు వేల్పు
వరవు మేనికిఁబైడి-పసనిడు జేజ॥

671 వృద్ధా

అన్నింటికంటె ము-న్నలరారు జేజ
వాలెము వరవుల-న్వలరించు వేల్పు॥

672 బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ

కూరుకు, కల, మెలఁ-కువల పై యున్కి-
తనకు వేఱేదియు-న్దలఁపనిమెఱుక
అంతయుఁ దానైయై-యలరారు తెలివి
డింగరు నిలువున-డీకొను వేల్పు॥

673 బృహతీ

నింగి నేలలకెల్లఁ దా-నె హంరుమత్తు
అడియరి వందతీ-కంటె హెచ్చించు
పాట మిన్కుల నిల్వ-వలిమలపిల్ల
పీనెలాగునఁబల్కు-వెలితిప్పకెంకి
హాయిగా మాటాడు-నాగట్టుపట్టి
ముప్పదియాఱు వ్రా-లొప్పఁగించునుడుగు॥

674 బ్రాహ్మణీ

పొగడొందు పాఱుల-ముక్కంటి వెలఁది
జోడికి నిరుఁబుట్టు-వున్నల్పు వేల్పు॥

675 బ్రాహ్మీ

నికముకల్లల రెంటి-నిలువగు వేల్పు
ఎవరికిన్దెలియ రా-కింపారు జేజె
పలుకుఁ జెలియ యడ-న్బరఁగెడు తల్లి॥

676 బ్రహ్మానందా

ముగితి పండువ నెల్ల-ప డలరు వేల్పు
బ్రాఁకతుఁ బెంబ్రోవ-పండునొసంగి
నిండు తనర్పున-నెగడించు జేజె॥

677 బలిప్రియా

వేల్పుడు కాన్క-కొ-న్విభ్యాళ్ళరు వేల్పు
కలియుకమాను ఢిం-గరు నెంచు జేజె॥

678 భాషారూపా

ఎల్లపల్కు-ల నిలు-వే గట్టుపట్టి
ప్రాఁతలందీయుఁగాఁ-బల్కు-ంచు వేల్పు॥

679 బృహత్సేనా

పెద్దపౌఁజులనేలు-వేల్పు సిరాజి
పలునిలువులఁదాల్పు-వలిమలపిల్ల
అడియని తలఁపులో-నలరెడి జేజె॥

680 భావాభావవివర్జితా

కలిమిలేములురెండు-కాకొప్పుతల్లి
కలదు లేదా మంచు-గట్టాఁడుపడుచు
తనకుఁ దా మూసిగం-తలునాడు జేజె
నిక్క-ము స్గల్లకా-ని మలతోల్పాలు
ఉన్నదిగాని యె-ట్లుండునో వేల్పు॥

681 సుఖారాధ్యా

వడిసుళ్ళుగాఁ గొలు-వందగు జేజె॥
మ్రొక్క-నఁజాలు బు-ల్పుఁగొనెడి వేల్పు॥

682 శుభకరీ

పెంద్రోవ నొనరించు-వేల్పుకన్నాకు
ఢింగరునకు మేలె-డకొ-ల్పు వేల్పు॥

683 శోభనాసులభాగతిః

పెంద్రోవయడపాడ–వెలితిప్ప టెంకి
అడియకూఁ బయిపైగ–నగపడు వేల్పు
అడియరికి స్సుల్క–నబ్బెదు జేజె॥

684 రాజరాజేశ్వరీ

వేల్పు దొరలనేలు–వెలితిప్ప టెంకి
వానినిఁ దవలోకు–వ నొనర్చు నేల్క–
వరవుల నందటి–పై నుంచు జేజె॥

685 రాజ్యదాయినీ

అడియని కేల్బడి–హావుసిడు వేల్పు
ఎల్లడింగరు నాణె–మేలించు జేజె॥

686 రాజ్యవల్లభా

గొప్పయేల్బడికిఁ ద–గులు గట్టుపట్టి
టెంకలపై నర్మి–లిన్గొను వేల్పు॥

687 రాజత్కృపా

అడియరి స్నెనరుపై–నరసెడువేల్పు
గొప్పకనికరము–కుప్పమలప్ప

688 రాజపీఠనివేశితనిజాశ్రితా

అడియరి న్దొరగద్దె–నలరించు వేల్పు
నెల గద్దియల నడ్య–ని నునుచు జేజె

689 రాజ్యలక్ష్మీః

తగునేలుబడి తల్లి–తల్లి మలప్ప
అడియని కద్దిక–మలరించు వేల్పు॥

690 కోశనాథా

ఎల్లయుగ్రాణము-లేలెడి వేల్పు
బువ్వ, యూపిరి, డెంద-ము, తెలివి, హాయి
బొంది, యిర్మూఁడసి-ముల నేలు వేల్పు
లెంకలన్మలుగు లే-లింపించు జేజె॥

691 చతురంగబలేశ్వరీ

గారు, తత్తడి, తేరు-కాలరి మొనల
నాల్గింటినేలుచు-న్దనరెడు దణియ
పైకము, తగులము-పాడి పెందోవ
యీ నాలు గడియరి-కెసఁగించు వేల్పు
మెలఁకువ కల, కూర్కు-మిగిలినయున్కు
లీయుద్ధగాక తా-నేపారు జేజె॥

692 సామ్రాజ్యదాయినీ

డింగరీఁడున కేల్బ-డి నిడెడు వేల్పు
తెంకచే దొరల నే-లించెడి జేజె॥

693 సత్యసంధా

మాటతప్పని వలి-మలదొరపిల్ల
బోడికన్గడు నిక్క-వు న్నల్పు వేల్పు॥

694 సాగరమేఖలా

కడలి మొలపూలుదాల్చిన-గట్టుపట్టి
నేల నంతట తెంక-నెగడించు వేల్పు॥

695 దీక్షితా

పుల్లతీఁగెపస్త్రా-పుటకుఁ గడంగి
ముస్తిదయిన యుం-దములయింటియూపె

అడియని మేలున-కై నోచు జేజె॥
డింగరీనికి జిన్న-డెక్కు-లుప్పవేల్పు॥

696 దైత్యశమనీ

నల్ల దాగుడుల న-ణంచు పోలేరు
ఉలిపిగొట్టులపట్ల-నురుమనిపిడుగు
చెడునడతల బాగు-చేసెడు వేల్పు॥

697 సర్వలోకవశంకరీ

తనపాలొనర్పునం-తయు గట్టుపట్టి
అందరి న్దనకేల-నాడించు వేల్పు
లెంకచే మంది నే-లించెడి జేజె॥

698 సర్వార్థదాత్రీ

ఒడుపులన్నియుఁ దాతె-కొసఁగెడివేల్పు
ఎల్లకల్మి అడియ-కిడు వేల్పుగిడ్డి॥

698 సావిత్రీ

నింగినేలలకుఁ దా-నే కన్నతల్లి
తమ్ములవిందునం-దలి నిగ్గుమొగ్గు
ముగిత మేలుతరము-ముక్కంటిరాణి
అడియని కెఱుకువ-నలరించువేల్పు॥

700 సచ్చిదానందరూపిణీ

ఎప్పటికి నునికి, -యెఱుక, తనర్పు
నిలువున నలరారు-నిడుగట్టుపట్టి
బోడిక కెప్పుడు-న్బలిప్పెడు వేల్పు॥

701 దేశకాలాపరిచ్ఛిన్నా

కొలతలన్నింటి మీఱు-గుబ్బలిపట్టి

అంతట న్నిండిన-దా నల్లపిల్ల
నింగినేలలకుఁ దా-నేయానుకట్ట
వేల్పులకంటె ము-న్నే యొప్పు తెల్వి
ఎల్ల దిస్సులకు నెం-దేఁ బుట్టినిల్లు
అనుకొన్న దెదియుఁగా-కలరెడి జేజ॥

702 సర్వగా

ఎల్లెడలకరుగు-నేమలపిల్ల
బోడిక నంతట-న్నోబనిచ్చు జేజ
విన్ను నేలల వెల్లి-విరిసిన వేల్పు॥

703 సర్వమోహినీ

వలపించు నందటి-న్వలిగట్టుపట్టి
వరవు నెల్లరు తగు-ల్వడసల్పు వేల్పు

704 సరస్వతీ

తనకంటె వేరు సుం-తయుయిన లేదు
దినుసెదేనియునెను- తెల్విసింగరికిఁ
గొలిపియుతని మఱి-కువదుల్చు వేల్పు
ఎఱుకువ యడపొడ-యేగట్టు పట్టి
పలుకుఁజెలినిలువు-వలిమలపిల్ల

705 శాస్త్రమయీ

చదువుల యడపొడ-చలిగట్టుపట్టి
వరవుని కెఱుకువ-వఱలించు వేల్పు॥

706 గుహాంబా

గట్లయేలిక మనుమని-ఁగన్నతల్లి
నల్లనింగి న్నుట్టిన-వెలుఁగు మూడ్కి-
వరపుడెందములోన-వఱలెడు వేల్పు॥

707 గుహ్యారూపిణీ

కందువ యడపొడ-న్గాఁలెడి వేల్పు
ఒడలుమఱచు వర-వొందెడు హాళి
తనడింగరీనికే-తా నగపట్టు
తాఁజాటుమాటుగా-తనరారు జేజె॥

708 సర్వోపాధివినిర్ముక్తా

ఎల్ల పేరులు మేను-లెడసిన వేల్పు
అడియని దనలోస-నలరించు జేజె॥

709 సదాశివపతివ్రతా

ముక్కంటి పై వల-పున్గొన్నముగిత
పుట్టుకలేని వే-ల్పునకుఁ బెండ్లాము
పగడ చెల్వైన నెప్డు-పరగెడు తల్లి
వరవుతానేయయి-వఱలెడు జేజె॥

710 సంప్రదాయేశ్వరీ

పంతుల నడువుల-న్బాటించి తన్ను
నమ్మిన డింగరు-న్గాపాడు వేల్పు
తమ పెద్దలేగిన-దారినే నడచు
నెవరికైన న్గోర్కె-లిడుపాది సాహి
మంచికోరికలఁ గొనసా-గించు వేల్పు॥

711 సాధుః

ఎంతయో మంచిదెం-దేని మలప్పు
వరవు మిక్కిలి లెస్స-వఱలించు వేల్పు॥

712 ఈః

ఈనాలుగవ వ్రాయి-యేగట్టుపట్టి

నాలవయున్కి-వై-నలువారు వేల్పు
డింగరు స్తనయందు-డిందించు జేజె

713 గురుమండలరూపిణీ

అయగారులెల్లఁదా-మాయప్పగార్లు
ఓర్పరి పొందున-కొడఁబడుపడుచు
పాడిమైఁదనయంత-వచ్చెడి తెల్వి
పెద్దల మాటలు-వినువారి ప్రాపు
వరవు నెంతో చదు-వరిసల్పు వేల్పు

714 కులోత్తీర్ణా

కల, కూర్కు, మెలఁకువ-లాకవించు వేల్పు
తగఁబుట్టుక, కడలి-దాఁటించు జేజె॥

715 భగారాధ్యా

చీఁకటి గొంగకో-ల్చెడి గట్టుపట్టి
కాఁక వెలుఁగుగిఱి-గ్గనుపట్టు వేల్పు
డింగరు మ్రొక్కు-బడిన్గొను జేజె
అచ్చోటు కొల్పుతా-నగు తెఱగంటి

716 మాయా

వివరముగాఁదెల్పు-వీల్కాని వేల్పు
అగపడీయగపడ-దమ్మోదుబొమ్మ
వరవుఁబగఱ కగ-పర్చని తల్లి
ఆడియని కంట్లమా-యురొనర్చు జేజె॥

717 మధుమతీ

చవికందనము చట్టి-చలిగట్టుపట్టి
కోపాని తూఁగాడు-గుబ్బలి పిల్ల

లడియరి న్లాహిరి-నలరించు వేల్పు
తనడింగరుని నిల్వ్-తాఁదాల్పు జేజె
అడియనిఁ బెందో్రివ-నడరించు తల్లి॥

718 మహీ

బరినేలయడపొడం-బరఁగెడు వేల్పు
అడియనికి ముగిలి-నగపర్చు వెలుఁగు

719 గణాంబా

పిళ్లారితల్లి పిం-పిళ్లాడుపిల్ల
నిలువెల్లఁజదువుల-నిండారు పడుచు
జేజేలనేలెడు-చిన్నారి పోటి
తనుగొల్చుడింగరు-న్దరిఁజేర్చు వేల్పు॥

720 గుహ్యకారాధ్యా

ముదువు కాపరుల వే-ల్పుడుఁగొను వేల్పు
నుచ్చిన నెలయడ-న్బొడచూపు జేజె
గుట్టు చాగుబడిక-గొను తెలిగంటి॥

721 కోమలాంగి

నొ్రైన మేనితో-నలువారు పడుచు
నిలువెల్ల నెనరుమై-నిండిన తల్లి
డింగరి జాలిగుం-డౌ నలరు వేల్పు॥

722 గురుప్రియా

అయగారి నెచ్చెలి-యానప్పగారు
ఎఱిఁగిన వారితో-నేయుండు పిల్ల
ముక్కంటి పైవల -వున్గొన్న పడుచు
అడియరి న్గార్మిమై-నరసెడు వేల్పు॥

723 స్వతంత్రా

అలవోక తిరుగాడు-నాముద్దులాడి
ముక్కంటి లోఁకువ-న్బొనరించు జేజె
తనవరవుల నెల్ల-దశోఁల్పు వేల్పు॥

724 సర్వతంత్రేశీ

ఎల్ల కిట్టుకలకేల్క-యేగట్టుపట్టి
అన్నిచదువులడి-యకలర్పు వేల్పు॥

725 దక్షిణామూర్తిరూపిణీ

మాటాడకూరకే-మఱ్ఱియడుగున
వలకడ కెదురుగాఁ-బదియునాతేండ్ల
పడుచఁడై కూర్చుండి-వచ్చు బీదలకు
ముగితి తెరువుఁదెల్పు-ముక్కంటి నిలువు
బోడిక యడపాడ-న్బొలుపారు వేల్పు॥

726 సనకాదిసమారాధ్యా

డింగరు చాగుబ-డికగొను తల్లి
తగులములేని బీ-దలుగొల్పు వేల్పు
ఐదేండ్లవారికే-యగపట్టు జేజె॥

727 శివజ్ఞాన ప్రదాయినీ

మంచి తెలివినిడు-మలదొరపిల్ల
నింగిమూలకుఁగూడ-నెఱిఁగఱవుచెలి
అడియరికి స్మేటి-యరువిడు వేల్పు॥

728 చిత్కలా

చివరకు పనిముగిం-చి మిగులు తెల్వి
నింగినేలలుడుగ-నిలిచిన మొఖక

ఎల్ల వేల్పులకుఁదా-నేపాది సాహి
అడియనికి ముగితి-నలరించు జేజె॥

729 ఆనందకలికా

అలరింత లెల్లతా-నగు నిండుతనువు
బరువమ్ము మొలక-వలిమలపిల్ల
వరవుల కెలపండు-వన్నెల్పు వేల్పు॥

730 ప్రేమరూపా

అర్మిలి నమ్మిక-యడపొడ పడుచు
అందఱి పొత్తడి-యనికిడు వేల్పు॥

731 ప్రియంకరీ

కోరికె లీడేర్పు-గుబ్బలిపిల్ల
బోడిక కనయ దుం-పు తనర్పు వేల్పు॥

732 నామపారాయణప్రీతా

ఇరువది వేలపై-నేడునూర్ల పలు
ముప్పదార్పేరులఁ-బొగడొందు వేల్పు
పేఁబదిప్రాల ని-ర్మింపారు జేజె
ఎన్నియో పేర్లతో-నెలరెడి తల్లి
తనబిడ్డ కొండాడఁ-దనరంపు పొందు
తగువారలనయము-తన్గొనియాడ
పొంగెడు మిక్కి-లి-ముక్కంటి వెలఁది
బోడిక పొగడజ-ల్పు న్గను వేల్పు॥

733 నందివిద్యా

ముక్కంటి బసవఁడె-ప్పుడు వల్లెవేయు

చాటుమాట నిలువు-చలిమలపిల్ల
లెంకయు నయము వ-ల్లించెడి చదువు॥

734 నటేశ్వరీ

ముక్కంటి యాట సొం-పు తనర్చు పడుచు
హాయిగా డింగరు-నాడించు వేల్పు॥

735 మిథ్యా జగదధిష్ఠానా

లేని దిన్నున్నట్టు-లే చూపుదంట
త్రాడు నందునఁ బాముఁ-దలపించు వేల్పు
కూరుకు, కల, మెలఁ-కువల కాణాచి
నింగినేలల వితా-నేయగు కేజ॥

736 ముక్తిదా

దొడ్డవారలకుఁ బెం-ద్రోవ నొసంగు
డింగరు న్దనలోన-డిందించు వేల్పు॥

737 ముక్తిరూపిణీ

పెంద్రోవ యుడపొడ-వలి తిప్పలెంకి
అడియని తన్వని-ల్వైయొప్పు వేల్పు

738 లాస్యప్రియా

ఆట, పాటల వేడ్క-కలవారు పడుచు
బోడిక గొండ్లి కు-పొంగెడు వేల్పు॥

739 లయకరీ

నింగి నేలలను డిం-దించెడి వేల్పు
కల, కూర్కు, మెలఁకువ-కాని నాలవది
మిగుల నైదవ యున్కి-మించిన మెటుక

ఆట, పాటల నేరు-పలరించు జేజె
నింగి నేల నెతిగొం-డిలి మేళకత్తె॥

740 లజ్జా

మంచి సిగ్గులరెడు-మలధార పిల్ల
డింగరీనికి నున్చి-డె మలర్చు వేల్పు॥

741 రంభా దివందితా

వినుమిటారులు మొక్కు-వెలితిప్ప టెంకి
అడియని గుండియ-నలరించు వేల్పు॥

742 భవదావ సుధావృష్టిః

జంజాలు మెరగలి-చవిజడి వాన
అడియ కిమ్ము ముగుతు-లకరించు వేల్పు॥

743 పాపా రణ్యదవా నలా

కల్లకారువ కెర-గలి గట్టుపట్టి
బోడిక కీడుల-నోర్చునాడు వేల్పు॥

744 దౌర్భాగ్య తూల వాతూలా

ఎద్దడి దూదికెం-తే సుడిగాలి
అడియరుల నగ్మి-నలరించు వేల్పు॥

745 జరాధ్వాంత రవిప్రభా

తఱుఁగు నడియనికిఁ-దటపి నలర్చు
నెప్పటికి న్బడు-చేమైన వేల్పు
ముగ్గుతగ్గులు లేక-పొలుపారు జేజె
కారు చీఁకటికిఁగా-క వెలుఁగు నిగ్గు॥

746 భాగ్యాబ్ధి చంద్రికా

మేలు కడలి నెల-మెట్టాడు పడుచు
లలి నడియలికిఁ జ-ల్లన సల్పు వేల్పు॥

747 భక్త చిత్త కేకి ఘనాఘనా

తగు డింగరీనిడెం-దము నెమ్మి మొగులు

748 రోగపర్వత దంభోళిః

తెగులు తిప్ప పిడుగు-తెలివేల్పు రాణి
వరవునల్కువ తెడఁ-బాపెడు జేజె॥

749 మృత్యుదారు కుఠారికా

గిట్టింపు తోటన-ర్కొడు నడిదంబు
వరవు నెల్లప్పుడు-బ్రతికించు వేల్పు॥

750 మహేశ్వరీ

ఈనింగినేలల-నేలెడి దణియ
లెంక కెన్నఁటికిఁ-గల్మిఁ దనర్చు వేల్పు॥

751 మహాగ్రాసా

గొప్పకడి మ్రింగు-గుబ్బలిపిల్ల
నింగినేలలఁ గవ్వ-నిడుగట్టు పట్టి
పుట్టించుఁ బొదలించుఁ-బొలయించు వేల్పు
బోడిక కెల్లయి-మ్ములఁ గుడ్పు జేజె॥

752 మాహాకాళీ

తతిఁ తుదముట్టించుఁ-దాగట్టుపట్టి
హాయిగా నెప్పటి-కడియరి న్మనుచు॥

753 మహాశనా

మిన్ను నేలలివెల్ల-మ్రింగెడు వేల్పు
బోడిక కాఁకలి-పొదలించు తేజ॥

754 అపర్ణా

అందునాకులైన మానిఁ-యర్థి కాఁక సల్పు వేల్పు
కొల్చువారికెల్ల మంచి-కోర్కులిచ్చు గట్టుపట్టి
బోడిక యప్పు చ-ప్పునఁ దీర్చు తేజ॥

755 చండికా

చలపట్టి చెనటులఁ-జదుముకాటేరి
తనుఁ గొల్వఁబోనియే-తిరిఁగూల్చు మారి
అడియని పగనెల్ల-నణఁచు పోలేరు
యేడేండ్ల యీడున-నెలరారు పిల్ల॥

756 చండ ముండాసుర నిషూదనీ

నల్లద్రావుడుల న-ణఁచు మొగదార
తనకొండు లేదని-తాఁదల్చి తెల్యన
ట్లాటాడు కొనుచుండు-నమ్మలప్ప
నంజుడు దిండ్ల న-ణఁచెడి పోలేరు
చెడుగుల నెల్ల ద్రుంచెడు పెనుమారి॥

757 క్షరాక్షరాత్మికా

పొలియక లేనిది-పోకడ కలది
తాన యానా నేల-తాలుపు పిల్ల
ఎల్ల వ్రాల యెదమై-యేపారు వేల్పు
బోడిక కన్నియి-వమ్ముల లర్చు తేజ॥

758 సర్వలోకేశీ

అంతయు నేలెడు-నాగట్టు పట్టి
ఎల్లరి న్వరవుచే-నేలించు వేల్పు॥

759 విశ్వధారిణీ

నింగి నేలలు దాల్చు-నిడుగట్టు పట్టి
బోడిక చేమంచి-మ్రోయించు వేల్పు॥

760 త్రివర్గ దాత్రీ

సొమ్ము, మరులు, పాడి-ముత్తెగ లిచ్చు
నడియాని కెంతయు-నాగట్టు పట్టి
పుంట, పవలు, మాపు-ప్రోచెడి వేల్పు॥

761 సుభగా

అందమయిన దెల్ల-నమ్మల పిల్ల
అయిదేండ్ల యీడున-నలరారు బిడ్డ
వేఁడి వేల్పు న్గూడ-వెలిఁగించు జగ్గు
అడియ కెంతో కల్మి-నలరించు తేజె॥

762 త్ర్యంబకా

కణు, కెండ దొర, నెల-కన్నులు మూఁడు
వ్రాలాయ మొప్పారు-వలిమలపిల్ల
ముచ్చమూలలరయు - ముక్కంటి వెలఁది
అడియకుఁదివ త్రోవ-లగపర్చు వేల్పు॥

763 త్రిగుణాత్మికా

ముక్కజదలనిల్వ-పొలుపారు వేల్పు
ముచ్చపాడు లలరు-ముక్కంటి వెలఁది
మూఁడు తెఱఁగుల యి-మ్ము లొనర్చు తేజె॥

764 స్వర్గా పవర్గదా

తుగితి, వేలుపు టెంకి-బులుపు లోసంగి
తను గొల్చువారి నెం-తయుఁబ్రోచు తల్లి॥

765 శుద్ధా

అ యము మడియైన-దాగట్టు పట్టి
తన డింగరు మదుంగు-డక్కించు వేల్పు
బోడిక మఱుకువ-నోచ్చఁగొట్టు జేజె॥

766 జపాపుష్పని భాకృతిః

మంకెన విరివిడి-మైనొప్పు పడుచు
అడియని కిన్నత్తు-రలరించు వేల్పు
గల్ల పెట్టించు మం-దరి మేలుబంతి
మంచివారల సని-మ్మనుపు వెల్లంకి
సుడియల నెట్టఁగాఁజూచు శాబెత్తి॥

767 ఓజోవతీ

ఓరు, పలవు కడిమి-నొప్పారు జేజె
కొల్చు వారలకుఁగో-ర్కు లలర్చు తల్లి
ఎన్నడు న్బదురేదు-రెఱుఁగని దంట
ఎన్మిదవ మయివం-తెసఁగించు వేల్పు॥

768 ద్యుతిధరా

ముమ్మరమగు తళ్కు-పురుడించు పడుచు
ఎల్ల వేల్పులకు ని-గ్గలరించు జేజె
అడియని తళతళ-లాడించు తల్లి॥

769 యజ్ఞరూపా

వేలిమియఁడ పాడ-వెలితిప్ప టెంకి
పెరుమాళ్ల నిల్వ జా-బిలి తాల్పు రాణి
మనికి వేల్మి చెలువు-మల దొరపిల్ల
డింగరు చాగు బ-డికయుర్పు వేల్పు॥

770 ప్రియవ్రతా

వాలెము నోము స-ల్పఁగ నెంచు ముగిత
నోఁచెడి కొత్తడి-ప్రోబ్బెడు వేల్పు॥

771 దురా రాధ్యా

మొత్తము పైగొల్వ-ముగ్గొయ్య వేల్పు
వేలుపుడు సలుప-వీల్గాని జేజ॥

772 దురా ధర్షా

తెగ నాడరాని దెం-తే గట్టు పట్టి
కాని వారలుఁ గొల్వ-గడ్డగు వేల్పు
వెకలికి లొంగదు-వెలితిప్ప టెంకి॥

773 పాటలీ కుసుమప్రియా

కలిగొట్టు ననకు వే-డ్కఁ పడుమలప్ప
తెలుపెర్పు గలసిన-దిన్సుల కలరు
మంచివారల నెంచి-మనిపెడు వేల్పు॥

774 మహతీ

కొలఁది మీాటిన గొప్ప-గుబ్బలి పట్టి
లెంక వీనెవలెఁ బ-ల్కించెడి వేల్పు
నాల్గు తొమ్మదుల ప్రా-ల్నడిపెడి యదుగు॥

775 మేరు నిలయా

పొంగట్టి రవుకొను-ముక్కంటి వెలఁది
బోడిక నెల్ల మే-ర్వున నిల్పు వేల్పు॥

776 మందార కుసుమప్రియా

వాడిద పువ్వుల-న్వలచు గంగాన
కెళగునెత్తు కొల్వు-గీల్కొన మారి
తొలి సమర్త్తాడు నా-తుక పాడయుంకు
దొరపండ్ల న్దినఁ-దొడరెడి పడుచు
జాబుశా గాగరా-సవరించుపోతి
ఆడియరి న్గెంపులా-గలరించు వేల్పు॥

777 వీరా రాధ్యా

పోటు మగంద్ర వే-ల్పుదు గొనువేల్పు
డింగరు చాగుబ-డిక నోము జేజె
అడియరి నుక్కుతు-న్య నొనర్పు తల్లి

778 విరాడ్రూపా

నింగినేలల నిల్వ్వ-నిడుగట్టుపట్టి
అడియరి నెల్లెడ-నడరించు వేల్పు॥

779 విరజాః

అంటులే కలరారు-నాగట్టుపట్టి
వరవుల కీడెడఁ-బాపెడు వేల్పు॥

780 విశ్వతో ముఖీ

నింగినేలల నొళ్ళ-నగడెడు వేల్పు
అడియని కెల్లెడ-నగవడు జేజె॥

781 ప్రత్యగ్రూపా

విండారులో చూపు-నిలువైన తెల్వి
తనకొండు తలఁపక-తనరారు వేల్పు
అడియరి డొందమం-దలరెడు జేజ॥

782 పరాకాశా

డొందమందె సఁగుక-డిదిగాలి తండ్రి
దినుసు లెల్లఁ దనలో-దిగ్రమింగు నింగి
ఎన్నఁదరముకాఁకి-దీదో వెలుంగు
కొట్టకొసకుఁ దామి-గులు నల్లపిల్ల
అడియునికి ముగిసి-నలరించు వేల్పు
వరవుల కదుల-న్నాబ్రెడు జేజ॥

783 ప్రాణదా

ఐదుసురు లొసంగు-కాన్న తల్లి
అడియుకుఁ బెంద్రోవ-యురువిడు వేల్పు॥

784 ప్రాణరూపిణీ

ఊసురుల నిలువయి-యొప్పారు వేల్పు
తొడికకు ముగిసి-పొనరించు జేజ॥

785 మార్తాండ భైరవా రాధ్యా

చాగుబడిక సల్పు-సగ్గెడ నెండ
దొఱలాగు కన్నట్టు-దొడ్డమలప్పు
వరవు నిరుల గొంగ-వలె సల్పు వేల్పు

786 మంత్రిణీ న్యస్త రాజ్యధూః

ప్రగ్గడకుఁ దనయే-ల్బడి పూటమొత్తు
పటగలకు న్దన-పనినప్పగించు

నింగినేలల డియాని కలవరించి
యుగయుగము స్ఫాంద్రోవ-నలరించు వేల్పు॥

787 త్రిపురేశీ

ముమ్మేనుతే లెడి-ముద్దులగుమ్మ
బోడిక కెల్లయి-మ్ము లలర్చు వేల్పు॥

788 జయత్సేనా

నంజుడు దిండ్ల న-ణాఁచు మొనకత్తె
పగర నాల్గురలోనఁ-బరిమార్చు జెట్టి
ఎమ్యేడ స్వేఱు పా-టెఱుఁగని పిల్ల
లెంకచేఁ గంట్ల గె-ల్పించెడి వేల్పు॥

789 నిస్త్రైగుణ్యా

ముప్పొడులు డిగిన-ముక్కంటి వెలఁది
మున్నడు వడుఁగౌ-ముందొప్పు తెలివి
ముయ్యోజ లంటక-పోలుపారు జేజె
పపోకడలు లేని-దే గట్టుపట్టి
బోడిక మఱకువ-నొబ్బదుల్చు వేల్పు॥

790 ఏరాపరా

తనకంటు, కంటు లి-ద్దరులేని పడుచు
మీఁదు క్రిందెఱుఁగని-మొట్టుమేపుట్టు
విఱుఁగు తగ్గుగనని-పెంద్రోవ నిలువు
బోడిక నెల్లెడ-నొబ్బసఁగించు వేల్పు॥

791 సత్యజ్ఞానా నందరూపా

నిల్కడ, మెఱుకువ-నెమ్మియడపోడ
డింగరు ద్దనలోన-డిందించు వేల్పు॥

792 సామరస్యపరాయణా

తీయగా నందటి-న్దిలకించు తల్లి
పొత్తెల్లరికి గల్పు-పువ్వారుఁ బోఁడి
బోడిక న్బొందుమై-బాదలించు వేల్పు॥

793 కపర్దినీ

తిరిదాల్చు ముక్కంటి-తీరైన రాణి
మైమఱచిన బీద-మఱగినపిల్ల
తనుగొల్చు వారి చెంత నిలుచు తల్లి
కోర్కెలేనివాని-గూడు పడుచు
బోడికచేఁ గడు-న్బొగడొందు వేల్పు॥

794 కలామాలా

అందఱ నలరించు-నఱువదినాల్గు
చదువుదండలఁ దాల్చు-చలిమలపిల్ల
బోడిక నెల్లరు-న్బొగడు చెల్వమును
జదువరి మొనకాని-నల్పెడు వేల్పు॥

795 కామధుక్

విడిముడింగోర్కె లీడేర్చు-వేమఱుఁదను
గొల్చువారలకు న్వేల్పు-కట్టివలెను
తెంకల ముచ్చట-ల్దీర్చెడు జేజే
కంతుని వేల్పుడు-గను తెఱగంటి॥

796 కామరూపిణీ

కాగల యటులగు-న్గఱద కొలంది
అనుకొన్న యట్లుండు-నాసామితల్లి
కోరిన నిల్వఁగై-కొనెడు మలప్ప

కోర్కుల నాటాడు-కొనుపసిపాప
లెంక పట్టింపు చెల్లించెడివేల్పు॥

797 కలానిధిః

నిండు చలివెలుఁగు-నిల్వుమలప్ప
అడియని కనుపండు-వొగట్టుపట్టి
క్రాలును సురులకు-గ్రాణమా వేల్పు॥

798 కావ్యకలా

కమ్మని నుడికూర్పు-కలదనిల్వ
నొడికారమందున-మేల్కొను తెల్వి
మాటలల్లెడువాని-మైకొను వేల్పు
మంచి పలుకువాని-మరగునొయారి
తగు నుడికూర్పుల-న్దనుగొనియాడు
తన నుడియని వెంట-దానుండు వేల్పు
డింగరున్మించి నొడవులా-డించుతల్లి
దొడ్డవారలయిచ్చఁ-దులకించు వెలుఁగు
మ్రందినయుసురుల-గ్రన్బతికించుమందు

799 రసజ్ఞా

తొమ్మిది చవుల పం-తునిలువు వేల్పు
చొరుకా నేయగు-చలిమలపిల్ల
పెందెరవ యడపొడ-వెలితిప్పు టెంకి
బోడిక కెల్ల చ-వులు గుడ్పు వేల్పు

800 రసశేవధిః

చవినిగ్గు పంతర-చలిమలపిల్ల
బీదకు ముగిలి చొ-ర్వాట్టెడి వేల్పు
బోడిక న్వేడ్కలం-బాదలించు తేజ॥

801 పు

ఎల్లసాదరులని-ల్వేపారు వేల్పు
ఎపుడు డింగరులలా-వెక్కించు జేజె॥

802 పురాతనా

అన్నిదిన్నులకుఁ దా-నడువయా నంకు
నింగినేలలకు ముం-దే యొప్పు జేజె
అడియునిఁ జెంద్రోవ-నలరించు వేల్పు॥

803 పూజ్యా

వేల్పుడంద న్దగు-వెలితిప్పు లెంకి
వరపు చాగుబడిక-వఱలించు వేల్పు॥

804 పుష్కరా

తిరుపతి యడపాడ-స్దీ్రడించు వేల్పు
తగిన మేలొనరించు-తరవాయి నిలువు
అడియుంద్రకు న్మంచి-యుదనిడు జేజె॥

805 పుష్కరేక్షణా

తమ్ములవంటిక-న్దంటసీమాటి
అడియునిఁ జల్లఁగా-నారయు తల్లి
పగటి వేలుపునెల-ల్వారుసఁ బదాలు
ముచ్చు చుక్కలనుండు-పొద్దగు జేజె॥

806 పరంజ్యోతిః

వేల్పుల నల్లరి-న్వొలిఁగించు పంజు
పాడిపై నొప్పు గు-బ్బలియాఁడు పడుచు
జోడికి న్బంద్రోవఁ-జొల్పించు వేల్పు॥

807 పరంధామ

అప్పసమలశారు-నాకన్నతల్లి
శల, మెలకువ, కూర్కు-శరిమలపిల్ల
ఎల్లరికంటెఁ బై-నిరవారు జేజె
అడియనిఁ బెంద్రోవ-నలరించు వేల్పు॥

808 పరమాణుః

కొలువఁ దరముకాని-కొద్దిలోఁబిసరు
తెలియ శలవికాని-దేకన్నతల్లి
అడియనికి ముగితి-నలరించు వేల్పు॥

809 పరాత్పరా

ఎడవున కెడమైన-దేగట్టుపట్టి
చదువుల ముదుకడు-జాబిల్లి తాల్పు
కతివేల్పు ముప్వారి-కన్న కన్నాకు
లెస్స యంకులలో, వలి-కరువపిల్ల
కల తెఱఁగెఱుగ వీ-ల్కాని మలప్ప
అడియ నందటి పయి-నాడించు జేజె॥

810 పాశహస్తా

డాకయి పయికొర-డాకాల్చు మారి
గొంట్లఁ జేర్కొలతోఁ-గొట్టు పోలేరు
వరవుకంట్ల న్గేల-వదలించు వేల్పు॥

811 పాశహంత్రీ

ఖారీల ద్రుంచెడు-వలిమలపిల్ల
లెంకల ఛెఱవది-లించెడి వేల్పు॥

812 పరమంత్ర విభేదినీ

పగఱ మంతిరమూఁడ్చు-వలిగట్టుపట్టి
బోడిక కీడుల-నోఁగొట్టు తల్లి
పగటివేల్పు, మనువేర్పరచు తొఁత్రేఁడు
కడలిఁద్రాగిన బీద కలికి, వానీఁడు
కంతుడు, సామి, ము-క్కంటి బసవను
సోఁకులఁదిని తేను-చు తిరితాల్పు, నెల
బైఢాలము నిలువు-బాసవాల్డిగ్గి
పంద్రెండు వరవులి-బ్బడి గొల్చుజేజె॥

813 మూర్తా

శాన్పించు దినుసెల్ల-గట్టాడుపడుచు
తనవరవుల కట్వోఁ-దాల్చెడువేల్పు॥

814 అమూర్తా

అడమయితాల్చకే-యుప్పసం జొప్పెడున్
జోడిక తలఁపు ని-ల్వ్యగ్రాలువేల్పు॥

815 అనిత్యతృప్తా

అలరుచూడి తన్వోఁ బొందు-నాదమంచితోడుతన్
డింగరు మ్రొక్కు-బడిన్ద-న్యజేజె॥

816 మునిమానసహంసికా

బీదయూద కొలని-విడితూఁడుదిండి
గజ్జెలుకట్టి డిం-గరు నార్చువేల్పు
డింగరీని తెలివి-డినలర్చు జేజె॥

817 సత్యవ్రతా

పట్టిననోము త-ప్పని మగనాలు

వరవుల మంచి త్రో-వన్నడ్పు వేల్పు
డింగరు న్దగిన తిం-డి నలర్చు జేజ॥

818 సత్యరూపా

ఎన్నడు న్బగడలా-గే యొప్పు వేల్పు
కలతెఱంగు నిలువు-గ్రలేని బిడ్డ
డింగరు న్నిక్క-మా-డించెడి జేజ॥

819 సర్వాంతర్యామినీ

ఎల్లరి న్లోనిడి-యేలెడి వేల్పు
అందరి లోలోన-నరిగెడి జేజ॥

820 సతి

ముగిత నిల్కడ యడ-పొడ గట్టు పట్టి
వరవుఁ గ్రొత్తడిగ త-ప్పక సల్పువేల్పు॥

821 బ్రహ్మణీ

నిండు తనివి తన-నిల్పైన జేజ
వరవుల కున్బర-వ సమిడు వేల్పు
తాత కిల్లాలయి-తనరెడు నంకు॥

822 బ్రహ్మ

తాన పెంద్రోవమై-తనరారు జేజ
బోడిక నెఱుక ని-ల్వ్యాన నిల్పువేల్పు॥

823 జననీ

నింగి నేలలకుఁ దా-నే కన్నతల్లి
అంతయు న్గలిగించు-నాగట్టు పట్టి
బోడికకు న్మెలె-పొసఁగించు వేల్పు॥

824 బహురూపా

పెక్కు నిల్వల నొప్పు-వెలితిప్ప బెంకి
పగడ, మిఱు, పవాఱు-పదిమూళ్ల రెండు
నిలువుల నలరెడు-నిడు గట్టుపట్టి
బోడిక కెల్ల వె-ల్వు లలర్చు వేల్పు॥

825 బుధార్చితా

డింగరు చాగు బ-డిక గను జేజె
నోవరి, నిక మెఱుంగుట-కూను వాఁడు
కల్మి గోరువతి, డె-ర్కు నబరు నాఁతి
డీ నలువుర వేల్పు-డెపు డొందు జేజె॥

826 ప్రసవిత్రీ

నింగి నేలలకు దా-నే కన్నతల్లి
బోడికకు న్గల్మి-పొదలించు వేల్పు॥

827 ప్రచండా

తన సెల వెదిరించు-తంటాల మూర్ల
మిక్కిలి యలుకతో-గ్రింగెడు మారి
టాటోటుకాండ్ర న-డఁచుట్కి కాఁ వెత్తి
బోడిక పగఱఁ దు-న్మను బోలడాయి
తెలి గన్నరు విరులఁ-దీండ్రించు నంకు॥

828 ఆజ్ఞా

అన్ని వస్తువల నిలు-వౌ గట్టుపట్టి
వరవులకు న్మంచి-పని పన్పు వేల్పు

829 ప్రతిష్ఠా

నింగి నేలల, లో, వెలి-న్నిండు వేల్పు
బోడిక పేరు పెం-పు లలర్చు జేజె॥

830 ప్రకటాకృతిః

అందరు నేను నే-ననుకొనునదలు
తేట తెల్లంబగు—తెల్వియుడ పొడ
బోడిక కెల్లని-పొడకట్టు వేల్పు॥

831 ప్రాణేశ్వరీ

ఉసురుల నేలెడి-యొడయారి వేల్పు
వరవుల హాయిగా-బ్రతికించు జేజె॥

832 ప్రాణదాత్రీ

వరవు నుసురుల న-ప్పనమించు వేల్పు
మిక్కిలి యులవిడు-మెట్టాడు పడుచు॥

833 పంచాశత్పీఠరూపిణీ

ఐదు పదుల గద్దె-లడయగు వేల్పు
ఏఁబది వ్రాల ని-ల్వొసఁగెడి జేజె
తన లెంకకెల్ల ప-దవులీడు నంకు
బొడ్డుటవలి యడ-పొడ తెఱగంటు॥

834 విశృంఖలా

బారి కట్టెడపు కా-ర్బారి మలప్ప
డింగరు నెకిమీని-డీ కొల్పువేల్పు
అడియుని తప్పొప్పు-లరయని జెజె
వరవు విచ్చల విడి-బ్రతికించు తల్లి॥

835 వివిక్తస్థా

తేర నొంటిగ మునిగి-తి న్గొన్న పిల్ల
కడు మడిగా నుండు-గట్టాఁడు పడుచు
తెన్ను తప్పని దొడ్డ. తెఱ మేల్బంతి
అడియురి స్బంద్రోవ-నలరించు వేల్పు

ఏదియు న్లేనిచో-నలరారు జేజె
ఏతోడుసు న్గాన-కెలరెడు నెఱుక
మందికంపొప్పని-మంచి మలప్ప॥

836 వీరమాతా

కడు నోచుకొన్న డిం-గరుకన్న తల్లి
మేలందఱికి సల్పు-మేటరి యవ్వ
ఆట, పాటల మేటి-నలరించు వేల్పు
ఎంతయు హొంత క-త్తే గట్టుపట్టి॥

837 వియత్ప్రసూః

మబ్బు త్రోవకు తల్లి-మలదొరపిల్ల
తన లెంక గుండె చ-ద లలర్చు వేల్పు॥

838 ముకుందా

పెంద్రోవ వెట్టెడు-వెలితిప్ప లెంక
అడుగు చెమ్మట లాని-యడపొడ వేల్పు
ఆలుమగలు తానె-యా గట్టుపట్టి
బోడికకెల్ల యి-మ్ము లిడెడు వేల్పు॥

839 ముక్తినిలయా

అచ్చోటు, చేరు ప-య్యెడ, యక్కలయిక
యీనాలుగు న్గామి-యేనుము గుతుల
నెలవయి యలరారు-నిడుగట్టు పట్టి
డింగరు న్బెంద్రోవ-డెక్కొల్పు వేల్పు॥

840 మూలవిగ్రహరూపిణీ

మొదటి బొంది నిలువు-ముక్కంటి వెలంది
బోడిక మేని ని-ల్వాన నొప్పు వేల్పు॥

841 భావజ్ఞా

పాడితోఁడఁ దెలియఁ-బడుగట్టుపట్టి
చదువరి కగపడు-జ్జలిమలపిల్ల
లందటి యూదల-నారయు వేల్పు
డింగరు చిందుగ్గ-డించెడి కేజె॥

842 భవరోగఘ్నీ

పుట్టువు నలఁకువ-నొప్పఁగొట్టు వేల్పు
వరవులకు ముగిఱి-వఱలించు కేజె
మంది తెవుళ్ళకు-మందు మలప్ప॥

843 భవచక్రప్రవర్తినీ

ముక్కంటి యుల్లము-న్మెచ్చుకొన్న దణి
మంచినడత లెల్ల-మప్పెడు తల్లి
బోడిక పెద్దకా-పుక మేలు వేల్పు॥

844 ఛందస్సారా

ప్రాఁబలుకుల నిగ్గు-వలిమలపిల్ల
అడియనికి ముగిఱి-నగపర్చు వేల్పు॥

845 శాస్త్రసారా

చదువుల నికరము-చలిమలపిల్ల
అడియనికి న్మిడి-యలునేర్పు వేల్పు॥

846 మంత్రసారా

మంతనముల గుట్టు-మట్టుమలప్ప
నమ్మికము కొలంది-నడతెంచు వేల్పు
అడిమరి కంతయు-నగపర్చు వేల్పు॥

847 తలోదరీ

అట్టడుగు నేల కొ-నలరారు వేల్పు
అన్నింటి కొనుతా-నైన మలప్ప
అడియూరి కలఁతి క-ద్పలరించు నంతు
మీఁదు క్రిందుల హద్దు-మీఱిన జేజె
ముంగేల నిముడు న-ద్మ తనరు పడుచు॥

848 ఉదారకీర్తిః

తనయడియని-కొసఁగు పేరు పెంపుల
ఎల్లెడల న్వ్యాసి-కెక్కిన వేల్పు
అన్ని యసురులు దా-నౌను మలప్ప॥

849 ఉద్దామవైభవా

తనుఁ గొల్చువారల-న్దొలెడఁ బాపి
పెంద్రోవ నడిపించు-వేలుపుమిన్న॥

850 వర్ణరూపిణీ

ఎల్ల తెగల తగు-నేర్పాటు నిలువు
అఱువదినాల్గు వ్రా-లడయగు జేజె॥
వ్రాయన కాని వ-రవు సల్పు వేల్పు॥

851 జన్మమృత్యుజరాతప్త జనవిశ్రాంతిదాయినీ

పుట్టువు, గిట్టింపు-ముదుసుల నుడుకు
మందికూరట నిడు-మలదొరపిల్ల
ఎల్లరికి న్మేలె-యొసఁగించు తల్లి
గుసిగుంపులు డ్పియు-ద్మ్కవ నిచ్చు జేజె॥
అడియని న్పెంద్రోవ-నలగించు వేల్పు॥

852 సర్వోపనిషదుద్ఘుష్టా

గొప్పమిన్కు లతల-గ్గాని యూడు వేల్పు
అడియరి కెఱుకువ-నలరించు తేజ॥

853 శాంత్యతీతకలాత్మికా

మింటికిఁ బైమించి-మిగిలిన వేల్పు
నెమ్మికిఁ బైమెట్టు-నిడుగట్టుపట్టి
అడియరి స్వాంద్రోవ-నలరించు తేజ
నాలవయున్కిపై-నలరారు సంకు॥

854 గంభీరా

కడకానిలోఁ తెలుం-గ న్వీలు కాదు
తనకు క్కి-యేరికి-న్దరము తెల్యుటకు
నింగినేలలు మించి-నెగడెడు మడుగు
తలఁపున కైనసం-దదు గట్టుపట్టి
మీఁదుక్రిందుల హద్దు-మీఱిన వేల్పు
బోడిక మరవెలి-పుచ్చని తేజ

855 గగనాంతస్థా

ఆదలో నివ్వాల-నాపయిమచ్చ
యుంగముతో మిన్ను-నలమిన తల్లి
వెలుపల లోపల-న్వెలిఁగెడు వేల్పు
అంతయు న్దాని యా-నా నల్లపిల్ల
డెందము చదలున-ణ్మి వలరు తేజ॥

856 గర్వితా

కడుమంచి తగవర్లఁ-గాంచిన తల్లి

నింగినేలలఁ బన్ని-నిక్కెడు పడుచు
నంజుడు దిండ్ల న-ణంచెడు జేజె॥

857 గానలోలుపా

ఆట, పాట, వాయింపుల-కలరు పిల్ల
మాటలల్లువాని-మరగినపడుచు
తనుగొల్చువారి నో-దార్చెడి తల్లి
సీకారిపై వల-చిన మలబిడ్డ॥

858 కల్పనారహితా

ఎప్పటికి నిండు తన్వి తో-నసఁగు జేజె
అనయము ముగితి ని-ల్వాగు గట్టుపట్టి
అడియరి స్బంద్రోవ-నలరించు వేల్పు॥

859 కాష్ఠా

కలుగు నన్నిటి చేరు-గడయగు వేల్పు
తెప్పపాటంకె నిలువునీ-తెడు మిటారి
అంతయు న్దానెమై-యులరారు పిల్ల
డింగరు ద్దనలోన-డిందించు జేజె॥

860 అకాంతా

అడియకు కొందల-మడచెడు వేల్పు
బోడిక కీడుల-నోర్చుడుల్చు జేజె॥

861 కాంతార్ధ విగ్రహా

వంచ పాల్మగవాఁడు-పగడవంతింతి
యాల్మ గల్తనకుఁ దా-నగు వేల్పు మిన్న
పలు నిలువుల నగ-పట్టెడు జేజె॥

862 కార్యకారణ నిర్ముక్తా

కతము కొంటియు రెండు-కా దెదిమైన
కతము, పనియు రెండు-కలుగని వేల్పు
నింగినేలలి వికా-నియ దేదో జేజ।

863 కామకేలీతరంగితా

కవఁగూడు ఆల్మగల్క-యికపోడ
ఎల్లరికోరిక-లీడేర్చు తల్లి
తలపుల నిలువయి-తనరారు వేల్పు
కోరనికోరిక-ల్కురియించు జేజ।

864 కనత్కనకతాటంకా

అపరంజి కమ్మల-నలరారు పకుచు
అడియండ్ర మనవుల-నాలించు వేల్పు।

865 లీలావిగ్రహధారిణీ

తనకోరినట్లొడ-ల్దాల్చెడు వేల్పు
డప్పుతో నాడుదం-టపయిడి తల్లి।

866 అజా

అరిది పుట్టకే యున-యుంబలరారు
అప్పసము వరవు-నలరించు వేల్పు।

867 క్షయవినిర్ముక్తా

నిప్పచ్చరము లేని-నిడుగట్టుపట్టి
బోడిక బ్రతుకులో-ముగిశిడు వేల్పు।

868 ముగ్ధా

ఎంతయో సొగసైన-దే గట్టుపట్టి
బోడిక నొంటపరి-న్చెనరిం మక్కివేల్పు

869 క్షిప్రప్రసాదినీ

రివ్వునఁ దనడెంగరీనికిఁ దోఁచి
కోర్కెలన్నియు వెల్లి-గురియించు వేల్పు
తక్కిన జేజేలు-తముగొల్చువారిఁ
దడవు సలిపి కాచ-దరుగాని తనదు
వరవు బిరానగా-పాడుమలప్ప॥

870 అంతర్ముఖ సమారాధ్యా

లోవెల్గు గను లెంక-లు గొలుచు వేల్పు
డెందము నిలుపు బో-డికనేలు జేజె॥

871 బహిర్ముఖ సుదుర్లభా

వాలకముఁ కు లోఁ-బడకుండు వేల్పు
పై చూడ్కి కందదా-పలిమలపిల్ల
బొందిమఱచు వర-వు న్గాచు జేజె॥

872 త్రయీ

తా ముచ్చదువులమై-తనరారు వంకు
పనికత్తె, పనిముట్టు-పనిదైన యొఱుక
మూఁడుత్రోవల నేలు-ముప్పొకలాఁడి
వేల్పుల ముప్వర-న్వెలయించుతల్లి
మీఁద, నడుమఁ గ్రింద-మెలఁగెడు పడుచు
బోడికన్మ త్తెర-వులనేలు జేజె॥

873 త్రివర్గనిలయా

ముచ్చగుమి యిరవు-మక్కంటి వెలఁది
కూరుకు, కల, మెల-కువల కాణాచి
లెంకకుఁ బాడి, క-ల్మి, తమినొసంగుఁ

గోరని కోర్కెగా-గుబ్బలిపట్టి
ముత్తగులందున-జాల్వారు వేల్పు
ఓమను వ్రాల్మాట-నొప్పారు జేజ॥

874 త్రిస్థా

మూఁడు లెక్కల నిల్చు-ముద్దులగుమ్మ
ముచ్చోట్లు, చదువులు-మూఁడు, ముత్తెగలు
దారులు, ముచ్చ, వ్రై-దారలు, మూఁడు
కోర్కెలుతివ, వెలుఁగులు, మూఁడు, మేళ్ళు
మూఁడు పాదులుమూఁడు,-మూఁడుపలుకులు
దోసఁగులుమూఁడు, బ్రతుకు తీర్లుమూఁడు
తరుణము ల్మూఁడి డ-తఱులిరువంచ
కొలతలు మూఁడెఱు-కువలు మూఁడిటుల
బలుమూళ్ళ నిల్వగు-న్వలిగట్టుపట్టి
గుండని ముత్తెఁగుల నేలు వేల్పు॥

875 త్రిపురమాలినీ

ముత్తెఁగులమేని-ప్రోలుల నిలువు
గుండెపటి మొనల-గుడుసగు వేల్పు॥

876 నిరామయా

ఎప్పుడే తెవులేని-నెనయని పసుచు
హాయిగా వప్పున-మలరారు పిల్ల
అడియ రిన్నుందోర్వ-నలరించు వేల్పు॥

877 నిరాలంబా

ఏ యూఁతము న్గొనకే యొప్పు వేల్పు
వరవుఁ దనంతట-న్వఱలించు జేజ॥

878 స్వాత్మారామా

ఆఁడుది మగవాఁడు-నై తనయంతఁ
దనకుఁదాఁ గలయిక-నదరారు వేల్పు
గుండడై తానాడు-కొనుచుండు వేల్పు॥

879 సుధాసృతిః

వేల్పుల కూడు గు-ప్పించెడి వేల్పు
గుండనికి నవి-గుడ్పెడు తేజె॥

880 సంసార పంకనిర్మగ్న సముద్ధరణ పండితా

లొంగి జంజాట మూబి ము-నుంగు డింగ
రీం[డఁ బైకెత్తెడి వెలవ-రి తలకట్టు॥

881 యజ్ఞప్రియా

వేలిమి నొగ్గెడు-న్వాలితిప్ప జెంకి
చాగుబడిక నెంచుఁ-జలి గట్టుపట్టి
గొబ్బున వరవు కో-ర్కులఁ దీర్పు వేల్పు
కలుపుగోలు తనమ్ము-గలది మలప్ప
పెరుమాళ్ళపైఁ గూర్మి-వెలయించు తేజె॥

882 యజ్ఞకర్త్రీ

వేలిమి కార్బారి-వెలిదొర రాణి
తన పనివారల-నగునట్లు పన్పి
యెప్పటికి న్వేల్మి-యే సల్పు వేల్పు॥

883 యజమాన స్వరూపిణీ

వేల్మి వాని నిలువు-వెలిదొర రాణి
నింగి, గా, డై్పరువు-నీళులు, పొరి

నెల, పొద్దు, సురను నె-న్మిది బొందు లెసంగ
లెంకల బ్రతుకు వే-లిమి నల్పు వేల్పు॥

884 ధర్మాధారా

పాడి కంతకుఁ దాన-పాదైన వేల్పు
ఏయే నాడుల వారల
కాయూయి తగు నడువడుల-నడరించుచుఁ దా
నే యెడల నైనఁదగ వెడఁ
బాయక తనరారు గట్టు-పట్టి సిరాజీ
అడియని మేలున-కండయౌ జేజె॥

885 ధనాధ్యక్షా

ఆస్తి కేలిక యన-యము గట్టు పట్టి
డింగరు నెఱుక పో-డిమి నేలువేల్పు
కాయకంటి నిలువు-గాలెడు జేజె॥

886 ధనధాన్యవివర్ధనీ

అడియర్ల కాస్తి కొ-ల్పడరించు వేల్పు
కొలుచు వారలకుఁ గో-ర్కు లలర్పు జేజె॥

887 విప్రప్రియా

నాల్గు చదువులలో-నన్గడి తేటి
నేటు నడత నొప్పు-నేల వేలుపుల
పొత్తున మెలఁగు నె-ప్పుడు గట్టుపట్టి॥

888 విప్రరూపా

పనస నేర్పరి పొడ-వలిమల పిల్ల
ఇరు బుట్టువుల నిలు-వేపారు వేల్పు॥

889 విశ్వభ్రమణకారిణీ

నింగి నేలలఁ ద్రిప్పు-నిడు గట్టు పట్టి
అడియంత్ర మంచి కై-యల్లార్చు వేల్పు

890 విశ్వగ్రాసా

నింగి నేలల కడి-మ్రింగెడు మారి
డింగరు న్దనలోన-డిం దించు వేల్పు॥

891 విద్రుమాభా

గసి రావలెఁ జెలంగు-గట్టాడు పడుచు
విన్నాణి చెంగటి-వలిమ్రాను వేల్పు॥

892 వైష్ణవీ

పెరుమాళ్ల చేవయే-వెలిదొర రాణి
కలిమి చెలి నిలువు-గట్టాడు పడుచు
బోడిక పగతులఁ-బొలి యించుమారి॥

893 విష్ణురూపిణీ

అడుగు చెమ్మటలాని-యడ గట్టు పట్టి
ఎల్లదిన్నుల నిలు-వేముల పిల్ల
అడియరి తానమై-యలరారు వేల్పు॥

894 అయోనిః

అంటు తన కేకతం-బైన నంట కొప్పు
కతన లేక తనంతఁదాఁ-గ్రాలు వేల్పు
తల్లి దండ్రుల కొడవకే-తనరు పిల్ల
కొలత కందనిచోట నె-క్కొన్న పడుచు
తనవలె బోడిక-న్దనరించు జేజె॥

895 యోనినిలయా

ఒడికట్టు సుడినెప్పు-డొప్పారు వేల్పు
అన్ని దిన్నులఁ దన-యుందెడిందించు
పనుల కెల్లఁ గతంబు-వలిమల పిల్ల
ముగితి తావలమయి-పోల్చెడి తేజె॥

896 కూటస్థా

నింగి నేలల నెల్ల-నివ్వెరన్నదుపు
తెలిసీ తెలియనట్లు-తిరిగెడు పాప
ఎల్లప్డు పగడలా-గే యొప్పుపిల్ల
తుద, మొదలు, నడిమై-తులకించు వేల్పు
కదలిక లేక ని-ల్కడఁ జొల్పు తేజె॥

897 కులరూపిణీ

తనలోన నేల నం-తయుఁజేర్చు వేల్పు
ఎల్ల పదుగులు తా-నే యగు తేజె॥

898 వీరగోష్ఠిప్రియా

మంచివారి హజుర్లు-మురగిన వేల్పు
మాసటీంద్ర కొలువు-మైకొను తేజె
అడియర్లఁ జదురున-నలరించు తల్లి॥

899 వీరా

ఎంతయు హరాంతక-త్రేగట్టుపట్టి
పెనిమిటి కొడుకుల-న్వాలసెడిముగతి
పాత్రతల గొప్పవాం-డ్రెన్నలుప్పవేల్పు।

900 నైష్కర్మ్యా

అన్నిపనులుసల్పు-నటుతోఁచుఁగాని
యెయ్యది యున్జేయ-దే గట్టుపట్టి
ఎప్పుడున్బగడలా-గే యొప్పువేల్పు
వరవెట్టు లున్నఁగా-పాడెదు శేజె॥

901 నాదరూపిణీ

మంచిజవలి నిల్వు-మలదొరపిల్ల
అంతటికి న్గత-మై యొప్పువేల్పు
కొల్చువానిన్బాట-కులమేటిసల్పి
బాలాయమొనలేని-వాసికెక్కించి
యెంతయు న్గూర్మితో-నేలెదు శేజె॥

902 విజ్ఞానకలనా

పెందోవ యడపాడ-వెలిదొరరాణి
చవిఁద్రావమరగిన-చలిమలపిల్ల
అన్నిచదువులడి-యకునేర్పువేల్పు॥

903 కల్యా

చదువులందారి తీరున-చ్చాళివడుచు
పాడి నెల్లపలుకుల మా-టాడుపిల్ల
అన్ని కోపులనిలువగు-నలరుఁబోఁడి
ఎన్నడు న్దవులంటని-పిన్నపాప
కొలుచు వారలకెల్ల మేఁ-ళ్ళలుపువేల్పు॥

904 విదగ్ధా

ఎంతయు నేర్చిన-దేగట్టుపట్టి
బోఁడికకెల్ల నే-ర్పులు మప్పువేల్పు॥

905 బైందవాసనా

ఉచ్చినెల కురిచీ—నొప్పారు పడుచు
కొలువుకాని నవి(-గ్రోలించు తల్లి॥

906 తత్త్వాధికా

మిన్ను నేలలు త్రుంగ—మిగిలిన నిగ్గు
పగడ గమనిక నె-ప్పటి కొప్పు దినుసు
అన్నియు న్దానెమై-యలరారు నెఱుక
ఎల్ల దిన్నుల మించి-మెలరెడు వేల్పు
వరవులానిక వీ నె-వాయింప నలరు
ముగితి మాగాణి య-మ్ముక్కంటి రాణి॥

907 తత్త్వమయీ

ఎప్పుడున్నబడగ మే-లే నల్పు తల్లి
తనకంటె మఱి వేఱు-తలపని పాప
ఎల్లరెఱింగి న-దే గట్టు పట్టి
తాను నిక్కువము-తనరారు పిల్ల
అంకెకు లోంబడ-కాటాడు పడుచు
ఉన్కి, ని, గ్గలరుల-రోజ మలప్ప
అడియనికి ముగితి-నలరించు వేల్పు॥

908 తత్త్వమర్థ స్వరూపిణీ

నీవది యను నుడ్ల-నిలువు మలప్ప
నిక్కమైన దినుసు-నిడు గట్టు పట్టి
ఎట్లనుకొన్న న-ట్లే యొప్పు పడుచు
తేలేదు, కాకాదు-లే మెమ్మెలాండి
చెడ్డకు సేగి, మం-చికి మేలె నల్పు
నెఱింగియు నెఱుంగ న-ట్లే మెచ్చులాండి

తోఁచియు న్దోఁపక-దొంగాటలాడు
నడియుని తోఁచుత-నాసామి తల్లి
ఎప్పుడు స్బగడ మే-లే సల్పు వేల్పు
ముక్కంటి యుసురుల-పొడయగు జేజె॥

909 సామగానప్రియా

పాట పనసకు మెచ్చు-వ-పడెడు వేల్పు
కమ్మపల్కుల బోడి-క కలర్చు వేల్పు॥

910 సౌమ్యా

మేల్పుల్ల తీగవే-ల్మికిఁదగువేల్పు
అడియని నెలవలె-నలరించు జేజె
ముక్కంటి తానయ్యె-పొల్చు మలప్ప॥

911 సదాశివకుటుంబినీ

మేలిమి మెట్ట వి-ల్మోటి ప్రోయాలు
డింగరు న్మేలు గ-డింపించు వేల్పు॥

912 సవ్యాప సవ్యమార్గస్థా

కుడిడా తెరువుల నె-క్కొను గట్టు పట్టి
కొల్పు కొలందిఁ జే-కుఱు నిలువేల్పు
ఎండ, మంచు తఱుల-నిరువారునంకు
క్రిందు మీఁదుల గ్రిక్కి--రిసియొప్పు జేజే॥

913 సర్వాపద్వినివారిణీ

ఇడుముల్ల నన్నిఁటి-నెడలించు తల్లి
వరవు నిక్క-ల్లెల్లఁ-బాపెడు జేజె॥

914 స్వస్థా

వేల్పునగరులోన-విడిసిన జేజె
వరవుల తోరిమి-న్వఱలించు తల్లి॥

915 స్వభావమధురా

మంచిపాడి నలరు-మలదొరపిల్ల
వరవు నింపగు నోజ-వఱలించు వేల్పు।

916 ధీరా

తాలిమి నలరు నెం-తయు గట్టు పట్టి
ఆడియునికి స్జైవ-నలరించు వేల్పు
అరువిడు పసవ నాఁ-డలరెడు జేజె।

917 ధీరసమర్చితా

గొప్ప చదువరులు-కొండాడు వేల్పు
బోడిక కెల్ల నేర్పు లలర్చు జేజె।

918 చైతన్యార్ఘ్య సమారాధ్యా

లోఁజాగుబడికకే-లోఁగు వేల్పు
పై వేల్పుడునకుఁ జో-ప్పడరాని జేజె
సిక్కుపు డింగరీ-నికిఁ జిక్కు నంకు।

919 చైతన్య కుసుమప్రియా

ఉల్లము ననఁగొని-యుప్పొంగు పడుచు
పొరలేని యాదపు-వ్వన్దాల్చు పిల్ల
డింగరు మంచి న-డ్పించెడి వేల్పు।

920 సదోదితా

తన డింగరీని ముం-దలఁ దోఁచు వేల్పు
ఎప్పుడు న్బగడ లా-గే యొప్పు జేజె।

921 సదాతుష్టా

ఎప్పటికి న్దన్వి-నింపారు తల్లి
బోడిక కెల్ల త-న్పు లలర్చు వేల్పు॥

922 తరుణాదిత్యపాటలా

లేఁజీఁకటుల గొంగ-లీల నప్పసము
తెలుపు మించిన మెర్పు-తెలివొప్ప పడుచు
పొలయుల్క-చిలునగ-వుల ముద్దులాఁడి
లెంకఁ గ్రొంబ్రొద్దు వ-లె నలర్చు వేల్పు॥

923 దక్షిణా దక్షిణారాధ్యా

పొలమానువారి వే-ల్పుడుగోను వేల్పు
కుడి, నడువడి కొల్పు-గొనెడు మలప్ప
నేర్పరి కగపడు-నిడు గట్టుపట్టి
లెంకపెట్టున కంగ-లించెడి జేజె
అడియని కెలపర్వ-మలరించు తల్లి
తన కొల్వుసల్పు వందటేఁ గూడఁబగడ
తీరునఁ గాపాడు-తెలిదొర రాణి॥

924 దరస్మేరముఖాంబుజా

పలువర్స పైకిఁ దోఁ-పని వింత మొలక
యలరింత నొత్తమ్మి-నలరారు వేల్పు
అడియని కెలనగ-వలరించు జేజె॥

925 కౌలినీ కేవలా

తటి నిలువయి యోజ-దై వారు వేల్పు
పాడి యేదియు లేని-పగడ మెఱుకువ
తానెయడి యరిదై-తవరెడు జేజె॥

926 అనర్ఘ్యకైవల్యపదదాయినీ

అడియరి న్దవలోఁ జేర్చి-యప్పసంబు
విలువలేని కలిమి నిడు-వేల్పు మిన్న॥

927 స్తోత్రప్రియా

పొగడు కోలనకు ను-ప్పొంగెడు వేల్పు
డింగరీంద్రు నొబ్బగ-డింపించు జేజ॥

928 స్తుతిమతీ

కొండాడఁ దగినది-గుబ్బలి పిల్ల
కొల్చువారల మెప్పుఁ-గొల్పెడు వేల్పు॥

929 శ్రుతిసంస్తుత వైభవా

తొలుఁ బల్కులు పొగడు-తొంగలి వేల్పు
డింగరుఁ గడుఁ బొగఁడింపించు జేజ॥

930 మనస్వినీ

తనకు లోఁబడిన డెం-దములరు పనుచు
మంచి యుల్లం బొప్పు-మలదొర పిల్ల
బిగియాద లెంకకు-వెలయించు నంతు॥

931 మానవతీ

గడిఁదాట దెపుడు ము-క్కంటి వెలంది
వరవుల న్నేర్మిమై-బ్రతికించు వేల్పు॥

932 మహేశీ

ఈ నింగి నేలల-నేలెడు వేల్పు
ముక్కంటిడా మేనఁ-బొల్పారు జేజ
డింగరు మ్రొక్కు పా-టించెడి తల్లి॥

933 మంగళా కృతిః

మేలు నిల్వొప్పారు-మెట్టుమే పుట్టు
బోడికకు న్మంచి-పొసఁగించు వేల్పు॥

934 విశ్వమాతా

మిన్ను నేల పగడ-మెటికె నిముడ్చు
మడికాసు మలతేని-మంచి యిల్లాలు
మొసలి వారియింట్లఁ దా-ల్పున్నన్న తల్లి॥

935 జగద్ధాత్రీ

ఈ నింగి నేలల-కెల్లఁ గాణాచి
పోసనా లిప్పించి-పోచెడి తల్లి
ఆస్తికిఁ దావలం-బా గట్టు పట్టి
కొలిచెడి వారల-కున్నట్టుఁ గొమ్మ॥

936 విశాలాక్షీ

గొప్ప కన్నుంగవ-గుబ్బలి పిల్ల
మంచిచెడ్డ లఱయు-నులదొర బిడ్డ
బోడిక న్జల్లఁగాఁ-జూడగాంచు వేల్పు
నింగి నేలల వెల్ల-నిండిన తేజ॥

937 విరాగిణీ

మరులు మానుకొనిన-మంచి ప్రోయాలు
బోడిక జంజాట-మున్నాన్ను వేల్పు॥

938 ప్రగల్భా

అన్ని పనుల లోన-నారి తీఱినది
ఎల్ల పల్కుల నేర్పు-నెలనాగ మిన్న
అడియు రిన్నోబ్చు సే-ర్పలరారు వేల్పు॥

939 పరమోదారా

గొప్ప యీవి నొసంగు-గుబ్బలి కూఁతు
వరవులకుఁ దనర్పు-వఱలించు వేల్పు॥

940 పరామోదా

కడఁగి పెంద్రోవ వే-డ్కన్మించు వేల్పు
బోడిక కెల్ల యి-మ్ము లలర్చు తేజ॥

941 మనోమయీ

ఉల్లము నిలువయి-యొప్పారు వేల్పు
కోరిక యడపొడ-గుబ్బలి పట్టి
లెంకల ముద్దు చెల్లించెడి తేజ॥

942 వ్యోమకేశీ

చదలుఁ గొప్పు ముడుచు-చలి గట్టు పట్టి
వినుతీరి వేలుపు-న్బెండ్లాడు పడుచు
అడియని గుండె మి-న్నలరించు తేజ॥

943 విమానస్థా

మినుబండిపై నొప్పు-మెట్టాడు పడుచు
తెలిగంటుల నిలువు-తేరెక్కు వేల్పు
అలవి కానిది లేని-దాగట్టు పట్టి
అడియరి నడ్డులే-కరిగించు తేజ॥

944 వజ్రిణీ

తెలిగంట్ల తేని పొ-ల్తి నిలువు వేల్పు
మూలతా తొడవుల-న్బొల్చు మిటారి
మంచి డెందమునంద-మరుకొను తేజ॥

945 వామకేశ్వరీ

ఏను వేల్పుల మాను-నెడము వడువడి
యొసఁగించు వరవుల-నేలెడు వేల్పు

తన డింగరుండు తప్పం-ద్రాగక కాంచు
వమల కున్నపుడె?యెం-తయుం గాంచు నంతు
తనుంగొల్చు మంచి యా-ద నలరు జేజె॥

946 పంచ యజ్ఞప్రియా

అయిదు వేల్మ్రల చను-వలరెడి వేల్పు
కన్ను, ముక్కంట, లా-గరి, నాల్గు వనుల
నేను వేలుముల లా-గించెడి జేజె॥

947 పంచప్రేత మంచాధి శాయినీ

తాత, కటివేల్పు ముజ్జంక-తాల్పులీయ
యిదుగురు న్గూడ బడుగుల-కుదిరికం దడి
నెవస్సి?కంకటులటు నేల-బడినవారి
మీంద హాయిగాం బన్నండు-మెట్టపట్టి
బోడ, యూబ, యువిటి,-ములుచ పెడంగు,
కుక్కలీ యుత్త బ-డ్గులం బవళించు
గుండని గుండె మే-ల్కొనెడి మలప్ప

948 పంచమీ

నింగి మైదవ దిన్ను-నిల్వగు వేల్పు
మొలకువ కయిదయి-మిగిలిన నిగ్గు
వ్రాల వర్సల నైద-వ "మ" యను వ్రాయి
ఐదుసురుల మొద-లా గట్టుపట్టి
కులుకు పదాతేండ్ల-గుబ్బలి పట్టి
అయిదవ అవలి ని-ల్వో సామి తల్లి
ఏపుర జేజేల-కెల్ల సిరాజి
డింగరు కూడిక-న్దికొల్వు నంతు

949 పంచభూతేశీ

నేల, తడి, నిప్పు, కరువలి,-నింగులయిదు
కడఁక నేలెడు వలిమల-కన్నబిడ్డ
ఐదుదిన్నుల యొడ-ళ్ళలరించు వేల్పు॥

950 పంచ సంఖ్యోపచారిణీ

ఆరు పదుల నాలు-గైన నల్నాల్గు
గాని యేదైన లె-క్కల చాగుబడిక
చేయువాఙల కోర్కె-చెల్లించు జేజె
విఱి, పొగ, తావి, దీ-విటి, తిండియైదు
కోపుల వేల్పుదు-ల్కొల్పించు వేల్పు॥

951 శాశ్వతీ

అనయ మలరుచుండు-నాకన్నతల్లి
వరపులవాలెము-వఱలించు వేల్పు॥

952 శాశ్వతైశ్వర్యా

ఎప్పటికి న్గల్మి-నెలరారువేల్పు
కలిమి నప్పనము డిం-గరు నేలుజేజె॥

953 శర్మదా

లెంకకు హాయివా-లెమొసంగు వేల్పు
ఎల్లవసతులిడు-నేకన్నతల్లి
పెంద్రోవ పట్టెడు-వెలిదొరరాణి॥

954 శంభుమోహినీ

వాఁకతాల్పు న్గూర్చ-వలపించు పడుచు
కొలువుకాని న్మరు-ల్కొల్పెడు వేల్పు॥

955 ధరా

నేలయుంతయును దా-నేగట్టుపట్టి
డింగరికి వెలపు-ట్టించెడి వేల్పు॥

956 ధరసుతా

తలకని వలిమల-దణియాడు పడుచు
తనుఁగొల్చు మెల్లగ-ద్దతికాంద్ర తల్లి
తామేటి ౘెవలె-న్దానేలమోచు
అడియుసికి న్గూతు-రై పుట్టు వేల్పు॥

957 ధన్యా

అన్ని కలుముఁలనిం-డారిన వేల్పు
ఏకొంతయుఁగాన-కెలరెడు జేజె
దొడ్డవారలకుఁ బెం-ద్రోవ నొసంగు
ఎల్లడింగరుల నొ-డ్డెక్కించుతల్లి॥

958 ధర్మిణీ

తగవును పాడిమ్మై-దనరారు జేజె
తగునటు లెల్లరి-న్దగ వెసఁగించు
ఆదట న్గాపాడు-నల్లమలప్ప
వరవునెంతయు దగ-వరిసల్పు వేల్పు॥

959 ధర్మవర్ధనీ

దొడ్డనడువడి, పెం-దోవ తలంపు,
పొదలించి డింగరు-న్బోచెడివేల్పు॥

960 లోకాతీతా

నుచ్చునపై నుడి-న్బోల్పారు తెలివి
అడితునందరి మించు-నటుసల్పు వేల్పు॥

961 గుణాతీతా

ఏయోజయు న్గొన-కే యొప్పునంకు
తానేది కాంబోక-తపరారు జేజ
నింగికి న్గూడందా-నే కన్నతల్లి
అన్నిదిన్సులకు ముం-దాకల తెలుగు
ఏ తెల్వి కందకె-ల్లే యున్ననికము
డింగరు న్దనలోన-డిందించు వేల్పు॥

962 సర్వాతీతా

నింగినేలల మించి-నెగడెడు వేల్పు
వరవుతానే యయి-వటిలెడు జేజ॥

963 శమాత్మికా

తాల్మియే తానయి-తనరారు తల్లి
అడకువ గలవారి-యుందొప్పు వేల్పు॥

964 బంధూకకుసుమప్రఖ్యా

మంకెన విటిడాలు-మైమించు పడుచు
అడియంద్ర కెల్ల నె-త్రలరించు వేల్పు॥

965 బాలా

తొల్మిదేడుల యీడు-తులకించు పడుచు
ఎల్లపన్నికకుం జాంనే తొలి నిలువు
డింగరు నాటలా-డించెడు వేల్పు॥

966 లీలావినోదినీ

ఎల్లదిన్సుల వేడ్క-కే పన్ను వేల్పు
అడియని హాయిగా-నాడించు జేజ।

967 సుమంగలీ

కొ్రత్తడి మేల్బంతి-గుబ్బలి పట్టి
తన డింగరికి మేలు-తెనరించు వేల్పు॥

968 సుఖకరీ

లలిడింగరికి సుమా-శము సల్పు వేల్పు
ఎల్లయిమ్ములకుఁ బు-ట్టిలు గట్టుపట్టి॥

969 సువేషాఢ్యా

మంచి కోలము దాల్చు-మలదొరపిల్ల
బోడిక కెల్ల తో-డ్వలలర్చు వేల్పు॥

970 సువాసినీ

ముక్కంటి నెడబాయఁ-బోని మలప్ప
అడియని గొ్రత్తడి-యై కొల్చు వేల్పు॥

971 సువాసిన్యర్చనప్రీతా

ముగిత వేఁల్పదున కు-ప్పొంగెడు వేల్పు
మంచివాఁతల కొల్పు-మైకొను కెజె॥

972 ఆశోభనా

అలరుచుఁడు మిగుల-నందాల దొంతి
అన్ని సొబగులచే నలరారు వేల్పు
అన్ని సొబగుల వరవు-నలరించు వేల్పు॥

973 శుద్ధమానసా

మంచి డెందంబెల్ల-మలదొరపిల్ల॥
వరవుఁ కుఁదగు న-డ్వడి మప్పుతల్లి॥

974 బిందుతర్పణసంతుష్టా

తలఁపులఁ దొఱఁగు డెందముఁకు దనిసి

యుచ్చి చవుల కూట-లూరెడు వేల్పు
అచ్చోట నిడు గింజ-కలరెడు పడుచు॥

975 పూర్వజా

నింగి నేలలకు ము-న్నే పుట్టు వేల్పు
ఎల్ల వేల్పులకు ముం-దే యొప్పు తెల్వి॥

976 త్రిపురాంబికా

ముత్తెఱఁగు లయిన-బొందుల న్దాల్చు
నొడలి తాల్పుల నెల్ల-నో మెడి వేల్పు॥

977 దశముద్రాసమారాధ్యా

ఈరేను రకముల-నెగ్గెత్తఁ బోక
వ్రేలొమ్ము టచ్చుల-వేల్పుదు సల్పు
నడియునికి మాగిటి-నలరించు వేల్పు
నోరు మెదలుప కొం-డుల కెప్డు మేలె
సలిపెడు వరవుల-న్నాఁకెడు జేజె॥

978 త్రిపురాశ్రీవశంకరీ

అంకిల లొంగించు-నా గట్టుపట్టి
గుండని న్దనకు లోఁ-కువ సల్పు వేల్పు॥

979 జ్ఞానముద్రా

పొందుగాఁ గుడికేలి-బొటమన వ్రేలి
చిట్టె జుట్టెన వ్రేలి-చివర తగిల్చి
నింగి నేలలివి తా-నేయుంచు నిండు
తఱవితో నెప్పుడు-న్దనరారు వేల్పు
అడియు రిన్నెంద్రోవ-నలరించు జేజె॥

980 జ్ఞానగమ్యా

కడిది యెరుక-వ వంచ-కలద నెర్గసగు
బోదిక మఱువ-నొల్లగొట్టువేల్పు

డింగరుసతోఁ గూడి-డెను తెలిగంటు
వరపుల కేయుగ-పట్టేను జేజె॥

981 జ్ఞానజ్ఞేయస్వరూపిణీ

తెల్వి, తెల్యఁబడున-దినిలువౌ వేల్పు
ఎఱుకవ యడపొడ-యేగట్టుపట్టి॥

982 యోనిముద్రా

అన్నిదిన్సులఁగను-నచ్చోటియచ్చు
నుమ్మూర్త్కుళ్ళకై మోడు-పులతొలిమచ్చు
మొదటి పన్నికకడ-పొడవై నవేల్పు॥

983 త్రిఖండేశీ

మూడాడుచదువుల-ముక్కలకేల్క
ము త్తెఱంగుల తెల్వి-మొత్తమౌ వేల్పు॥

984 త్రిగుణా

ము త్తీర్ణ పప్పస-ము వెలఁగువేల్పు
నిక్క, మెఱుక, గొప్ప-నెక్కల్పుపాడి
ఎప్పటికున్కి పో-యినెగడు నిల్వు
బోడికతానమై-పొల్పారు జేజె॥

985 అంబా

అవ్వయేకతమగు-నన్ని మేలులకు
వరపులకు న్మించి-వఱలించు వేల్పు

986 త్రికోణగా

అఁడుగఁటి సుడియం-దలరెడువేల్పు
మూమ్మూర్తులల గిఱిలోఁ-బొలుపారుజేజె
తాఁబడు చయ్యుగం-త యుఁగనుతల్లి॥

987 అనఘా

అడలు, యాము, న్గస్తి,-యదటు, లేకలరు
వరవుదొసంగెడ-బాపెడు వేల్పు॥

988 అద్భుతచారిత్రా

అఱ లేకదగుసటు-లరిదిముచ్చటల
నలరించి పెంద్రోవ-నడియరిన్నదువు
వరవునిక్క-ల్లెడ-బాపెడివేల్పు॥

989 వాంఛితార్థప్రదాయినీ

కోరనిమంచి కో-ర్కులొసగు వేల్పు
బోడికకెల్ల యి-మ్ములిదుమలవ్వ॥

990 అభ్యాసాతిశయజ్ఞాతా

అనయమున్గొల్చు నడియా-కగపడు జిగి
శ్రాటేనియిల్లాలు-గ్రేటిపట్టి॥

991 షడధ్వాతీతరూపిణీ

ముప్వేలుపులకత-ముమలతొల్వాలు
వలపల, డాపల,-పడమర తూర్పు
పై, క్రింది, లాఱు త్రో-వలు మించు నిలువు
బోడిక పగఱ నా-ఱ్వరఁ ద్రుంచు వేల్పు।

992 అవ్యాజకరుణామూర్తిః

సరుకైటుంగనిక ని-శరమున న్నడియ
సాకెన్న డెన్నని-జాలి కల్వోచు
ఎల్లరి కిన్మంచి-యే సల్పువేల్పు॥

993 అజ్ఞానధ్వాంతదీపికా

గుబ్బలి బొట్టెయగు మఱ-కువ మబ్బుపంజా
వరవు మఱవు టెరు-ల్వావు నిలాయి॥

994 అబాలగోపవిదితా

ఏను నాదను తలం-పెల్లరిలోన
నెసఁగుట సందఱు-నెఱిఁగిన వేల్పు
ఆలకా పరికె తె-ల్యాంబను జేజె
డింగరీ నికగ ప-ట్టెడు తెలుగంటు

995 సర్వానుల్లంఘ్యశాసనా

ఎవ్వరు న్దనదురా-యిన్దాఁట లేని
యాజ్ఞల్ల రిచ్చునా-నా గట్టు పట్టి
డింగరు న్గోరి న-లే నవ్వు వేల్పు॥

996 శ్రీచక్రరాజనిలయా

పోడిమి సుడి రక-ము నెలవు వేల్పు
వరవు డెందము గిఱి-న్వాఱలెడి జేజె।

997 శ్రీమత్త్రిపురసుందరీ

కలిమి ముప్రోల నెలకొన్న-గట్టు పట్టి
అడియని ముచ్చ మే-లలరించు వేల్పు

998 శ్రీశివా

అందఱికి న్మేలె-యలరించు వేల్పు
తగునట్టు లెల్లరి-న్దానేలు జేజె
డింగర్ల హాయిఁ బండించు తల్లి॥

999 శివశక్త్యైక్యరూపిణీ

ఉసురు, వేలుపు వంచ-నొడఁ గూడునిలువు
కాత్రేడు తాను ప-గడయా మఱప్ప
అడియని యడ పొడ-నలతెడి జేజె॥

1000 లలితాంబికా

అన్ని దిన్నుల మించి-యాటాడు పడుచు
లాలించి యడియాకు-లగ్గిడు తల్లి
కోర్కు లన్నిటికెల్ల-గుబ్బలి పిల్ల
నింగి నేల లలితా-నే యగు వేల్పు॥

# లఘుటిప్పణి

(నారాయణదాసోపజ్ఞము)

## అ

అంకు : వేల్పు

అంకులు : వేల్పులు

అండ : ఆసరా, ఊత, దండగోలపట్టు, ప్రాపు, ఆనిక, తావు

అంకి : ఊరివేల్పు

అంకె : అదను, తరుణము

అనయము : ఎల్లప్పుడును

అవరుస : అ అను వ్రాయి మొదలుకొని వరుసగాను

అవ్వారి : మిక్కుటమైన

అరయక : చూడక

అరయు : చూచు

అడియరి : అడుగులకు మ్రొక్కువాఁడు గులాము, పిసినారి

అదటు : ఎగపు, నిక్కు, పొంగు, ఖడాయి, బిగువు, బిఱ్ఱు, బింకము, విరగబాటు, కావరము, పోతరము, పొగరు

అప్పుడము : ఎల్లప్పుడు, ఎడతెగక

అరిది : నివ్వెర, చోద్యము, వింత

అగ్గింపు : పొగడిక

అడ : నిలువుజాడ

అడియడు : అడుగులొత్తు గులాము

అడియరి : లెంక, ప్రాఁత, బీద, గుండడు, బోడిక

అఱు : కుతిక, గొంతుక, మెడకాయ

అలరు : ఒప్పు

అచ్చాళి : ఏ పీకులాటయు లేక హాయిగా నెవ్వరిజోలి తలపెట్టకొంటి నాడుకొను, ఏ బెడదయు లేనిది బాదరబందీలేని

అలర్చు : ఒప్పించు, వెలిగించు

అలము : ఆఱుము, ఒత్తుకొను

అన్వారి : వెరవరి, నేర్పరి

అదను : తరుణము

అడుగు : అంజ, అంజె, అజ్జ, అడుపు, అడ్గు, కాలు, మెటికె, మెట్టు, హంజ, క్రిందు, దిగువ, దిగుదల, దిగువ, దిగుబాటు, పాదు

అసిములు : తితులు, మాత్రలు

అసిమి : తిత్తి

అనఁగు : పెనఁగు

అరయన్ : తలంపగా, చూడగా

అంగములు : తీరులు

అలమిన : కప్పిన

అయ్యగారు : చదువుల పంతులు, తండ్రి గారు

అప్పగారు : తల్లిగారు

అడపొడ : నిలువుజాడ, ఉరవు

అడ్డ : నాలుగు

అడరెడు : ఒప్పారెడు

అలవ : వెలుగు, వెల్గు, కంచె

అగు : అయిన, అగుచున్న, ఔను

అటుకు : మాసిక

అడ్డబాస : బులాకి

అంపు : కొలుపు, కొలువుకొల్పు

అంట : మేనితోలు

అడచు : చెరచు, పోగొట్టు

అసలు : కల్మి, పెట్టుబడి

అక్కటిక : కనికరము, జాలి

అలరింత : దిసంతు, నగవు, నగు, నవు
నవ్వు, నా

అందగాడు : సుమ్ముడు, సొగసుకాడు,
సకానుకాఁడు, బాగరి, చూపరి, ఒలపరి

అసిరి : ఊరిచెల్వు

అలరించు : వెలిగించు

అసలుబుట్టు : తమ్మి

అవాంతరము : ఆటంకము, అడ్డు

అఱ : అరమరిక

అకటావికటము : తాఱుమారు

అడలు : కలవరము, వగపు

అరసెడు : కనిపెట్టెడు

అఱమఱ : మెఱమెఱ, పానలు (అను
మానము)

అడగించు : పోగొట్టు

అఱువు : ఎఱుక

అడరు : సందుకట్టు, ఇనుకు, గొంది

అంటు : కూరిమి

అడువ : ప్రాంత

అందు : కైకొను

అరయు : చూచు, వెదకు, తలపోయు

అగపడ సల్పుకొనుట : లోఁబఱచు
కొనుట

అర్మిలి : కూర్మి, కూరిమి

అంటు : వలచు

అగపడు : పట్టుపడు

అచ్చోటు : ఒడికట్టు, పాతలఁగనుతావు

అచ్చోటి : ఆఁడుగుతి

అడిబండల : కొయ్యద్రిప్పల

అలవరించు : పాలుచేయు

అంటుట : తగులుకొంట

అరుదెంచు : వచ్చు, చనుకూరు

అరుచి : చియ్య

అడిదము : అలుగు, నరాజి

అచ్చు : అద, బొమ్మ, నీడ

అమరు : ఒప్పు

అరయిక : మంచిచెడ్డల పేర్పఱచుట,
వెదకుట

అలవి : కొలత, వాసి

అడకర : ఓరిమి

అలతి : ఎల, కొంచెము, కొద్ది, గోరు, చికిచికి, కసీడి, కాకి, కింగిరి, కిముడు కీసర, అలకన, ఈరు, ఉలి, కుఱుకుఱు, కొంచియము, గిటగిన, గుడిగుడి, చిటిపొటి, చిట్టి, చిడిపి, చిడుగు, చినచిన్న, చిరుతు, చిణి, చిఱు, చిఱుత, చిలిపి, చిలుప, చెణుకు, చెనటి, చెన్నటి, జిలిబిలి, జిలుగు, జిలు, తక్కర, తని, తిబిరితుక్కు, తోడెము, తోలెము, దోలినలి, నీరు, నులి, నుసి, పిన, పిన్న, పిల్ల, పవరువున్న పులు పుల్లు పొటిపొటి, బుచ్చి, బుడిబుడి, బొమ్మ మురిముక్కిడి (రవ) లే, లేఁత, వెడ, సన్న సయికము, సైకము, సరికము, హాల్కు

అదేదో : తెలియఁదగముకాని

అచ్చొడి : పట్టువడు, పాల్పడు, లోనగు

అపరించు : కలిగించు

అలవు : లావు, సత్తువ

అడిగొటు : చెడుగొట్టు, చెనుగు

అచ్చిన : దొరికిన, చిక్కిన

అమ్ముల : అగుబ్బలి

అలవోక : విచ్చలవిడి

అసియాడు : అల్లలాడు, అల్లల్లాడు, ఊగు, కదలాడు, జవ్వాడు, తూగాడు

అన్నువు : మిక్కిలి కొద్దిలోఁగొంచెము

అబ్బకొఁడు : ములుచ, వెంటటు

అటమ్రాలు : అ, ఈ, వ, య నెడి త్రాలు

అడిబండ : ఆకతాయి, కొయ్యద్రిప్ప, రాలుగాయి, గుండగొయ్య, తిప్పకాయ

అరయిక : తప్పొప్పుల గాలింపు

## ఆ

ఆము : కైపు, కావరము, పొగరు

ఆద : తలంపు, డెందము, గుండె

ఆను : త్రాగు, పూనుకొను

ఆపయిన్ : ఆమీఁదన్

ఆఁక : అవాంతరము, అంకిలి, అలజడి, గొడవ, గొడివె, చెడ్డ, చేటు, అడ్డకట్ట, అడ్డుపాటు, అడ్డి, లడ్డు, అడ్డు గట్టి, ఆటంకము, నట్టు, మన్న

ఆఁనుగుఱి : ఒడికట్టు, అవ్వొటు, పాల లఁగనుతావు

ఆకతాయి : పోకిరి, గరాను, గుండగొయ్య

ఆనుకట్ట : ఊఁతకోల, తన్నుఁగోల

ఆవట : పాడి, మేలు

ఆడించు : ఆటాడించు

ఆదటు : పోతరము

ఆపెడు : అడ్డగించు

ఆఁదుపడుచు : బొట్టియ, కూతురు

ఆమె : అయాఁడుది

ఆఁచెడి : అడ్డగించెడి

అరయు : తెలిసికొను

ఆసించు : త్రాగించు

ఆడెబలు : వెంగిలిదొంతి

ఆనెయులు : సీమలు, ఊళ్లు

ఆటంకము : అడ్డంకి

ఆకుపచ్చ : పదును
ఆలిచిప్ప : కప్పచిప్ప
ఆడు : ఏడు, తిట్టు
ఆణి : సుపాణి, కట్టాణి
ఆడుచదువులు : తొలుచదువులు

## ఇ

ఇంతికొపుంజు : వేగంటి, వేలుపుల ఱేడు
ఇంటికాపు : ఇంటివాఁడు, నెలవు కావలి
ఇడు : ఇచ్చు
ఇడుము : అగచాట్లు, అవాంతరము, కీడు
ఇర్మాఁడు : ఆఱు
ఇవ్వల : ఈవైపు నందున్
ఇలాఖు : పంజా
ఇమ్ములు : వసతులు
ఇరవు : ఉనికిపట్టు
ఇరుపగడ : రెండొండు, మూఁడు
ఇరుకులు : మూలలు, అతుకులు
ఇంటియాపె : ఇల్లాలు
ఇరవారు : పాదుకొను, కుదురుకొను
ఇసుమంత : లేశము, కొంచెము
ఇరుదిన్ను : రెండురకములుగా నుండుట
ఇక్కట్టు : ఒడుదొడుకు, చిక్కు
ఇడుముడులు : ఇబ్బందులు
ఇరుపదాఱు : ముప్పదిరెండు

ఇరులగొంగ : పగటిఱేడు
ఇఱ్ఱిపొక్కిలి : పదను, కమ్మతావి వల్లని తళుక్కుతళుక్కు పురిటాంద్రకు వేడి పుట్టించు వంచరకపు జింక కడుపులోని కొవ్వుకాయ
ఇఱ్ఱి : పగడతీరు లేడి
ఇబ్బడి : ఇనుమడి, ఇమ్మడి, రెట్టింపు

## ఈ

ఈరాఱు : పండ్రెండు, బారా
ఈల్గు : తుదిముట్టు, మడియు, గంతుగొను
ఈచ : ఏటవాలు, వంపు, సొట్ట
ఈగి : తెగువ, పెట్టు
ఈడు : పరువము, సాటి, బ్రతుకుపతతి రెండు
ఈరు : ఇరు, రెండు, కొద్ది
ఈల : కసపు, కసురు, సాన, పుచ్చటీక, పుచ్చడీక, పుచ్చడీక, పుచ్చడీకతనము, పుయిలోట బిడియము, బిడెము, బొంకు, లగ్గు, సిగ్గు, సిగ్గు, సిబ్బితి
ఈలువు : క్రొత్తడితనము, మంచితనము, ఇల్లాలితనము పెనిమిటి ద్రప్పం బైమగవాని నెన్నఁడైన ద్రవయఁదలప కుంట
ఈరేసు : పది

## ఉ

ఉసురులు : మేనుతాల్పులు, మిడుకులు

ఉల్లము : తలంపు, ఆశ

ఉలివులాగలు : జానుగలు, జానుగులు, లాగరులు, వీనులు

ఉక్కఅను : సమయించు, అడంచు

ఉబుకు : పొంగు, అలరు

ఉద్ది : మాడపట్టు, ఔంకల, జోడు, నడిసత్తి, నడుగుంట, నుచ్చెన, నుచ్చెన, సోడు

ఉసురు : మందల, మిడుకు

ఉగ్రాణము : బొక్కసము

ఉత్కృతునియు : జెట్టి

ఉవ్విళ్లూరు : కోర్కెలూరు, తత్తరిల్లు

ఉడ్డ : సాలుగు

ఉడిపి : పోఁగొట్టి, డిందించి

ఉడుకు : మఱుఁగు, గ్రాఁగు, కాగు, దరసిల్లు, పొరులు, ప్రేలు, మండు, వేఁగు, గ్రేఁగు

ఉలిపిగొట్టు : అడిగొంటు, టక్కరి

ఉబలాటము : హెచ్చరిక

ఉలివు : అలికిడి, చప్పుడు

ఉగమ్ము : ఉసురు, మనన

ఉనికి : ఇక్క, ఆసరా

ఉడుపు : పోఁగొట్టు, దుస్తు

ఉలకన : చులకన, తేలిక

ఉండ : కన్ను, కలు, బండికల్లు

ఉరి : ఉచ్చు, జావ్య

ఉప్పొంగెడు : మిక్కిలియలరారు

ఉప్పొంగు : కదలుకొను

ఉసిరిక : ఫలితతి రెండవ నెలలో తోట నిండు కావించుకొను నూరుగాయచెట్టు.

## ఊ

ఊడిగీండ్రు : అడయుసులు

ఊరట : నిలుకడ

ఊను : పూను, తాల్చు, చేయు

ఊగెడు : శివమెత్తి యాడు

ఊతము : ఆసరా

ఊఁతమ్ము : ఆసరా

ఊపిరి : ఊర్పు

ఊఁచు : ఊఁగజేయు

ఊసు : ఊబుసు, ముచ్చట, పనిలేని తరుణము

ఊచిన వెండి : నికరమైన మడికాను

ఊబి : బాడి, బురద

ఊరిపల్కు : నాటుమాట

## ఎ

ఎలయీడు : లేయీడు

ఎండదొఱ : పగటివేళలు, పొద్దు

ఎదురు : అడ్డంకి

ఎఱిక : చప్పు, జబ్బు, రెట్ట

ఎసగు : ఒప్పు

ఎఱుక : తెలివి

ఎలరారు : ఒప్పు, ఒప్పారు

ఎల : సాకి, కరి, లేఁత, చిన్న

ఎలరుచు : అలరు, తనర్పగొను

ఎసలారు : మీరు, పెంపుచెందు

ఎరకలు : జబ్బలు, రెట్టలు

ఎదిరి : పగఱు, పగవాఁడు

ఎడకడ : పరాయి, ఎఱవు, ఒండు, లాఁతి, ఒండువలను, కడమ, తక్కటి, ఒకటి, తక్క, పఱ, పెఱ, మాఱు, వింత, వేఱు

ఎల్ల : హద్దు

ఎట్టపోగులు : పెంసలు, పోఁజులు

ఎకిమీఁడు : పెద్ద, ఏలిక

ఎంతే : మిక్కిలి

ఎడ : లోపు, నడిమి, ఇక్క, చోటు

ఎగయు : లేచివచ్చు

ఎరచిదిండ్లు : తొలివేల్పులు, అసురుల యొడళ్ళుదినువారు, పీనుఁగదిండ్లు

ఎద్దడి : లేమి, సాదారు, నిప్పచ్చు, నిప్పర్చరము నెవ్వ, పంజె, వంజెతనము, పేదరికము, పేదఱిమి, బీదతనము, లిగాడు, లేమిడి, లేవడి, సీదరము, సీద్రము

ఎనలేని : సాటిలేని

ఎడము : వత్తి

ఎడన్ : ఎక్కడ

ఎర : వంత, మెరమెర

ఎమ్మ్రాట : ఎముకలలోని నెయ్యి

ఎరగలి : కారునిప్పు

ఎలనాగమిన్న : ఆఁడువారలలో మేల్బంతి

ఎదిరించు : తిరుగఁబడు

ఎలనాగ : పొలఁతి

ఎరగలి : కారునిప్పు

ఎనసిన : కలిసియున్న

ఎత్తు : మోపు

ఎగిరెడు : చందుద్రొక్కఁడు

ఎసగించు : ఒప్పించు, వెలిఁగించు

ఎఱ్ఱని వేల్పు : పగటిఱేఁడు

ఎత్తునకెత్తు : వంతునకువంతు

ఎడలించు : వదలించు

## ఏ

ఏతరి : కల్లరీడు, నాలిముచ్చు

ఏచు : గాసిపెట్టు

ఏల్క : ఏలిక, అరుసు

ఏడుగడ : కాపు, ప్రాపు, ఆసరా

ఏను : అయిదు

ఏర్పాటు : కట్టుమట్టు

ఏల్బడి : దొరతనము

## ఐ

ఐతి : అలవి

ఐదార : నిప్పు

ఐపులు : తప్పులు, కీడులు, నేరములు

ఐర్పు : నిప్పు

## ఒ

ఒండు : వేఱు

ఒంటికత్తె : జోగురాలు

ఒండొండర్ : ఎదురుగాన్

ఒండొరిమిక : ఒద్దిక, పొత్తు

ఒందిలి : కొందలము, నలుకువ

ఒంటిగా : ఒంటరిపాటుగా

ఒంటికాఁడు : విజ్ఞాని

ఒండొంటిలో : ఒకొక్కటన్

ఒండ : లొద్ది, లొచ్చు

ఒండ్లన్ : పైవారలను

ఒదవున్ : పుట్టును

ఒదవిన : పుట్టిన

ఒసఁగున్ : ఇచ్చున్, ఇడున్

ఒళరు : నేరము, తప్పు

ఒరపు : మంచి, తగిన, దొడ్డనడతగల

ఒడుపు : కూడుదల, న్యాయము, మేలు, వాసి, మిగులు, నయము

ఒడుపులు : మేళ్లు, మిగుళ్లు

ఒడుదొడుకు : అరమర, ఎగుడుదిగుడు, ఇక్కట్టు

ఒయారి : అందకత్తె

ఒడికట్టు : అచ్చొట్టు, ఆఁడుగుంటి, పాపలగనుతావు

ఒఱపరి : అందకత్తె

ఒండ్లర్ : పైవారలను

ఒరులు : ఉన్నవారు, ఎదిరివారు, వింత వారు, తెరకాండ్రు

# ఓ

ఓజి : పుట్టుకతోనే యబ్బునేర్పు, పాడి, పుట్టుబడి, పుట్టుదల, హెచ్చరిక

ఓము : ఏలు, ఏలుకొను, కాఁచు, కాపాడు, కొనియాడు, తడవు, పెంచు, పెనుచుచు, ప్రోచు, ప్రోదిగొను, ప్రోది సేయు, బ్రతికించు, మనుపు, సంతరించు, సాకు

ఓక్పరి : తాలిమికాఁడు

ఓమెను : కాపాడెడు

ఓలలాడు : మునకవేయు

# ఔ

ఔదల : ఉచ్చి, నెత్తల, నడినెత్తి

# క

కతము : అక్కఱ, జోలి, కోపు,

కస్తి : అడలు, జాలి, పొక్కుడ, వంత

కలిమి : పదవి, ఒదవి

కల్మి : పదవి, ఒదవి, సొదరు

కతనన్ : అందువలనన్

కడిమి : హెచ్చు, అలవు, చేవ, మగటిమి

కళుకు, కళ్కు : ఒప్పు, మెఱుఁగు

కడప : కడకు, కొరవి

కరివేలుపు : కలిమి చెలిపెనిమిటి, కడతియల్లుడు

కళ : సుమూళము, మైమఱపు దొక్కు

కట్టాణి : ముత్యాణి, తారము, ఆణిపూస, హురుమంజి

కలయిక : కూటమి

కఱద : నెఱి, తలపు, నేర్పు, కఱదు, పలుకు, తెలివి, ఎఱుకువ

కంతు : తలఁపుచూలి, చెఱకు విలుకాఁడు, అలరు విలుకాఁడు

కణుకు : నిక్కు

కదలిక : అదురు

కడతేర్చు : తుదముట్టించు

కయ్యపుదిండి : జెట్టిపాటకాఁడు

కలతెఱఁగు : నిజము, నిక్కము

కందువ : మంతనము, ఒంటిపాటు

కనుపట్టు, కన్పట్టు : అగపడు, కానిపించు

కడమ : తక్కిన

కలుఁగు : గొయ్యి, గాఁడి

కందు : పాప

కఱటి : బూటకుడు, కల్లరి

కరి : ఎల, సాఁకి, విన్నవారు, చూచినవారు

కలుకు : గునియు, గునుపాటు

కడున్ : మిక్కిలి

కంటు : పగవాఁడు

కట్టుపాటు : సమతు, కట్టు

కడంగి : తలపడి, తలకొని, పూని

కంకటులు : పాన్పులు

కరువలి : గాలి

కడకన్ : పూనికన్

కరువ : మెట్టు, గట్టు, మల, తిప్ప

కడిఁది : హెచ్చిన

కంటు : పగ

కలిగొట్టునన : తెలుపుమించిన రేకు పుగల పువ్వు, వంచరకమైన కమ్మని తెలివిరి

కల్ల : అయిపు, దొసఁగు

కడలి : ఏటిఱేఁడు

కడి : ముద్ద, పిడుచ

కడు : మిక్కిలి

కనలు : అలుక

కలుపుగోలుతనమ్ము : అచ్చికబుచ్చిక

కక్కూర్తి : ఓపమి, ప్రాల్మాలిక

కలుజు : అలుఁగు, వాలుగొమ్మ

కలిమము : కొఁచు, నంజాడు, ఎఱచి

కలఁగని : కలతలేని

కర్వు : బొజ్జ

కమరు : పొలసూలు

కల్వ : తొగ, కూటమి

కయిపు : లాహిరి, నిషా

## కా

కా : కాగా, కదా

కాఁక : ఏదో కోర్కెతో నొడలెండ పెట్టుకొని వెల్లువగొల్పుపని

క్రాలును : ఒప్పును

కాఱేఁడు : ముక్కంటి, (కాడు + ఱేఁడు)

కాణాచి : ఊనికిపట్టు ఏనాటినుండియో యలవాటుగొన్నది, ఏనాటినుండియో యున్న యాటపట్టు, మనికి

కాయ్వు : కోరిక, బ్రతికించు

కాఁకవెలుఁగు : ఎండదొర, పొద్దు, పగటివేలుపు

కాలెఱ్ఱి : ఊరివేల్పు

కావితాల్పు : విన్నాణి, జోద

క్రాఁగెను : ఉడుకు, పొగులు

కారు : ఎడారి, లొంక, పొలము

కానివారలు : వ్రాజెలు

కాపాడు : బ్రోచు, కాఁచు

కావరము : పొగరు, క్రొవ్వు

కార్బారి : తాళికుడు, తీర్పరి

కాకి : కొంచెమైన

కానక : చూడక, తలపక

క్రాలుగంటి : మెచ్చులాఁడి

కాలరి : సిపాయి, పదగుడు

## కి

కినుక : అలుక

కిలాతములు : గుఱ్ఱములు

## కీ

కీలు : కంచి, గొప్ప, పెద్ద, కిటుకు

కీడు : చేటు

## కు

కుఱ్ఱి : అఁబని, ఆవు, గిడ్డి, తొడుకు, తొఱ్ఱు, సైరము

కుట్టుసురు : కొసయూపిరి

కుతుక : గొంతు, మెడ

కుట్టియ : మూఁడి, గుదము

కుట్టె : మూఁడి, గుదము

కుల్లాయి : తాజు

క్రుక్కు : పల్లము, లోఁతు

కుసిగింపులు : అలకువ, అలత, అలపు, అలయిక, అలవు, అలసట, గాసి, చీకాకు, డప్పి, తంటా, తహతహ, డప్పు, డప్పిక, నలఁకువ, నలఁగుడు, నిక్కచ్చి, పాటు, బడలిక, లంపట, వడ వేసట

కుదిరిక : తెఱఁగు, లాగు, లీల

కువ : కుప్ప, ప్రోగు, రాసి

కుందనము : అపరంజి

కుట్ర : తంటా

కుక్క : కంకటితాళ్ళు పదలిన ఫలకము, నులక

కుదురు : పాదు

## కూ

కూటమి : కూడిక, కలయిక, కలియిక కలువ, చేరిక, దనివు పెనకువ, పొందిక, మేళము, లంకియ, లెంకె

కూడువల : ఒదువు, మేలు, మిగులు

కూరుకు : కురక, కూరుకుపాటు, కునుకు, గునుకు, గుటిక, తూఁగు, దోఁగు

కూడు : బువ్వ

కూతు : కూతురు, బిడ్డ

కూడక : ఐఁన్

కూకటి : చిప్పకురులు

## కె

కెంపుజిగి : తొగరుతళుకు

కెళగు : నెత్తురు, అంటునెత్తురు

కెంబొమిడిక : కెంపుతాజు

## కే

కేలు : కయి, చేయి

కేలన్ : కయిన్

కేరు : తెగడు

## కై

కైదువు : అని పనిముట్టు

కైమోడుపు : దండము, మ్రొక్కుడు

కైలు : కేల్గవ

## కో

కొంటె : పింజారి, బిరికాయ

కొలంది : అలవి, కొద్ది, కొలత, కొల్ది, పాళము, వాసి

క్రొత్తడి : గొత్తడి, ఇల్లాలు

కొమ్ములు : అలవులు, కొమ్మలు

కొమ్ముకాండ్రు : కుందులు, ఒంటరులు

కొఱకొఱ : అలుకపొడ

కొయ్యబ్రదిప్ప : అడిబంద, ఆకకాయ

కొనియాట : పొగడుట

కొలువు : అంపు, ఓలగము, చాకిరి కొలుపు, మునుకవేసి మడికట్టుకొని వేల్పు నిదమైమిడియలు చదువుచా వేల్పు వెయి పేర్లనదువుచు విరులనై చునోము.

కొల్యకాఁడు : అడియరి

క్రొమ్మెఱుఁగు : తీగమెఱుపు

కొమరాండ్రు : పదారేండ్ల పెండలు ముప్పదేండ్ల యీడుగల యాఁడువారు

కొండాడు : పొగడు

కొలని : మడుగుయొక్క

కొరడా : చబుకు

క్రొంగసిరా : క్రొత్తకుంకంటువూవ, ముత్తైదువకాల్పునగ

కొను : కైకొను

కొట్లమారులు : దెబ్బలమెచ్చులు

కొల్పు : జాతర, కొలువుతంతు

కొమ్మ : చివర, కొస, కొన

## (గీ లేదు) గు

గులపలు : గుఱాలగోచలు, సాహిణీలు

గుబ్బమొన : చాచిముక్కు, చనుమొన

గుఱువెంద : గురిగింజ

గుది : జల్లి

గుబ్బలి : గట్టు, తిప్ప, కరువ, మల, మెట్ట

గుల్లాము : గుఱాలగోచ, గులప, మండడీడు, సాహిణి

గుప్పించు : కురియించు

గుప్పెడు : పిడికెడు

గుంట : తెలిమినిప్పు గొయ్యి

గుండగొయ్యలు : కొయ్యద్రిప్పలు, గరాసులు

గుబ్బజోడు : చాచుల కవ

గుడి : గాలిగుడి, గుండ్రని

గుట్టుమట్టు : గుట్టుకుదురు

గుండె : డెందము

గుట్టు : కిటుకు

గుఱుజాల : మగరాల

గుండడు : డింగరీడు

గుప్పించెడి : కురియించెడి

గుఱుమాలు : గింజ, విత్తు, కూటమి, కొనవ్రేలమఁడి అండుకుజేర్పబడు విత్తనము

## గూ

గూబరి : ఆసాది, గోసంగి, చచ్చుబడి, పైఁడి

గె, గే, గై లు లేవు గొ, గోలు లేవు

## గౌ

గౌరు : ఏనిక, ఏనుగు, ఏన్గు

## చ

చండి : సోమరి

చలివెలుఁగు : జాబిలి, నిండునెల

చలియిసుక : నెల

చదువరి : తెలివికాఁడు, పెద్ద

చదలు : మిన్ను, విన్ను

చదలకాఁపులు : వేల్పులు

చదువులముదుకడు : పలుకువెలఁది మగడు

చట్టు : గుబ్బలి

చల్లన : మేలు, బాఁగు

చట్టి : అటిక

చలము : పగతీర్చుకొనుట

చక్కటుల : వంకల, చోట్ల

చవి : వేల్పులకూడు, నంచుకొనుట, నోటికింపు, బతికించుమందు

చదువు : పలుకు

## చా

చాగుబడిక : వేల్పడు, మొక్కుబడి,

చాది : గుబ్బ

చాటుమాట : మంతనము

చామలు : పోసనాల్గుదుపు, గుబ్బలు

## చి

చిలుకలకొలికి : ఒప్పులాడి

చిల్వ : పాము

చిట్టె : చిటికెనవ్రేలు

చివర : కొన, కొస, తుద

చిల్లంగి : చెరుపుచేత

చిల్లంగి ముచ్చులు : ఆకతాయిలు

చియ్య : కాచు, నంజుడు, ఎఱచి

చిక్కిన : తగులుకొన్న

చిందులుద్రొక్కు : గునిసియాడు

చిందాడు : కులికియాడు

## చీ

చీలమండ : గుదిమండ, మణికట్టు

చీకటిగొంగ : ఎండదొర, పగటిరేడు

చీల : జంజడ, చెంల, చిలుక

## చూ

చూడ్కులు : చూపులు

చూడి : కడుపు, చూలు

## చె

చెవటి : చెడుగు, జాలిముచ్చు, టక్కరి, లండి, లండీ, లండుబోతు, పడితా

చెండాడు : చించు, వ్రక్కలించు

చెందొవ : ఎఱ్ఱకలువ

చెంపకొప్పు : కీలుగంటు, ఓరకొప్పు

చెలంగించు : హెచ్చరించు, ఒప్పించు

చెఱుకు : తోరెము, కొద్ది, కొంచెము

చెఱలాడెడు : తిరిగాడు

చెందెల్పుడాళ్ళు : ఎఱ్ఱతెల్ల తళుకులు

## చే

చేరుగడ : ఆసరా, అండ, చేరువ, చేరువు

చేవ : అలవు, తెగువ

చేటు : కొరత, కీడు

చేర్కోల : చబుకు, కొరడా

## చౌ

చౌరు : చవి

## జ

జగ్గు : తళుకు

జల్లు : వాన

జంజాటము : ఆలుబిడ్డల తగులాటం, ముతలబుడుపాట్లు, తొడుసు, లంపి, చిక్కు, తగులమందలి యిడుమ, తగులము

జడివాన : ఎడతెగనిముసురు

జంట : కవ, జోడు, జత

జట్టు : మంది

జలుబు : చల్లన

జవ్వాడు : అసియాడు

జక్కిణి : పేరంటాలు

జాబిల్లి : నిండుచెల

జాబిలితాల్పు : ముక్కంటి

జాల్మ్రలత : ఈగిమాను, వేలుపుచెట్టు

జాను : అందము

జాబురా : బుక్కా

జిగి : తళుకు

జెట్టి : ఉక్కుతునియ

జేజే : వేల్పు

జుట్టెనవ్రేలు : చూపుడువ్రేలు

జూలు : మేల్మునుఁగు

## ట

టాటోటు : ఉల్లిపిగొట్టు

టీవు : ఠీవి, మిటారము, టెక్కు

టెంకి : ఇల్లు, ఉనికిపట్టు, పట్టు, ఇరవు, తావు

టోకునన్ : మొత్తముపైని, మొత్తముగా, అంతయు

## డ

డగర : గాలి, పోఁటుడు

డా : ఎడమ

డాలు : జిగి, బచ్చెన, తళుకు, ఒప్పు

డాగరింత : చాటు, మాటు

డాగిన : పొంచియున్న, బాడైన

డిగ్గి : దిప్ప, కెట్టి

డాకయి : ఎడమకేలు

డిండించు : అడఁగార్చు

డబ్బు : ఆస్తి, నగదు

డామేను : ఎడమవైపునొడలు

డెక్కల్పు : జతపఱ్చు, హెచ్చించు

డెక్కలు : దక్కించు

డాపల : ప్రక్క

## త

తమ్మి : కొలనులోబుట్టుపువ్వు, ఆపలుబుట్టువు

తరుణములు : తఱులు

తగులాటము : తొడుసు, చిక్కు

తగులు : అక్కఱ, కోర్కె

తమ్మిరాయి : కెందమ్మివంటి కెంపు

తనప్పు : వేడ్క, వేడుక, సరదా

తరవాయి : అదను

తంటాలమారులు : కయ్యాలప్రచ్చులు

తల్లితల్లి పెనిమిటి : కతివేల్పు

తమ్మిపుట్టువు : చదువుల నుడుకడు

తటిఁదాల్పు : కరివేల్పు

తరతరము : తరబడి

తఁగించు : ఎడయించు

తల్లితల్లి చెలి : గట్టుపట్టి

తరబడిన్ : కొలఁదిన్

తగన్ : ఒప్పుగాన్

తమి : వలపు

తత్తడి : వారువము

తల్లి : అప్ప, అవ్వ, కన్నది, తాయి
తడవిన : వెదకిన
తనయిల్లు : ఏనుగుగొంగడిబ్బ
తల్లి : అగ్గము
తనరున్ : ఒప్పును
తమ్మికంటి : కడలియల్లుడు
తలకట్టు : పూసను, కన్నాను, మేల్బంతి
తగులమ్మి : అక్కఱ
తరబడి : దినుసు, వరుస
తల్లితల్లి : కలిమిచెలి, కరిచేల్పునిల్లాలు
తనియించు : తనుపారించు, కోర్కెలీడేర్చు
తన్వి : తనువు, ఆపాక
తగులము : తమకము, వలపు, అక్కఱ
తగవు : చక్కటి, తీరువు, పాటి
తనుపు : తనివి, తనరుప, వేడుక, అలరింత
తగున్ : ఒప్పును
తల్లివేరు : దుంప, మొదటివేరు, అడుగుమట్టు
తఱుగు : తగ్గు
తఱపి : తేయాడు
తడి : నీళ్లు
తవాయి : ఆలము, ఏద్దెర, కంగారు, కంగిస, కయ్యము
తమ్మె : వీనులక్రిందు
తమ్మి : బుగ్గనుంచు వకార్యమునద్ద

తెలగిటి : ఔదలలోని నది
తాట : తోలు, అంట
తావళము : క్రోవలు
తారువుడి : తాప్పకత్తె
తావలము : ఉనికిపట్టు
తాత : తనంతగల యతడు, తోలు వేలుపు, చదువుల వేలుపు, కలుకు చెలి మగఁడు
తాతలు : చదువుల వేల్పులు
త్రాణ : అలవు, చేవ
తాయెత్తులు : సందిలిదండలు
తామేటి : తాఁబేలు, దాసరిగాఁడు, దాసరయ్య, తామేలు
తాపుతోఁబైఁదోచునలరు : ఎఱ్ఱపువ్వులుపూచెడి తరగరకముచెట్టు
తావి : వాడ, కడి, వలపు
తాలిమి : ఓరిమి
తామేలు : తాబేలు, దాసరయ్య, దాసరిగాడు
తాటోటు : నాలిముచ్చు
తాల్చు : వంతరించు, తొడుగు
తాయి : తల్లి
తావలము : తావు, ఇల్లు
తిప్ప : గట్టు, గుబ్బలి, మల
తిరుపతి : కడలియల్లునికోవెలగలచోటు
తిప్పకాయలు : గుండగొయ్యలు
తిత్తి : పాటకాని బాపటగా నొత్తు కాఁదూడ తోలుపనిముట్టు

తిలకించు : చూచు

తిరి : వేసవి

తివ : మూఁడు,

తీవంచ : నాలుగు

తీండ్రించు : వెలుఁగు

తీవురము : ఎగ్గు

తుమురు : దుమ్ము, దుమారము

తులకించు : ఒప్పు, ఒప్పారు

తుది : కడ, ఈల్గుట, గిట్టింపు

తునుము : త్రుంచు

త్రుంగన్ : ఇలుంగన్, గిట్టన్, పొలియన్

త్రుంగించు : అడగించు

తుంట : చెఱకు

తుదముట్టించు : పోకార్చు, నిల్పి వేయు

తూఁడుదిండి : పంకమునుండి నీళ్లువేరు చేయుపిట్ట

తెమలక : కదలక,

తెలి : మంచుతెలుపు

తెల్వి : ఎఱుక వెలుఁగు

తెలిపులుఁగు : తెలిపిట్ట, తూడుదిండి

తెఱకువ : తెలివి, ఎఱుక

తెగటార్చు : మడియించు

తెరగంట్లరేని : వేగంటి

తెగ : గుంపు, తోగ, వరుస, తడుగు, గడుపు

తెగనాడుట : తూలనాడుట, తబ్బిబ్బు లేక పలుకుట

తెగనాడరానిది : తూలనాడరానిది

తెలివి : ఎఱుకువ, వెలుఁగు, తఱుకు

తేమానము : అప్పిచ్చిన డబ్బుపై పెరుగుడబ్బు, వడ్డి

తేరన్ : ఏజోలియులేక, పాటుపడక

తేనె : జున్ను

తేరు : బండి

తొమ్మిదిపూసలు : తొడవులన్బరగు తొమ్మిదిరకములురాలు

తొలఁగిన : విడిచిన

తొలుచూలు : మొదటపుట్టిన బిడ్డ

తొడుకు : ఆవులు మొదలైన తొట్టులు

తొడరి : పూని

తొగసూడు : వేఁడివెలుఁగు, ఎండదొర

తోఁచక : అగపడక, కనుపడని

తోలుదాలుపు : ముక్కంటి

తోఁగు : మునుకవేయు

తోతెంచు : అగపడు, కానిపించు

త్రోపుడు : నూకుడు, తెట్టె

తోలెము : కొంచెము

తౌలు : తగులు, కోర్కె

## ద

దణియు : మొనకాఁడు, దొర, ఏలిక

దణి : ఏలిక, దొరమొనకత్తె

దంట : నేర్పులాఁడి

దవ్వు : ఎడము, ఎడ, ఎడవు

దండగోలు : ఆసరా, అండ

దస్తూరి : వ్రాయసము, వ్రాత, వ్రాయి

దండి : గొప్ప, నిండు

దుముదారు : పాఁడు

దుంప : గడ్డ, వేరు

దూకు : ఉరుకు

దొట్టి : పెందలంగాగల, పెందలైన

దుందుడుకు : ముందువెనుకలు చూడక దబ్బున పైజు చేయుచుంటరి

దోరగించు : ఎట్టివారించు

దొప్పలుందొరలు : కోటానకోట్లు

దైవారు : ఒప్పు

దీవించు : శేపెట్టు, తిమ్ము

దీమసము : చేవ, తేకువ

దేవెరి : ఏలిక

## న

నసగూటి : సొగసుకత్తెమిండలకోరి

నలువారు : ఒప్పారు

నంజుడుదిండ్లు : ఆసరలు, గరానులు

నవ్వ్రాలబండి : నవ్వులవాటుగలది

నల్లద్రావుడు : తొలివేలుపు, సోఁకుడు

నలువు : సొగసు

నలువాయిఅడిదము : నాలుగంచుల కైదువు

నలు : నాలుగు

నల్ల : నెత్తురు, నలుపు

నడి : నడుము, నడుమ

నకనకలాడెడు : ఎండిపోవుచున్న

నడపీన్గు : అంబేవ, కొంపచెరుపు

నర్మిలి : అక్కర, కూరిమి, నెనరు, కోర్కె

నరాజి : అడిదము

నలకువ : తెగులు, చీడ

నమలు : కుడుచు, కుడుచు, తిను, నంజు, నములు, మెక్కు, మెసగు, సాకదు

నంగనాచి : ఏమియు నెఱుఁగనటులుఁ బైకగపడు నేర్పులాడి, మంచిదానివలె తిరుగుకనుగులాడి

ననతరి : పూఁదరి, ముందునెల

నయము : మేలు

నామగుంట : అంగిలిగుంట

నాలిముచ్చు : ఆకతాయి, కల్లరీడు

నాతుక : అఁతుకూఁతురు

నాల్గునిలువులు : పాడి, మగవాఁడు, కలపవున్నదినుసు, తరియ పెడ్డచెయ్యు లలో కొలైనయడ

నిరుకు : ఏర్పాటు

నిక్కులు : ఉన్నదానిస్థలిసికొనికుడుచుట

నిట్టపంట : కతములేక

నిక్కపుడు : పొరపొచ్చెములేనివాఁడు

నింగి : మిన్ను, విన్ను

నిగుడున్ : పెఱుగును, హెచ్చును.

నిలువు : అడపాడ

నిప్పాక : నిప్పు, డిగ్గి, ఐదార

నిగ్గు : త్రోపుడుపోగా నిల్చిననికరము, నిండుమెఱుగు, తళుకు

నిగిడ్చి : పెంచి, హెచ్చించి

నిట్టు : తిన్నని, తిన్నగా

నిల్వు : అడ్డగింపు, నిలుకడ

నిల్కడ : పదిలము

నికరము : నిగ్గు, తెట్టుపోగా తేట

నిడు : నిడివి, సోగ, పెద్ద

నివ్వెర : అక్కజము, తటకాపాటు, బిమ్మెర

నిట్టపంట : కతములేక, ఊరక

నిబ్బరికము : కనికరము

నిచ్చలు : ఎల్లప్పుడు

నిక్కల : నిజమైనకల, కన్నది విన్నది యాకళింతచేసికొనుట

నిరవు : నిండుదల

నించు : నిండించు

నింగిమూల : ముక్కంటి

నిక్కువుడు : పొరపొచ్చములేనివాడు

నిరుకు : ఏర్పాటు

## నీ

నీళ్లు : తడులు

నీడగనుబిళ్ళ : అచ్చగపచ్చ గుండ్రని ముక్కు, అద్దము

## ను

నుచ్చిన : కొందల, నడినెత్తి, నెత్తల

నుడివోనలుగు : ముమ్మొనకైదువు

నుడికారము : మాటతీర్పు

నుఱుపు : అణచు

నూల్కొను : నిలుచు, కుదురుకొను

## నె

నెరసరి : రెంటత్రాగుడు తిండి, ఏనుగు గొంగ

నెయ్యి : చమురు

నెత్తము : పాళిలు

నెరగొండిలి : నేర్పుతో గావించు ఆట పాటవాయింపులు

నెత్తురుగంటియేసు : అరువదేండ్ల పేర్లలో నలుబదిమ్మిదవ పేరిటయేడాది

నెల : ముప్పదిప్రొద్దులతరి, జాబిల్లి

నెరసు : తప్పు

నెళవు : ఆయము, నులువు, కీలు

నేరు : తిన్నని

నేటు : మేలు, నిక్కము మంచి

నేలపట్టి : జాబిలికొడుకు పేరిటి చుక్క

నేలవేలుపులు : పారులు, ఇరుబుట్టువులు

నేలైన : మేలైన

నోర్తమ్మి : వాయి అసలుబుట్టువు

నోరు : వాయి, మూతి,

నోము : నోచు వేల్పు వేల్పునకై యును
చేసిమడిగానుండుట
నోడికారము : మాట నేర్పు
నోడికారపుటడ : మాట నేర్పునిల్లు
నోవరి : తెగులుగొంటు, నొప్పిగొంటి
నౌరు : గోము, శేఁత, మక్కువ

# ప

పండువ : పండుగ, వేడ్క, తిరునాళ్ళు, కొలువు
పనివాఁడు : అడియరి, అవుజు
పనస ; తొలిచదువుముక్క
పంతు : మేలిమి, హెచ్చు, గొప్ప, ఎక్కువ, పస, నిగ్గు
పర్వు : పెత్తనము, పేరిమి, బెట్టు
పయిడిరేఁడు : కాయకంటి, గుడ్డికన్నొ దుసొ, ముక్కంటిచెలి, లిబ్బిదొరవానీఁడు
పట్టంపుదేవిరి : ఏలిక, రాణి
పట్టము : బిరుదు
పర్వము : పడుచుతనము
పంతులు : అయ్యవార్లు, చదువుచెప్ప ఇరుబుట్టువుల
పలుతుఁజెలి : చదువుల వెలఁది
పడుచు : కొమరాలు, గుబ్బెత, గుబ్బలాఁడి
పగడమే : వంచరయే, తెరుకాని
పంచాణము : పని

పలుకరతలవంచనెక్కొలుపుకరద : అడిగినమాటలల్లిక గురుతుచెప్పుట
పదునుకుప్పలు : తతిపొద్దులు
పంటింపని : తడబడని, తడవాడని
పంజా : దివిటీ, ఇలాయి
పడుగు : వంగసము
పస : జగ్గు, మెఱుఁగు
పడుచు : పదియారేండ్ల యెండలు మున్ప దేండ్లవర కీడుగల యాడుకూతురు
పగఱ : పగవాదు
పరఁగెను : ఒప్పెను, పేరెక్కెను
పంటపైరులదొలఱ : బావిలి, చెల
పట్టు : నెలవు, ఉనికి
పట్టుఁగొమ్మ : ఆసరా, అండ
పరిమార్చు : త్రుంచు
పరాకు : ఏమరిక, మరపు
పంపు : పంతు, పొలు
పసిడిని : కురాయికిలాబడి
పలువ : తులువ
పరపు : తగులువు
పట్టి : బిడ్డ, కూఁతురు
ప్రగ్గడ : ప్రెగ్గడ, పెగడ, ప్రెగడ, పేజీబు, వజీరు, మంతిరి, మంతు
పంటవలంతి : నేల
పనుపులు : నెలవులు, పనులు
పనుపము : శేయాడు, ఎలయాడు
పన్నుండు : కూర్కుడు

పనిముట్టు : ఎత్తరి, ఉడచ్చు, కొర మట్టు

పదవి : కలిమి, ఎక్కువ

పగడము : వంచ, ఒక్క

పదిమూళ్ళరేండు : ముప్పదిరెండు

పన్నకము : ఎన్నిక, పన్నగడ

పనుపు : అప్పణ, ఆన, కట్టడ, తోడు, దురా, దురాయి, పంపు, పడి, మొదల, సెలవు

పట్టింపు : తగులు, పట్టుదల

పచ్చవిల్తుడు : చెఱకువిల్లుకాడు, కంతుడు

పగలింటిరేడు : ఎండదొర, పొద్దు, ప్రొద్దు

పయిసరము : కలయిక, పైసరము, మనకముకత్తు

పరవము : అక్కఱగొను

పగడ : వంచ, ఒక్క

పదను : తరుణము, అదను

పాతర : ధాన్యాగారము, పంటపాల

పాలన్ : లోకువన్, ఎట్లన్

పాపసీమాట : సొగసైనయాడుపాపా

పాటించు : ఆలించు, కొనియాడు

పాచిసాహి : ఏలిక

పాటపనస : పాడకగిరతోలుపలుకు

పాడి : ఓజ, ఆదట

పాప : అడ్డపట్టుపాప, అడ్డపాప, ఎరగండుకండు, కండువు, కరుగండు, కట్టి, కూన, పనిపాప, పనిబిడ్డ, పూప, బుసుత, బుదుక

పాటి : ఈటు, పోలిక

పాడిమై : ఓజమై

పాడులు : ఓజలు

పారులు : తొలితెగవారు, ఇరుబుట్టువులు

పాదు : కుదురు, పాది

పాడి : పంటము, పోసనాలు, పాలు

పాటమిన్కులు : పాడుచు విన్పించు తోల్బదువులు

పాడి : ఓజ, పుట్టుబడి, పుట్టుదల, మంచినడత, ఆదట

పాడెగట్టు : పలంగాకి, కొయ్యద్రిప్ప, అడిబండ, ఆకతాయి

పాముకంటిచుక్క : పుబ్బ

## ప్రా

ప్రాకు : చెలువు, మెటి

ప్రాంత : అదువ, డింగరీడు

ప్రాచిపని : ఇల్లూడ్చి పేడనీళ్ళు జల్లి బాగుచేయుపని

ప్రాచీపవిత్తు : అడిగొంటు

ప్రాడ్వాకులు : లండీలు, గరానులు

ప్రాము : రుద్దు, పులుము, కొండాడు, కాచు

## పి

పిసాళి : గోల, లండీ

పొరిపొరిన్ : మాటిమాటికి

పో : నిరుకుపఱ్చువాయి

పోడ్మి : కలిమి, డబ్బు, సొదరు

పోకడలు : నడకలు

పోకడ : పొలియిక, చేటు

పోరి : చిన్నది, పడచు, పిల్ల

ప్రోలు : పట్నము

పోలక : ఊరివేల్పు, పోలేరు

ప్రోయాలుమిన్న : అతివలతలకట్టు

పోటు : వాఁడి, వీఁక

పొసగించు : ఒప్పించు

పొల్పెడి : ఇరవుండెడి

పొలయింపన్ : పోగొట్టగా

పొదలించు : హెచ్చించు

పొలము : చోటు

పొఁలాడు : దొర్లు

పొన్నొబ్బసు : నిట్టపుట్టుగొంగ

పొలుపగు : అందమైన

పొంగట్టు : బంగారుగుబ్బలి

పొల్లి : పోలిక

పొలియలుక : చేట్లు

పొలియులుకలు : ఒబ్బిదులు, కాదలు చేట్లు, తలమాటులు, తొమ్ముదులు, త్రుంగుడులు, నిప్పచ్చులు, పెంపులు, పోకడలు రిత్తులు, వమ్ములు, వేరువిత్తులు

పొగడుకోలు : పొగడిక

పూస : కెంపు మొదలగు తొమ్మిది తెగలతొడవురాళ్లు (మిన్న)

పొరిగొను : మడియించు

పొరటుక : పొందిక

పోడిమి : అందము

పోసనములు : ఒప్పులు

పోటరి : మగవాఁడు, వడివాఁడు, పరదారు, మిడిమానిసి

పోసనాలు : పంకము, పాఁడి, పాలు

పైమొట్టు : మిక్కిలిదొత్తు

పైడినెలఁత : కలిమిచెలి

పైదలిమిన్న : సీయాటిచెటి

పైడి : బంగారు

పౌఁజు : పటాలము

## బ

బండ : తుంటరి

బరవసము : హెచ్చరిక, జోఁక

బసవడు : అచ్చుపెద్ద, ముక్కంటిమావు

బడుగుల : వగ్గల, పీనిగల

బరువసము : వితాకు, వేడుక

బడాయి : డాబు

బంగరుకోఁడాలుపు : కతివేల్పు

బచుకారి : వగలాడి

బాడు : పకడా, తెగ

బాగులాఁడి : ఒప్పులాఁడి, కులుకులాఁడి, ముద్దులాఁడి, మెచ్చులాడి

బాసట : తోడు

బాజు : ఒప్పు, తళుకు

బారీలు : ఏనుగుకాళ్ళకు కట్టు ఇనుప గొలుసులు

బాములు : చిక్కులు, పుట్టువులు

బాగులు : మేళ్ళు

బాసవాలులు : కేలుపులు

బాగెము : మంచినడుటిద్రవాలు, మేలు

బిస్త్ర : బిడ్డ, తుదిముట్టిన మంచి చెడుగుల నరసితగునట్లు చేయుగుడియుతాల్పు విడిది

బిగుతు : వదులుకాని

బిబ్బి : తోరనము

బిరుదు : తోడా గండపెండెరము

బిత్తల : అంగవెలల, నీసము

బీదలు : విజ్ఞాణులు

బెడంగు : అందము, సొగసు

బెళుకు : అదురు, బెదకు, ఇనీరింతలు, అదరు

బేసికంటి : ముక్కంటి

బేడిస : బొమ్మిడాయ, వాలుగ

బుజ్జగించి : మచ్చికచేసి

బుగ్గలు : చెక్కిళ్ళు

బుజలు : లేమిస్దెల్పు గుంద్రనిగీతలు సున్నలు, బొట్లు, వాళ్ళిలు

బుల్పు : ఇమ్ము, తదిలము

బువ్వ : మెతుకు

బూంది : నెలయందు చీకటిపొద్దులం దలి పదువాల్గవవాడు, ముక్కంటికేయి

బూంమె : ఉక్కు, కుట్ర, గారడము

బోద : కావితాలుపు, ఒంటికాడు కుండగోలదాల్పు, బీడ, బోడి, విజ్ఞాణి, కాకసల్పువాడు, తిరితాల్పు

బోటి : ఆడుది

బొట్ట : కూతురు

బోడిక : డింగరీడు, గులాము

బొమ్మ : అచ్చు, మచ్చు

బొట్టు : సామము, నుదుటబెట్టు బొట్టు

బొమ్మంచు : కావి, తొగరు

బొమ్మలవ్రాంతవివరము : మాటలు విప్పిచెప్పుట

బొప్పంద్రము : ములుచలు, వెంగళులు

బైడాలము : అలుక, కంతాళముకి, నుక, చిరాకు, చిట్టి, మంట

## మ

మయి : తొడన్, ఒడలు

మవ్వపు : నారు, నవరు, గోము, జవర, తలిమము, పిడపిడ, పిడపిడన, పోడు

మందు : వెలువు, దీనసము

మరకువ : ఎఱుంగమి

మందడీడు : గుణాలగోచ, గుల్లాము సాహిణి

మడత : చుట్ట

నుడుగు : మఱుంగు

మఱకువ : ఎఱుకలేమి, తెల్వి లేమి, తనుపులేని

మంచి : ఒఱపు, లెస్స

మండెల : మిడుసు, ఊసుర, ఊపిరి
మంకెన : దాసెనచెట్టు
మందరి : మందిచ్చువాఁడు, (వెజ్జు)
మనుపు : బ్రతికించు
మంది : జట్టు
మట్టిమల్లాడు : తొక్కిపోరాడు
మడిగిరి : నత్తుకయందుండి పలికించు వరముల మడి
మలప్పు : మంచుతిప్పకన్నయాపె
మడికాసుమల : వెండిగట్టు, మక్కంటి ఇల్లు
మడికాసు : వెండి
మడికాసుగుబ్బలి చెంకి : వెలితిప్పపై ముక్కంటితో కాపురముచేయు బ్రొత్తడి
మడిగైనది : అంటులేనిది, మడికట్టుకొన్నది
మడుంగు : మడినోము
మఱువ : జోడు, తోడుగు
మక్కువ : అక్కఱగొను
మఱపు : కత్తళము, చట్టు, జిరా, జోడుమైమఱువు సమకట్టు
మఱకువపండు : కఱవనగ్గించెడు పంచరకము కూరగాయపంట
మరగు : వలచు, చనువుపడు
మగఱాలు : అవలు, గుఱఱాలు
మల్లి : మల్లె, ఊడలుదించి ఎంతయో దవ్వుపరచు పెరుగు పంచరకపుచెట్టు, మల్లి చెట్టు

మంకెనవిరి : పట్టైదపువ్వు
మా : బలి, జొరా, బాపురే, మామొక్కలు, మిక్కిలి,
మాపిన : పోఁగొట్టిన
మారి : ఊరిసేల్పు
మాటలల్లువాఁడు : మాటలు కూర్చి వహిఁ చేయువాఁడు, చదువరి, మాటకాఁడు నుడువరి, కొల్వులో మాటాడువాఁడు
మాడపట్టు : నడిసత్తి, నుచ్చెనగుంట
మారాడు : ప్రాకుడుకొయ్య
మాఱాట : పోరు, కయ్యము, ఆలము, ఏడ్తెర, కంగారు, కంగిస, కలకు, కలన, కలను, గొదవ, అజి, గోడ, వాదము, చివ్వ, జగడము, తవాయి, దురము, పడవ, పెనకువ, పెనుకువ, పోటు, పోట్లాట, పోరాట, పోరి, పోటితము, పోరు, ఐవరము, మేడము, లడాయి.
మాపు : రేయి
మా : నిరుకుద్దెల్పుబ్రాయి
మాసిన : విడచిన
మాత్రలు : విత్తులు
మాఱు : ఐదుట
మారుతులు : తగవాడు
మాస్టీడు : కన్నాకం, విన్నాణి
మించున్ : ఒప్పారును, జవదాటును
మిడియులు : తొలుచవువులు, పనస
మించు : మెఱుపు, మీరును
మినుక : తళుకు

మిటారి : ఎమ్మెలాడి, అందగత్తె, గమ్మెత
మినుకు : కళుకు
మిడుకు : ఉసురు
మిన్కులు : తొలంచడువులు
మించుబోఁడి : మెఱపువలెనందమైన యాడుది
మింటితెరువర్లు : వేల్పులు
మిన్నేరు : ఆడుగంబుట్టువు, మద్యేరు
మినుకుతెరువర్లు : వేల్పులు
మినుకులు : తళుకులు
మిట్టాడు : కదలాడు, చిట్టాడు
మినుబండి : మింటబర్విడుతేరు
మిక్కిణి : అయిదువరాలు, జక్కిణి
మీఁగాళ్ళు : అడుగులమీదివైపులు
మీసరము : తలకట్టు, కన్నాకు
ముగతి : ఇల్లాలు
ముగతులు : ఇల్లాండ్రు, క్రొత్తడులు
ముదిమి : ముసలితనము, పెద్దరికము
ముంచి : ముసుగవేసి
ముచ్చు : మూఁడు, తివ, తిగ
ముక్కంటి : వెండితిప్పరేడు, క్రిందుమీదువడుములుమూఁడిటిజ్ఞాచువేల్పు
ముదుములు : ముదుసలితనములు
ముగితి : పెంద్రోవ, విడుపు, కోర్కెలేమి
ముచ్చదువులు : మూడుతొలంచడువులు, వేల్పులవ్వేడుట, వేల్పుట, పాడుట యీమూఁడు పనులయందువాడు ప్రాబల్కులు
ముత్తెరువులు : క్రిందు మీదు నడిమి త్రోవలు
ముప్పోకలాఁడి : పుట్టించుట, పెంచుట, త్రుంచుట ఈమూడుపనులుచేయు పాడిగల వేలుపు
ముప్పిచ్చిములు : మూడు వెలుతులు
ముత్రోలు : బొడ్డు, డెందము, మూడపట్టులను మూడుతట్నములు
ముప్పేడులు : తరులు, తరుణములు, గడచినది, కాగలది, జరుగుచున్నది. ఈ మూడుతరుణములు
ముక్కాకలు : ఉల్లము కుదలకునైదుదినుసులు పుట్టుపెంగలు
మూఁడుసరలుండులు : నమ్మిక, ఎఱుకువ కోర్కెలేమి వెనుగులవ్వేడలింతదరచు మూడు గుమ్మములు కతములు
ముక్కర : వంతులు
ముదియనివారలు : వేల్పులు
ముచ్చగుమి : పాడి, కలిమివలపుల నెడిమూఁడింటిగుమి
ముస్తీదు : ముస్తాబు, ఆయత్తము
ముగ్గొయ్యి : గడ్డు, గండు, గడును
ముజ్జింతతాల్పులు : ముగ్గురు ముక్కంటులు
మురళించు : ఎగతాళిచేయు
ముడి : ముడ్డి, కట్టియ
ముడివిప్పు : చిక్కువదల్చు

ముప్పదుముగ్గురు : ముప్పదిమంది

ముల్కులు : కోలలు

ముచ్చటలు : కోర్కెలు

ముడుకు : మోకాలు

ముచ్చోటులు : క్రిందు, మీదు, నడుమలు, కొడల, దండము, బొడ్డులు

ముమ్మూళ్ల : మూడుమూళలు

ముగురు : ముప్పురు

ముడి : కడింది, గుబ్బ

ముచ్చోటులనుడులు : నేల, మిన్ను, నీల్పు వెంకి యీనూడు తావులచ్చే ర్కొను నుడులు

ములికి : అలుగు, కోల, గనిక

ముడుతలు : కంగులు, ముడులు

మూలలు : ఇరుకులు, అతుకులు

మూలడా : గురుజా

మూసిగంతలు : డాగిలిమూతలు, డాగురుమూతలు,

మెట్టాడుపడుచు : గుబ్బలికూతురు

మెణకరి : తడుపుదాలుపు, మంజి కాడు

మెచ్చులాడి : అందకత్తె, మెచ్చు కొనదగు ఆడుది

మెఱుగుబోడి : మెఱపువంటిఆడుది

మెరమెరలు : అరమరలు, పానలు, వంతలు, పొక్కడలు, అంగలార్పులు, అంగడలు, పిరువీకులు, ఇబ్బందులు

మెటికె : అంజ, అడుగు

మెట్టుమేపుట్టువు : మలపు, గుబ్బలి కూతురు

మేను : ఒడలు

మేల్మి : అపరంజి, బంగారు

మేలుకోల్పు : లేపు

మేలుబంతి : కన్నాకు

మేల్పసిండి : అపరంజి, కడాని

మేటి : ఏలిక, పెద్ద, గొప్ప, కన్నాకు, మేల్బంతి

మేలమాడు : వేళాకోళముచేయు

మేరువు : పేరునడుము క్రేలెడు కొలికి పూస

మేళకత్తె : ఆట, పాట, వాయింపుల మెలకత్తె

మై : తోడన్, ఒడలు

మైకొను : ఒప్పుకొను

మైకొల్పు : ఒప్పించు, చేకూర్చు

మొనలు : మూఁకలు, పౌఁజులు, ఎట్ట పోగులు

మొనకత్తె : మూఁకల నడిపించు దణియ

మొగులు : మబ్బు

మొరయించు : మ్రోగించు

మొలక్రిందివంతు : బొడ్డుదిగువ దొడలి వంతు

మొగిలువిటె : నీళ్లు

మొగ్గు : ఎక్కువ, మొగ్గు, మంచపైపు త్రాసు ములు వరుగుట

మోఁపిక : పూటము

మ్రోఁగు : మ్రోయు

మ్రోఁగుడు : వాయింపు, మ్రోఁగింపు

## ల

లగ్గు : మేలు

లవి : మిక్కిలి

లలిన్ : హెచ్చరిక

లంబి : పెండ్లాముబిడ్డలు లోనగువారు

లాలు : ఎఱుపు, తొగరు, డోర

లావుగా : హెచ్చుగా

లాగరి : మీసు, ఉలివులాఁగ

లాలించు : బుజ్జగించు, మచ్చికచేయు

లీల : కరణి, పోల్కి, తీరు

లీలలు : కరణులు, తీరులు

లిబ్బి : పాఁతఱ, ఆస్తి

లెక్క : ఎన్నిక

లెస్స : మేలు

లెక్కలు : వెరసి

లేలేమ : లేతపిల్ల, చిన్నపడుచు

లేఁక : మేఁక, తెంక, డింకరీఁడు, పోరు సల్పువాడు, పోటుమగడు, పోటరి

లేఁగాను : వీఁగు, కాను, వడుము, కవును

లేఁజీకటులగొంగ : ఎండదొర, పొద్దు

లేమ : ఆడుది

లేలేదు : లేనేలేదు, ఎన్నడునులేదు, పోలికక్కు

లేఖరంబు : లేఖిహాలికక్కు, కుండేటి కొమ్ము, లొటారముపట్టి

లోంక : కాఱు, ఎడారి

లోంగని : లోఁకువకాని

లోద్ది : లోయ, లోవ

లోగలి : నట్టిల్లు

## ర

రకము : దినుసు, తరబడి

రహీ : ఎఱుకువ

రట్టడి : ఆరడి, సోఁత

రానురాను : తరిపిదపయగుచున్నకొలది

రాణి : పెండ్లాము, ఆలు, ఆలి

రివ్వున : చిరిలువ, చటుకున

రేయెండ : వెన్నెల

ఱెల్లుచూలు : సామి, వేలుపుగమి కాఁడు, గట్టయేలికమనుమడు, నెమ్మిరేడు తేగపేరికల్కిమగడు, పుంజాదాలుపు, దార కయిపోటరి, విత్వగండ్లమిత్రము వడ వాలు, వేలుపులమూఁక పేరిటి వెలది మగడు

ఱవలి : పాటపల్కు, పాటలోని ఏడు తెఱఁగులపల్కులలో నేదో సంచ్రమోత పాటయలికిడి

ఱవలులు : పల్కులు

ఱవలి : గొంతు

# వ

వంచ : చిక్కు, పగడ, పగడము

వంచము : పెండటిది

వలదొరపగ : ముక్కంటి

వలిమొట్టు : మంచుగుబ్బలి

వలవంత : ఎడబాటుపొక్కు

వంతు ; పంపు, పాలు, తంపకము

వంతులు : డెందముపొక్కుడలు

వలకడ : కుడివైపున

వంటకము : కూడు, బువ్వ

వదరుబోతు : ఊరకపనికిమాలిన మాట లాడువాఁడు

వాపెడు : ఎడపెడు, ఎడవించెడు

వాలకము : వేడబము, కోలము

వాలుచుక్క : తొలువేలుపుల పంతులుచుక్క వేగుచుక్క

వ్రాలు : నుడివంతువ్రాలు

వాసి : విసికిడి, వంతు

విరి : వితి, అలరు, నన, పూవు, పువు పువ్వు

విన్ను : గాలితండ్రి, చదలు, చుక్కల తెరువు, దివము, నింగి, మబ్బుత్రోవ విను, విన్ను, మిను, మిన్ను, మింగిలుదారి, తలి తండ్రి, వేల్పుదెఱువు

విల్లు : అమ్ము

విడి : ఎఱ్ఱి, తోఁకరు, కొంజాడు

వింత : క్రొత్త

విడుపు : దసిలీ, విడుదల, మాను

విత్తనము : మగగురినుండి యాడుగుఱి నబడి పిల్లలనొదవించుగింజ

వీలు : వల్ల, అలవి

వీపు : వెన్ను, వెనుక

వెలిమ్రాను : వేలుపుచెట్టు

వెరవేకి : ఆల్మగల ఎడబాటు సెప్పగ

వెరవు : అనువు, వయిపు

వెరవు : ఎత్తుగడ, మందు

వెల్లంకి : మోటు, మందుదినుసు

వెకలి : వెంగలి, ఎడ్డె

వెల్లి : వఱద

వెంబరవిత్తు : ఆకతాయిలలో పెండటి వాఁడు

వేల్పుడు : చాగుబడిక, మునుకవేసి మడి కట్టుకొని వేల్పునిదపై మిడియాలు చదువు చా వేల్పు వెయిపేర్లనుచు విరాలు వైచుట

వేరుపాటు : అరమర

వేల్మి : వేల్మినంచు పసతీసి క్రాగడు వంచరకము తివ్వ వేల్పులకు నిప్పులో నెయ్యి పొందలగు దినుసుల మిడియలు చదువుచు వేల్చు పని

వేల్మలు : వేల్పులకై నిప్పమంటలో పంకము, నెయ్యి పొందలగు దిన్సులు వేల్చు కొలుపులు

వేలు : వాలి, ఒండు

వేల్పుకు : చాగుబడిక

వేరిమి : వేరుపాటు

